ఫిబ్రవరి 1996

రూ 6/-

# చతుర

The Largest
Circulated
Telugu Monthly



కన్సొలేషన్ బహుమతి
పొందిన నవల

ఎ. అప్పల్నాయుడు
పునరావాసం

# చతుర ప్రపంచం

## ముదితా చరితము

ప్రస్తుతం స్త్రీలు అన్నిరంగాల్లోనూ పురుషులతో సమానంగా, కొన్నిచోట్ల వారికంటె అధికంగా కూడా అభివృద్ధిపథంలో పయనిస్తున్నారు. పురుషులే తప్ప స్త్రీలు పనిచేయడం కష్టమనుకున్న ఉద్యోగాల్ని కూడా మహిళలు సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.

అసలు మొట్టమొదట స్త్రీలు సామాజిక దురాచారాలను అధిగమించి, ఉద్యోగ రంగంలోకి అడుగుపెట్టినది 1882 నుంచి. 1882లో మొట్టమొదటి భారతీయ మహిళా గ్రాడ్యుయేట్‌లుగా మన్ననలు పొందింది కలకత్తాకు చెందిన కాదంబినీబోస్, చంద్రముఖిబోస్ అనే స్త్రీలు. వీరు కలకత్తా విశ్వవిద్యాలయంనుండి తమ పట్టాలను పొందారు.

1901లో మొట్టమొదటిసారిగా మహిళలు కూడా గనులలో పనిచేయడానికి అంగీకరించింది ప్రభుత్వం. 1903 నాటికి దేశం మొత్తంమీద గనులలో పనిచేసేవారి సంఖ్య 14,774కి చేరుకుంది గానీ 1937 వచ్చేసరికి గనులలో స్త్రీలు పనిచేయడాన్ని మళ్లీ నిషేధించింది ప్రభుత్వం.

1903లో రవీంద్రనాథ్ ఠాగూర్ కుటుంబానికి చెందిన సరళాదేవీగోసాల్ అనే ఆమె స్వదేశీ వస్త్రాలనమ్మే దుకాణాన్ని ప్రారంభించింది. 1904లో ముత్తులక్ష్మి అనే మహిళ మద్రాస్ విశ్వవిద్యాలయంనుంచి వచ్చిన మొదటి లేడీ డాక్టర్‌గా గుర్తింపు పొందింది. 1909లో స్త్రీలు అధికపాత్ర నిర్వహించిన ఓ వ్యవసాయ వస్తుప్రదర్శనశాల దేశంలో ఎంతోమంది మహిళలకు స్ఫూర్తినిచ్చింది.



1920లో మద్రాస్ సెనేట్ సభ్యురాలిగా కుమారి రుక్మిణి అమ్మ అనే యువతి ఎన్నికయింది. ఆమెకు అప్పటి ప్రభుత్వం 'కేసరిహింద్' అనే బిరుదునిచ్చి సత్కరించింది.

1926లో కలకత్తాకు చెందిన కమలాదేవి ఛటోపాధ్యాయ అనే మహిళ లెజిస్లేటివ్ అసెంబ్లీకి పోటీచేసి కేవలం 600 ఓట్ల తేడాతో ఓడిపోయింది. 1927లో తమిళనాడుకు చెందిన సుబ్బలక్ష్మి, శారద అనే అప్పచెల్లెళ్లు లేడీస్ యూనియన్‌నొకదానిని ప్రారంభించి మొట్టమొదటి లేడీస్ టీచర్ ట్రెయినింగ్ సెంటర్‌ని నిర్వహించారు. 1939లో మణిపూర్‌కు చెందిన స్త్రీలు బియ్యం అక్రమ రవాణా చేసే వ్యాపారులకు వ్యతిరేకంగా ఓ పెద్ద ర్యాలీ నిర్వహించారు. 1945లో నేతాజీ సుభాస్‌చంద్రబోస్ మొట్టమొదటి లేడీ బెటాలియన్‌ని ఝాన్సీలో స్థాపించారు.

1948లో ఏర్పడిన మొట్టమొదటి ఫ్యాక్టరీ యాక్ట్‌లో ప్రమాదకర ఉద్యోగాలనుంచి స్త్రీలను నిషేధించాలని సూచించింది ప్రభుత్వం. కానీ అదేసమయంలో స్త్రీలకు ప్రోత్సాహకరంగా మరొక చట్టం చేసింది ప్రభుత్వం. అదేమంటే స్త్రీలు పనిచేసే ప్రభుత్వ లేదా ప్రయివేటు సంస్థలు వారి బిడ్డల భద్రతకి ఓ క్రషను కూడా ప్రతి సంస్థా నిర్వహించాలని షరతు విధించింది.

1952లో గనుల చట్టాల్లో స్త్రీలకు ఉపయోగించేవిధంగా చేసిన సవరణల్లో వారు తలల మీద మోసే బరువును తగ్గించడమొకటి. 1962లో పంజాబ్‌లో కొన్ని సమ్మెల అనంతరం లేడీడాక్టర్స్ సివిల్ సర్జన్ల పోస్ట్‌లలో భర్తీ చేయబడ్డారు. 1975లో ప్రభుత్వం నియమించిన ఓ కమిటీ భారతీయ మహిళకి ఇవ్వాల్సిన గౌరవస్థానాన్ని గురించి వివరిస్తూ 480 పేజీల నివేదికను విడుదలచేసింది.

1976లో స్త్రీలకు పురుషులకు కూడా సమాన వేతనాలను ఇవ్వాలని సూచించే 'ఈక్వల్ రెమ్యూనరేషన్ యాక్ట్'ను ప్రవేశపెట్టింది ప్రభుత్వం. ఇలా మహిళాభ్యున్నతి కాలానుగుణంగా ప్రగతిశీల పరిణామాలను పొందుతూవచ్చింది.

## చేతులే సర్వస్వంగా...

ఈరోజుల్లో కరాటే, జూడో, కుంగ్‌ఫూల గురించి విననివారుండరు. ఇండియాలో చాలా చోట్ల కరాటే నేర్పే క్లబ్బులున్నాయి. పోలీసు శాఖల్లో కరాటే టీచర్లను పెట్టి పోలీసులకు శిక్షణనిప్పిస్తోంది ప్రభుత్వం. దీనికిగాను జపాన్‌నుంచి ఎందరో కరాటే యోధులు ఇండియా వస్తున్నారు.

ప్రస్తుతం కరాటే యోధులు జపాన్‌లో ఎక్కువగా వుంటే వుండవచ్చుగానీ ప్రాచీన కరాటే విద్యమాత్రం పుట్టింది ఇండియాలోనే. కరాటే గూర్చిన ప్రస్తావన, వివరణ బౌద్ధగ్రంథం 'లోటస్ సూత్రలో వుంది. 'శుక్రనిధి', 'అగ్నిపుత్ర... మొదలైన ఎన్నో బౌద్ధగ్రంథాల్లో కూడా నిరాయుధంగా యుద్ధం చేసే విద్యగా దీన్ని ప్రస్తావించారు. క్రీ.శ. 520లో బోధిధర్మ అనే ఓ బౌద్ధభిక్షువు ఈ కరాటే నేర్పడానికి చైనా పంపబడ్డాడు. బౌద్ధమత ప్రచారంకోసం వెళ్లిన బౌద్ధ సన్యాసులు ఇతర మతస్థులనుంచి ఎన్నో ఇక్కట్లను ఎదుర్కొనేవారు. అలాంటప్పుడు తమను తాము రక్షించుకుందుకు ఏ ఆయుధాన్ని పట్టనవసరం లేని కరాటే విద్యను నేర్చుకుని వెళ్లేవారు.

అయితే... చాలాకాలం ఈ విద్యను గుప్తంగానే వుంచారు బౌద్ధులు. 1609లో జపనీయులు ఒకనోవాపై దండెత్తినప్పుడు ఆ యుద్ధాల్లో శత్రువులు ఏ ఆయుధాలు లేకుండా పోరాడి గెలవడాన్ని చూసి ఆ విద్యను గ్రహించి, దాన్ని జపాన్‌లో వ్యాప్తిచేశారు. అయితే దీనికి సంబంధించిన పూర్తి వివరాలు వీరికి తెలియకపోవడంతో అది పూర్తిగా









వ్యాప్తిచెందకపోయినా 1960లో ఇండోచైనా యుద్ధంలో ఉపయోగించబడిన కరాటే ప్రపంచంలో చాలా దేశాలను ఆకర్షించి ఎన్నో చోట్ల వ్యాప్తిచెందింది.

అసలు కరాటే అనే పదానికి అర్థం 'కేవలం హస్తం' అని, కేవలం చేతితో శత్రువుని ఓడించడం. మామూలు మనిషికి చేతులంటే కేవలం చేతులే. కానీ కరాటే వీరుడికి చేతులే సర్వస్వం. జపాన్‌లో ఓ కరాటే వీరుడు ఏభై ఎద్దులను ఒక్కసారి ఎదుర్కోగలడు. న్యూయార్క్‌లో కూడా ఇప్పుడు చాలామంది కరాటే నేర్చుకుని రౌడీలనుంచి తమను తాము రక్షించుకుంటున్నారు.

కరాటే నేర్చుకోవడం అంత తేలికైన విషయం కాదు. దానిలోని మౌలిక నిబంధనలు, పట్లు తెలుసుకునేందుకే 8 నెలలు పడుతుంది. అటుపైన మరికొన్ని మెళకువలు నేర్చుకుని ఓమాదిరి ఛాంపియన్ అవడానికి మూడేళ్లు పడుతుంది. మొదట వైట్‌బెల్ట్ సంపాదించుకున్నాక మరో మూడేళ్లు కఠినాతి కఠినమైన ప్రాక్టీసు చేశాక బ్లాక్ బెల్ట్ తెచ్చుకోవచ్చు. బ్లాక్‌బెల్ట్‌లో కూడా 8 వరకూ డిగ్రీలున్నాయి. 1977 వరకు ఇండియాలో కేవలం 7 గురు మాత్రమే బ్లాక్‌బెల్ట్ హెూల్డర్స్ వున్నారు.

చాలామంది కరాటే అంటే చేతులు తిప్పడమే అని భావిస్తారు. కానీ ఇదొక శాస్త్రీయమైన యుద్ధవిద్య. మన శరీరంలో ఎన్నో సునిశితమైన భాగాలున్నాయి. మెళకువ తెలిసిన కరాటే వీరుడు సున్నితమైన భాగంలో ఒక్క దెబ్బ వేస్తే చాలు, అవతలి వ్యక్తి పడిపోతాడు. తిరిగి లేవడు.

కేరళలో కొంచెం మార్పు చేయబడిన కరాటే దర్శనమిస్తుంది. దీనిని 'కలారి పయత్' అంటారు. మళయాళంలో కలారి అంటే శారీరక వ్యాయామం, పయత్ అంటే కలియబడుట. అయితే కరాటేకి, కలారి పయత్‌కి కొన్ని ముఖ్యమైన తేడాలున్నాయి. కలారి పయత్ ఆయుధాలు కూడా ఉపయోగించవచ్చునంటుంది. అంటే శత్రువుని చేతులతోను, ఆయుధాలతోను కూడా ఎదుర్కోవాలంటుంది కలారిపయత్.

పూర్వపురోజుల్లో కేవలం యుద్ధసైనికులకే పరిమితమైన ఈ విద్యలు ప్రస్తుతం సామాన్య మానవులు కూడా నేర్చుకోవడం ఎంతో అవసరం అంటున్నాయి ఇప్పటి ఆధునిక సమాజ పరిస్థితులు.

కవర్‌ఫోటో: వి.సత్యమూర్తి



## స్వపరిచయం

నలభైయేళ్ళ క్రిందట-విజయనగరం జిల్లా 'గుమ్మడ' గ్రామంలో జన్మించేను. శ్రీకాకుళ గిరిజనోద్యమం సాయుధ దశకు చేరేకాలంలో నేను యవ్వనంలోకి వచ్చేను. విప్ల వోద్యమం, విప్లవ సాహిత్యమూ నన్నాకర్షించేయి... సహజంగానే.

నా తొలి కథ 'పువ్వుల కొరడా' ప్రచురించిన సృజన మాసపత్రిక... నన్ను విరసం సభ్యుని చేసిందని చెప్పొచ్చు. ఏజెన్సీకి ఆనుకున్న మైదానంలో పెరిగిన నేను, ఎన్నో ఆ ఉద్యమ ఘటనల్ని ససాక్ష్యంగా విన్నాను. 1988లో 'పోడు-పోరు' పేర్న నా పది కథలను సంపుటిగా తీసుకొచ్చేను. దాదాపుగా ఏభయిదాకా కథలు... ప్రచురణ అయినాయి వివిధ పత్రికల్లో. ఈ ఏడాది స్వాతి వారపత్రిక నిర్వహించిన సాధారణ కథల పోటీలో నా కథ 'సంతోష చంద్రశాల'కు ద్వితీయ బహుమతి వచ్చింది. కేంద్ర సాహిత్య అకాడమీవారి 'ఒకతరం తెలుగు కథ' సంకలనంలోనూ, మరికొన్ని సంస్థల సంకలనంలోనూ నా కథలు చోటుచేసుకున్నాయి.

1993లో అఖిలభారత స్థాయిలో ఆకాశవాణివారు నిర్వహించిన నాటక పోటీలలో నా నాటకం 'మడిసెక్క'కు ప్రథమ బహుమతి వచ్చింది. నాటక రచనలో... తొలి అనుభవమే అయినా ప్రథమ బహుమతి వచ్చినందుకు, అది నా గొప్పతనంగా భావించడం లేదు. ఇతివృత్తమే గొప్పది. అలాగే నవలా రచనలో తొలి ప్రయత్నమే అయినా 'పునరావాసం'నకు బహుమతి రావడమైందంటే... ఇతివృత్తానికి గల ప్రాధాన్యతే అని భావిస్తున్నాను.

ఏ జీవితాలైతే ఈ ప్రపంచ గమనానికి కారకాలో ఆ జీవితాల వెలుగులకోసం అక్షరదీపం అందివ్వటమే కర్తవ్యంగా భావించి కలం పట్టేను.

ఆదరించిన పాఠకులకూ, ప్రచురిస్తోన్న పత్రికలకూ కృతజ్ఞతలు.

-ఎ. అప్పల్నాయుడు

# చతుర

సంపుటి: 19    సంచిక: 1    ఫిబ్రవరి: 1996

చిమ్మచీకటిలో ఆ అడవిలో తాతతో కలిసి ప్రాణభయంతో పరుగెడుతోందా యువతి. ఆ వేగానికి తట్టుకోలేని ముసలిప్రాణం దారిలోనే అనంతవాయువుల్లో కలిసిపోయింది.

తల్లడిల్లిపోయిన ఆమె పెట్టిన హృదయవిదారకమైన కేక అడవిలో ప్రతిధ్వనించింది.

అంతలోనే ఏ క్రూర జంతువుదో భయంకర గర్జన వినిపించింది. శవాన్ని అక్కడే వదిలేసి పరుగందుకున్న ఆ అమ్మాయి... కాసేపటికే ఆ కారడివిలో స్పృహ తప్పింది.

అటుపైన...?

అడవిలోపుట్టి... అక్కడే పెరిగిన ఆ యువతి తన పాతికేళ్ళ జీవితానుభవాల్నుంచి నేర్చుకున్న అసలు పాఠం ఏమిటి?

అడవిపుత్రుల జీవితాల్లోని ఆటుపోట్లను హృదయాల్ని హత్తుకునే శైలిలో అక్షరబద్ధం చేసి, నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి రూ. 5000/- పొందిన ఎ. అప్పల్నాయుడు రచన 'పునరావాసం' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



**పొ**ద్దు పడమటి కొండల్లో ఆఖరి చూపులో వుంది. అప్పటికే కొండల దిగువ తులప్ (అడవి) నల్ల దుప్పటి చుట్టేసుకుంది. కొండ మీద నుంచి జోడా (సెలయేరు) పెనుభూత మేదో వెంటాడితే పారిపోతున్నట్లుగా క్రిందకి ప్రవహిస్తోంది. అడవి నిండుగా రకరకాల వృక్షాలు... కొమ్మల హస్తాలను చాచి ఎవ రినో పిలుస్తున్నట్లుగా వున్నాయి. చీకటి నిండిన ఆ అరణ్యంలో విప్పచెట్టుమీంచి పాలపిట్ట ఒకటి బొయ్యిన వీచే గాలికి బెదిరి పోయి, చిన్న పిల్లాడిలా యేడుస్తోంది. అక్క డెక్కడో అలీప్ (కొండమేక) దారితప్పిపోయి భయంతో అరుస్తోంది! మరికొద్ది సేపటికే పొద్దు పూర్తిగా మలిగిపోయింది.

దక్షిణకొండ దట్టమైన చీకటిలో మునిగి పోయింది. దారి కన్పించటంలేదు. మరో ఫర్లాంగు దూరం ఆ అడవిలోంచి నడిస్తే కొండ ఎక్కేదారికి వచ్చేయొచ్చు. అడవిదా రిలో నిలబడి... చుట్టూ చూసింది బంతి! కన్ను పొడుచుకున్నా కన్పించటం లేదు దారి! దోవకడ్డంగా పడిపోయేడు జూజూ (తాతయ్య). చేత్తో జూజూను తడిమింది. జూజూ తల దగ్గర కూర్చొని పిలిచింది. బదులు రాలేదు. తలపట్టుకు కదిపింది. అయినా చలనంలేదు! భయపడుతూ శ్వాస పరీక్షించింది. శ్వాస ఆగిపోయింది.

"జూజూ...!" అని, బంతి గుండెల్లోంచి పోటెత్తిన దుఃఖంతో కేకేసింది. "జూ'' అంటూ అడవీ, కొండా ప్రతిధ్వనించేయి. తాతయ్య గుండెలమీద పడి ఏడ్వసాగింది బంతి.

చీకటి అడవిలో దారితప్పిన దూడలా వుంది బంతి! దారి చూపాల్సిన గోమాత మృతిజెందితే భయపడ్డ దూడ అయ్యింది బంతి! భయం భయంగా అడవిని చూసింది. తాతయ్య శవాన్ని చూసింది. చిన్న నాటి నుండీ తాత ఒడిలో, తాత నీడలో పెరిగింది బంతెమ్మ! అనుభూతులన్నీ తలపులోకొ చ్చేయి. మిగిలిన ఈ ఒక్క పెద్దదిక్కూ పోయింది. దుఃఖం కెరటాలుగా యెగిసి పడుతోంది గుండెల్లో బంతెమ్మకు.

అందరూ పోయి ఒంటరిగా మిగిలేనన్న వేదన బంతెమ్మను శోకముద్రను చేసింది. జూజూ తల దగ్గర కూర్చొని, రూపెత్తిన విషాదమూర్తిలా యేడుస్తూ, బంతెమ్మ గుండెలు బాదుకొంటూ-

"జీనా సోనోం జీనాబోనా - ఏదెయ్యం యే దేవత

దమ్‌తే దొంగ్‌సోయ్ - ఊౠరేసిందో నిన్ను

జామమ్‌తే దొంగ్‌సోయ్ - తినేసిందో నిన్ను

లైతోలం దొంగ్‌సోయ్ - రాలిపోయేవు నువ్వు

గలోలం దొంగ్‌సోయ్ - జారిపోయేవు నువ్వు

దనాకిత్ దేశాంగ్ - పరలోకం పోయేవు

సవర భాషలో శోకగీతం ఆలపిస్తోంది.

వాళ్లలో ఎవరైనా చనిపోతే చనిపోయిన వారి రక్త సంబంధీకులు ఈ శోక గీతం ఆలపిస్తూ విలపిస్తారు. ఇరుగూ, పొరుగూ ఊరు మొత్తం చేరి కంట తడిపెట్టుకుని ఆలకిస్తారు యీ శోకగీతాన్ని.

ఇరుగూలేదు, పొరుగూలేదు. పిట్ట మనిషి తోడులేదు. ప్రేగులు కడుపులోనే తెగిన ధ్వని లా... అడవిలో కలిసిపోయింది శోకగీతం! సెలయేరు... ఓ క్షణం ఆగి కంటనీరుకార్చి ప్రవహించింది. గాలిలో ఆకుల కంటి రెప్ప ల్ని కదపకుండా బంతెమ్మను చూస్తోంది అడవి. నెమలిపిట్ట నాట్యమాపేసింది. కోకిల మ్మ పాట మరిచిపోయింది. చందమామ కన్పించక ఆకాశం మంచుధారగా యేడు స్తోంది. బంతెమ్మ గుండెలవిసేలా ఏడు స్తోంది. కొండలు కరిగేలా యేడుస్తోంది.

అకస్మాత్తుగా అడవిలో ఆ కొసనెక్కడో వెలు గు కన్పించింది. టార్చి కాంతిలా కన్పించింది. దుఃఖాన్ని గుండెల్లోనే అదు ముకొని... యేడుపు ఆపింది. కాంతి కదలిక




చూసిన బంతెమ్మకు వెన్నుపూసలో భయం ప్రాకింది. గబాల్న లేచింది. తాతయ్య శవాన్ని యెత్తుకోటానికి ప్రయత్నించింది. అలవి కాలేదు. ఇక లాభంలేదు. తప్పదు, గుండెలు దిటవు పర్చుకోవాలనుకుంది. కన్నీటిని తుడుచుకుంది. కర్తవ్యాన్ని గుర్తు తెచ్చుకుంది. కడసారిగా తాతయ్య నుదుటిమీద ముద్దుపెట్టింది. శవాన్ని ఈడ్చుకొని దారికి కొంతదూరంలో పక్కగానున్న మామిడిచెట్టు మొదలుకు చేరవేసి, చేతులెత్తి మొక్కింది. గబగబా అక్కడినుంచి కదిలి, అడవిలోంచి దక్షిణ కొండకు దారితీసింది.

వెనుకగా, దూరాన టార్చిలైట్ వెల్తురేదో తరుముతున్నట్టే వుంది. బంతెమ్మ పందేర్ (కుందేలు) లాగా పరుగులాంటి నడకన కొండ యెక్కుతోంది. కొండ సగానికి పైగా ఎక్కేసింది. ఎగశ్వాసతో ఆగింది. కిందకి చూసింది. అడవి చీకటిగా వుంది. తనను తరిమిన వెలుతురెక్కడా కన్పించలేదు. గుండెలు కుదుటపడ్డాయి.

అలసటగా పక్కనేవున్న బండరాయిమీద కూర్చుంది. కాళ్ల పీకుడు...! ఆకలికి ప్రేగుల కేకలు! ప్రాణభయంతో, పరుగెత్తి పరుగెత్తి అలిసిపోయింది. తాతయ్యను ఈడ్చుకుంటూ, తమ స్థితికి ఏడ్చుకుంటూ నిద్రాహారాల్లేకుండా తమ వలసనుండి దారి తప్పించి అడవులూ, కొండగుట్టలూ దాటి పరుగెత్తింది రెండు రోజులుగా. ఇంతలో ఈ ఘోరం! దారి మధ్యలోనే తనకు అండగా నిల్చిన జూజూ... రాలిపోయేడు. బండమీద అలసటగా కూర్చున్న బంతెమ్మ తన వలసను తల్చుకుంది. తన వలసలో జనాలను తలుచుకుంది. తనలాగే నిప్పుల మూటలుపడ్డ చీమపుట్టల్లా చెల్లాచెదురైన తన జనం యేమైనారోగదా! ఎందుకిలా జరిగింది? తమకోసం వెలిసాయంటున్న ఆఫీసులూ, కోర్టులూ, పాఠశాలలూ, యేవీ ఎందుకు తమని క్షేమంగా బతకనీయలేదు? నా దేవుడు... భీముడ్ని, తన తండ్రినీ వైకుంఠపాళిలో యే పాములు తనవారిని మింగేస్తున్నాయి? మెదడంతా ప్రశ్నల్తో అలసిపోగా... అలా ఓ క్షణం కనులు మూసి, నిదురలోకి జారింది బంతెమ్మ.

ఎక్కడో తుపాకీ పేలిన శబ్దం కొండల్లో మార్మోగింది. గుండెలు దడదడా కొట్టుకోగా... ఉలిక్కిపడి లేచింది బంతెమ్మ. మళ్లీ పరుగు ప్రారంభించింది! పరుగెడుతూ ఆలోచిస్తోంది. ఎన్నాళ్లని పారిపోయి బతుకు తాము? అయినా, తన ఒక్కప్రాణంకోసం మరెందుకు పరుగెత్తటం? వెనక్కి, వలసకి వెళిపోతేనో? వెనక్కి వెళ్లి మాత్రం యేం చేయాలి? ఎవరికోసం వెళ్లాలి? కనీసం ముందుకి వెళ్తే తాతయ్య చెప్పిన తన బంధువుల యిల్లు చేరచ్చు. తన నాయనమ్మ కన్నవారిల్లు అది! కొండ అవలివైపు దిగుతోంది. దీపాల్తో గుడిసెలు కన్పిస్తున్నాయి కొండ దిగువ. అక్కడే, ఆ వలసలోనే... తన ముత్తాత (నాయనమ్మ తండ్రి) వుంటున్నాడు. ఆ దిక్కుగా నడక వేగం పెంచింది. ముళ్లూ, రాళ్లూ... వేటినీ లెక్కజెయ్యటంలేదు. ప్రాణభయంవల్ల యివేవీ లెఖ్ఖలోకిరావు.

అదే ప్రాణభయంతో యేదో జనుంతర్ (అడవి జంతువు) అటునించి అరుస్తూ వొస్తోంది. బంతికి గుండెలు చల్లగా అయిపోయేయి. భయం వెన్నుపూసలో మరోసారి కదిలింది. జంతువు కన్పించదు. అరుపేమో విన్పిస్తోంది. దారి మార్చి... పరుగెత్తింది. అయినా అరుపు విన్పిస్తోంది. ఏం చేయటం? జనుంతుర్‌కి యెదురు పడిపోనుగదా? అపాయమేదో శబ్దం చేస్తోంది. గానీ దాని ఆచూకీ తెలీటంలేదు. రెండు రోజులుగా అపాయానికి అందకుండా సాగించిన యాత్రలో బంతెమ్మ అలిసిపోయింది. కాళ్లు తేలిపోతున్నాయి. కళ్లు తిరుగుతున్నాయి. గొంతుక తడారిపోతోంది. సరిగ్గా అప్పుడే ఆ జంతువు అరుపు దగ్గరగా విన్పించింది. భయంతో వెర్రికేక

వేసింది బంతెమ్మ. అలా కేకవేస్తూ అదిరిపడ్డ బంతెమ్మ, కాలు రాయిమీంచి జారిపడిపోయింది. అదృష్టవశాత్తూ యే బండలకూ గుద్దుకోకుండా ఆ రాయిమీంచి కిందకి తూలిపోయి పోడుమీది అరప పాకలో పడింది. అరపమీద పోడుపంట కాపుకు కూర్చున్న సొంబరి ఈ శబ్దానికి కిందకి దిగి చూసేడు... దివిటీ పట్టుకొని.

బంతెమ్మ స్పృహ తప్పిపోయింది. కట్టిన చీర చిరుగులుపడింది. కాళ్లూ చేతులూ రాళ్లకూ ముళ్లకూ గీరుకొని రక్తాలోడుతున్నాయి. సొంబరి గభాల్న గెడ్డకు వెళ్లి, గెడ్డనీటిలో తుండుగుడ్డ ముంచి తడిపి తీసుకొచ్చేడు. బంతెమ్మ మొహమ్మీద తుండుగుడ్డను పిండేడు. మొహాన్ని శుభ్రంగా గుడ్డతో తుడిచి, ఓ క్షణం తుండుతో గాలి విసిరేడు. కొంతసేపటికి బంతెమ్మ తేరుకుంది. కళ్లు తెరిచింది. ఎదుట ఒక మనిషి కనబడడంతో కొంత ధైర్యం కలిగింది. మనసులో కల్లోలం తగ్గింది. ఊరటగా లేచి కూర్చుంది.

సొంబరి ఆమెనే చూస్తున్నాడు. మనిషి చూస్తే.. తన సవరజాతి మనిషిలాగనే వుంది. కాకపోతే కొంత నాగరీకంగా వుంది. ఈ రాత్రి వేళ ఒంటరిగా ఎక్కడికెళ్తోంది? ఇలా పడిపోయిందేమీ? ప్రశ్నలు సొంబరిలో కదులుతున్నాయి. ఆ ప్రశ్నలకు జవాబులు దొరకకపోయినా యేదో ఆపదలో వున్న ఆడకూతురు... అని మాత్రం అనుకున్నాడు. ముందు ఆమె నిమ్మళమైందో లేదో తెలుసుకోవాలని ఆమెను,

"ఆసూ కాపో?" (కులాసాయేనా?) అని అడిగేడు.

కులాసాయే అన్నట్టుగా బంతెమ్మ తల ఊపింది. సొంబరి, యిక ఆమె వృత్తాంతం కోసం అడగబోతుంటే బంతి,

"ఆరిక అడ్డాయి నీకు తెలుసా?" అనడిగింది.

"యే అడ్డాయ్? సామంతు అడ్డాయ్?" అనడిగేడు సొంబరి.

బంతి ఆలోచనలో పడింది. తాతయ్య ఈ భోగట్టా చెప్పలేదు. తనకీ తెలీదు. ముత్తాత సామంతా? ఆలోచనలో వుండగా,

"ఇంతకీ మీదేవూరు?" అనడిగేడు సొంబరి.

"మాది పార్వతీపురం దగ్గర కొండల్లోని జమ్మొలస!" చెప్పింది బంతి.

'జమ్మొలస' ఊరిపేరు సొంబరికి యెప్పుడో విన్నట్టుగానే వుంది. ఎవరో తెలిసిన మనుషుల ఊరే అది! అయితే ఆ తెలిసిన మనుషులెవరా అన్నదే గుర్తులేదు సొంబరికి.

సొంబరి... దాదాపు యేభయ్యేళ్లవాడు. ఆలోచిస్తున్నాడు. తనకు జ్ఞానం తెల్సిన వయసొచ్చిన నుంచి అన్ని సంఘటనలూ గుర్తున్నాయి. తను తిరిగిన వలసలూ గుర్తువున్నాయి. జమ్మొలసే గుర్తు రావటంలేదు.

"జమ్మొలస కంతుడు మా తాత!" అని చెప్పింది బంతి!

అప్పుడు గుర్తొచ్చింది సొంబరికి. తను అయిదేళ్లవాడుగా వున్నపుడు యీ ఒరిస్సా వలసల్లోకి, ఆంధ్రా వలసోడొకడొచ్చి, తమ సామంతు అడ్డాయి పెద్ద కూతుర్ని లాక్కెళ్లాడని, అపుడు పెద్ద యుద్ధమే ఆంధ్రా సవరలకీ, తమకీ జరిగిందనీ విన్నాడు. ఆ తర్వాత కొన్నాళ్లకి అంతా బంధువులైపోయారు. బంధుత్వం బలపడ్డాక వొకసారి వొచ్చాడు కంతుడు! చేయెత్తు మనిషి. చేవదీరిన కండలు. ఒంటినిండా వెండి గొలుసులు. గొమాంగో లాగున్నాడు. అదే చుట్టం! అప్పుడు సొంబరికి పదేళ్ల వయసు! ఆ తర్వాత మరి కంతుడ్ని చూడలేదుగానీ భోగట్టాలు వినేవాడు. సొంబరికి పాతికేళ్ల వయసొచ్చేసరికి కంతుడు కమీనిస్టుల్ని కలిసేడనీ, కంతుడి కొడుకూ కమీనిస్టయినాడనీ అక్కడ పెద్ద యుద్ధమే జరిగిందని విన్నాగానీ యేదీ చూ




డలేదు.

"అయితే ఆ కంఠుడి మనవరాలివా?" అనడిగేడు సొంబరి.

"ఔను..." అంది బంతి.

"అయితె, మీ ముత్తాత... ఆ సామంతే'' అన్నాడు సొంబరి.

హమ్మయ్య! ఊపిరి పీల్చుకుంది బంతి. సొంబరి యింకా యేదో ప్రశ్నలు వెయ్యబో తుంటే నిల్చుంది బంతి.

అప్పటికి తెల్లవారు ఝాము వేళ య్యింది. తూర్పు కొండల్లో పొద్దు ఎరుపు రంగులో మెరుస్తోంది. పక్షుల కిలకిలలు మొదలయ్యాయి. కొండకి దిగువ వలస లోంచి పశువుల అరుపులు వినిపిస్తున్నాయి.

సొంబరి గూడా మరి ప్రశ్నలు వేసే ఉద్దేశం విరమించుకొని, కొండ దిగి, వలస వైపు దారి తీశాడు. తెల్లగా తెల్లవారిపో యింది, యిద్దరూ సామంతు యింటిని చేరు కున్నారు.

మట్టిగోడలమీద, వెదురు వాస పూసిన రెండు గదుల పూరిల్లు అది. ఇంటి ముందు మట్టి అరుగుమీద, గడ్డిబొంత పరుచుకు పడుకున్నాడు సామంతు. ఇంట్లో ముసిల్ది యింటి పనుల్లో పడింది. మట్టి అరుగు ప్రక్కగా పందిరి రాటకు మేక ఒకటి కట్టేసి వుంది. ఇంట్లోంచి కోళ్లగూడు పట్టుకు ముసిల్ది బయటికొచ్చింది. సొంబరి ఆ ముసిలిదా నితో,

"నీ ముని మనవరాలు! నీ పెద్ద కూతురి మనవరాలు..." అన్నాడు. ఆమెకేమీ అర్థంకా లేదు. ఏ కూతురు? ఏ మనవరాలు? ఏ తెగిపోయిన ప్రేగు బంధం? అయోమ యంగా చూస్తోంది.

బంతి ఆ ముసలమ్మను చూసి, నాయన మ్మ పోలికనుగుర్తించాక కనుకొలకుల్లో నీరు నిండింది.

సొంబరి, ముసలిదానితో లాభంలేదని, పడుకున్న సామంతుని లేపాడు. బంతిని చూపించేడు. విషయమంతా చెప్పాడు.

"అడ్డాయ్..." ఆశ్చర్యానందాలొక్కసారే మనసుని ఉక్కిరిబిక్కిరి చేయగా... బంతిని చేరబిలిచేడు. కూర్చోబెట్టుకున్నాడు పక్కనే! అప్పటిదాకా నిభాయించుకున్న బంతి ఒక్క సారిగా గట్టుతెగిన ప్రవాహమైంది. భోరున యేడ్చింది. యేడ్చి, యేడ్చి...

"నాకిక యెవరూ లేరు. పైన ఆకాశం, కింద భూమీ... ఆదుకుంటే ఇక మీరు తప్ప మరెవర్లేరు'' అంది బంతి.

సామంతు అడ్డాయ్‌కి అంతా అయోమ యంగా వుంది. తన అల్లుడు కంఠుడు ఏమైనాడు? తన కూతురు ఏమైంది? మనవ డేమయ్యేడు? అంతా యేమయినారు? ఏటి జరిగింది? జరిగినదంతా తనకెందుకు తెలి యలేదు?

అందరి గురుతుగా, యీ మునిమనవరా లు మిగిలిందా? ఈ మునిమనవరాలు... యే బాధలు మోసుకొచ్చింది? ఏ గాథలు కడు పుల దాచుకుంది? "ఏటి తల్లీ? ఏటయ్యింది బిడ్డా... ఏటయ్యింది?"

బంతి ఎలా చెప్పటమా అని ఆలోచి స్తోంది. ఎక్కడనించి ప్రారంభించటం? తాత య్య చావునుంచి చెప్పటమా? తన తండ్రి కాలంనాటి పోరాటం గురించి చెప్పడమా? తన పుట్టుకనుంచి చెప్పడమా? ఆలోచి స్తోంది.

పాతికేళ్ల బంతెమ్మ... ఎలా చెప్పగలదు?

ఏభయ్యేళ్ల అడవి కథంతా చెప్తేగానీ ము త్తాతకు అర్థమవదు. బంతెమ్మకు మాత్రం అంతా తెలుసా?

బంతెమ్మ తనకు తెలిసిందే చెప్పినా, ఆమెకీ లోకానికీ తెలియనివీ, అర్థంకానివీ ఎన్నో, ఎన్నో ఘటనలు ఆ అడవిలో జరిగి పోయేయి.

  




యీ కొండోళ్ల పనే బాగుంది. కోలన్‌లు, సబ్సిడీ స్కీములు, పిల్సి, పిల్సీ ఉజ్జోగాలు! గవరమెంటుకి ముద్దు బిడ్డలయిపోనారు. ఆ గురువు పుణ్యాన" అన్నాడు సింవాచెలం మేస్త్రీ తాపీ పనిచేస్తూ గంగమ్మతో.

"మరేటి? ఆళ్ల ఆడోళ్లని సూసేవా? ఇంత కుమునుపు జాకెట్టు గుడ్డవెయ్యిడం యెరగనోళ్లు యిపుడు లోబాడీలు యేస్తన్రు'' అని మేస్త్రీ మాటను బలపర్చింది గంగమ్మ గమేళాతో సిమెంట్ అందిస్తూ.

"అడ్డమయిన సోకులూ ఆళ్లకి, మన పల్లపోలే నేరుపుతంద్రు. అందులోకీ, యిక్కడికొచ్చిన యీ ఉజ్జోగస్తులూ, కాంట్రాటర్లూ... యీళ్లని చెడగొట్టెస్తన్రనుకో'' చెప్పాడు సింవాచెలం, గిరిజన్లను పాడుజేసేది పల్లపు ప్రాంత మనుషులే అని. ఆ మాటకు గంగమ్మ-

"ఎక్కడా నోరు జారకు. చిన్న భోగట్టా'' అంది లోగొంతుతో.

"యేటీ?" అంటూ, ఉత్సుకత నిండగా, గంగమ్మ దగ్గరకు వచ్చేడు మేస్త్రీ.

"కంతుడి మనవరాలు బంతిని సూళ్లేదుగావాల నువ్వెపుడు? పేరంటానికొచ్చినట్టుగ ముస్తాబయి వొస్తాది పన్లోకి! ఆ సూపరువైజరు రాజుబాబు కళ్లన్నీ దానిమీదే'' అని గుసగుస లాడింది గంగమ్మ.

"నిజమేనేటే?" ఆరా దీసేడు మేస్త్రీ.

"నా మాట అబద్ధమైతే యీ పొద్దు సూడు'' అని, చూడమంది గంగమ్మ.

అప్పుడు ఉదయం తొమ్మిది గంటలవేళ! కోలన్ పనుల్లోకి దిగేరు మేస్త్రీలూ, కూలీలు. కోలన్ అంతా అలికిడిగావుంది. కూలీల కేకలూ, గమేళ్లు విసిరినపుడు శబ్దాలూ... ఎవరివో పిలుపులూ... ఎక్కడివో పక్షుల అరుపులూ, గాలికి ఆకుల గలగలలూ.

బంతి పనిలోకి వొస్తోంది.

గంగమ్మ మేస్త్రీకి సైగజేసింది అటు చూడమని. మేస్త్రీ చూపుల సున్నం వేస్తూ వుండిపోయేడు.

ఆకుపచ్చ లంగా, జాకెట్ మీద ఎర్రవోణీ... పదహారేళ్ల బంతి గుండెలమీద అరుణ రేఖలా మెరుస్తోంది. తలకు స్నానం జేసిందేమో, వొదులుగా వేసిన శిగలోంచి వంకీలు తిరిగిన జుత్తు గమ్మత్తుగా బంతి మొహమ్మీదుగా విసురుతుంటే చేతుల్తో బంతి జుత్తును వెనక్కి సర్దుతోంది. పంచరంగుల చిలుక కదిలొచ్చినట్టుంది. గంగమ్మ, ఆ మాట అననే అనేసింది.

"సిలకలాగున్నావు పిల్లా'' అని.

ఆ మాటకు బంతి, సిగ్గులొలికే నవ్వు నవ్వేసి, పనిలోకి దిగింది. ఆ ట్వెన్ను ఎదురుగా వున్న యిటికలను మోసుకు తెచ్చి మేస్త్రీ ముందర వేయసాగింది.

మేస్త్రీ గోడవైపు మరి చూడటంలేదు.

ఆ విషయం గ్రహించిన గంగమ్మ కోపంగా,

"దృష్టి దుకాణమ్మీదా మతి మడపలమీదా అంటార్లే! అలగుంది నీ తీరవ. గోడదిక్కు సూసి, పనిసెయ్యి'' కేకలేసింది మేస్త్రీ మీద.

మేస్త్రీ చూపు మరల్చాడు. ఇటిక ముక్కలు అందుకొని, గోడమీద వేస్తూ, సిమెంట్ వేసి తాపీతో సున్నం పాముతూ... బంతిని మాటల్లోకి దించే ప్రయత్నంగా,

"యేం పిల్లా? మీ తాత అలికిడి లేదేటీ?" అనడిగేడు.

"కురుపాం ఎల్లేడు'' చెప్పింది బంతి.

"మరిపుడెలాగైతే? ఏంపని జేస్తామిలగయితే?" పని ఆపేసి, బంతితో మాటలకి దిగేడు మేస్త్రీ. దాంతో గంగమ్మ,

"యేం? నీ పనికేమీ? నీ తాపీ వొట్టుకుపోనాడా? గమేళా, గజంబద్దా వొట్టుకు పోనాడా?" అనడిగింది. మేస్త్రీ బంతితో మాటలు కలపాలనే అలా ప్రశ్నలు వేశాడని గ్రహించింది గంగమ్మ. అయినా, మేస్త్రీ ఆమె

ను సున్నంలో చిన్న రాయిని తీసిపారేసినట్లు తీసిపారేసి,

"ఓ వెర్రి మొగమా! తెడ్డుంటే సాల్నేటీ? తోపరేసీ గలవేటి? పిండి వుండొద్దా? అలాగే మూడు రోజుల నుంచీ కూల్లులేవు. మెటీరి యలా... సూస్తే యేదీ సరిపోదు. ఎప్పుడు సిమ్మెంటయిపోద్దో తెల్దు! ఇలగైతే యెలగే? గజంబద్ద తోటి స్లేబేసెత్తావే...? యిను ముండొద్దా? తెలిస్తే తెల్సినట్టు మాట్లాడు. లేపోతే తెల్దని నోర్మూసుకో. అంతేగానీ మద్దెలో దూరిపోకు నాయుకురాలిలాగా! నేను మేస్త్రినా? నువ్వు మేస్త్రివా? పని గురించి మాట్లాడ్డంకి! నోర్మూసుకొని గమేళా పట్రా" అని దులిపేసి బంతి వైపు గర్వంగా చూసేడు. గంగమ్మ గుర్రుగా బంతివైపు చూసింది. గమేళాతో సిమెంట్ మేస్త్రీ కాళ్ల దగ్గర దభేలున దించింది. మళ్లీ బంతివైపు చూసి,

"యే పిల్లా అందించిన యిటికలు సాల్నెగానీ, కడవ తీసుకొని, గెడ్డనీరు తెచ్చి... ఆ పెరటిగోడలు తడుపు" అని పని పురమాయించింది, బంతిని అక్కడనుంచి పంపేయాలని. బంతి ఆ ట్వేన్ను యెదురుగా కొంత దూరంలో వున్న స్టోర్‌పాకలోని కడవ తీసుకొని గెడ్డకు బయల్దేరింది. వెల్తోన్న బంతితో,



"కడవ యెత్తుకోగలవా? సాయమొచ్చేదా పిల్లా?" అని కేకేసాడు మేస్త్రీ. బంతి పట్టించు కోలేదాతని మాటల్ని. గంగమ్మ మాత్రం చేతిలో గమేళాను మేస్త్రీ మొహమ్మీదకి యెత్తి

"మూతిమీద పొడిసీగల్ను. సిగ్గేన లేదు మొకానికి. ఇప్పుడికే... యిద్దరమున్నాము. సాల్లేదు. ఊరందరితోటీ సరసాలే' అని కోప్పడింది.

గంగమ్మ కోపాన్ని సిగ్గులేని నవ్వుతో తుడిచేసి,

"తొలి పెళ్లంలాగ నిన్నూ యింటిలుంచీ వొలిసింది. యెనకాల నాతోటి పనికి తీసికిరాడం పొరపాటే'' అన్నాడు మేస్త్రీ.

"ఆ మొకం సూడు! ఇద్దరు పెళ్లాల్ని కూర్చోబెట్టి పోసించే మొకం అది. విధంచెడీ ఈటీవోడితో పోయిన్దానికి సచ్చిందాక చాపల మోతేనట! నా బతుకలగ్గైంది నీ పాలబడి పోయి'' అని దులిపేసింది గంగమ్మ.

సరసాల మేస్త్రీకి గంగమ్మ రెండో పెళ్లాం. పెనిమిటి చనిపోయేక, దిక్కులేక కూలి పనికోసం మేస్త్రీ దగ్గరకొచ్చింది. కూలిపనికి యెనకాల తిప్పుకున్న మేస్త్రీ కొన్నాళ్లకి సర సంలోకి దింపేడు గంగమ్మని. ఆధారంలేని గంగమ్మ... రెండో భార్యగా అప్పట్నించే మేస్త్రీ దగ్గర వుండిపోయింది. గంగమ్మ మాటలకు మేస్త్రి యేం జవాబు యిచ్చేవాడో గానీ, అపుడు మండలం ఆఫీసుకెల్లిన కంతుడు తిరిగి వచ్చేడు. అలసటగా వచ్చి మేస్త్రీ దగ్గరగా యిటిక మీద కూర్చున్నాడు.

మేస్త్రీ కంతుడివైపు చూసేడు. అరవైకి పైబడే వయసుంటుంది. ఆజానుబాహుడూ... నడుం వంచిన కాలం! ఒంటిమీద.. ఒకప్పటి కంపెనీ బాడీకి బదులు ఎవరో ఆఫీసర్ యిచ్చిన పాత టెర్లిన్ చొక్కా మాసికల్తో వుంది. మొలకి గోచీ బదులు... అయిదు మూరల గావంచా చిలకట్టు వుంది. భుజమ్మీద తువ్వాలు రంగు పాలిపోయి చెమ్మ నిండిపోయి వుంది. పిలకజుత్తు కత్తిరించేసి, క్రాఫింగైంది. అదీ రాలిపోయి... బట్టబుర్ర దర్శనమిస్తోంది.

అలా కంతుడి ఆకారాన్ని చూసిన మేస్త్రీ,

"యేటి కంతం మామా? మండలానికెల్నావట? ఎంత వరకొచ్చింది బిల్లు?" అనడిగేడు.

"రేపు రండి, రేపు రండని యిన్నాళ్లలా తిప్పేరా? ఇపుడేమో పని యెంతదక య్యిందో సూస్తారట. సూసింతర్వాత బిల్లు రాస్తారట" చెప్పాడు తాతయ్య ఉసూరు మంటూ.

"రోజూ ఆ సూపర్వొయిజర్ రాజు వొస్తండుగాదేటి? అతగాడు మరి పని సూడ్లేదేటి?" అనడిగేడు మేస్త్రీ.

"అతగాడు పనే సూస్తాడా? పన్లోకొచ్చిన ఆడ గుంటల్నే సూస్తాడా?" అని హాస్యమాడింది గంగమ్మ బంతివైపు వారగా చూస్తూ.

"యేటి సూడ్డంకి గవర్మెంట్ అతగానికి జీతమిస్తంది?" అన్నాడు మేస్త్రీ.

"ఈ ఒక్కపొద్దూ చూస్తాను. రేపు కానీ నా బాకీ ఇవ్వకపోతే గోడలు పొడిపించేత్తానంతండు కంట్రాట్రు జెగ్గారావు!" దిగాలుగా చెప్పాడు తాత!

"అతగాడు గోడలు పొడిసీస్తే మరి మా మూడ్రోజుల కూల్లు బాకీకి మేమేటి పొడిసీయాల?" అనడిగేడు మేస్త్రీ.

కంతుడు యేమనలేదు. మౌనంగా వున్నాడు.

"అద్గద్గో వొస్తంది. ఆ రాజు బావ్ మోట్రు సైకిలు సిదగబొడిసీ'' అని చెప్పింది గంగమ్మ... దూరాన శబ్దం చేస్తూ వస్తోన్న మోటార్ సైకిల్ చూసి!

సూదికొండ కానించివున్న వొలసోళ్లను... కొండదించినారు పదేళ్ల కిందట. అప్పటికి బంతి ఆరేళ్లపిల్ల! కొండల్లో ఎర్రజెండాలు యెగిరినందుకు కొండమీది వలసల్ని కాల్చేసి కొండ దిగువ బతకండన్నారు సర్కా




రు వారు. అలా యీ వలసోళ్లంతా పదేళ్ల కిందట... యిక్కడ పాకలేసుకున్నారు! ఈ పదేళ్ల కాలంల అయిదు సంవత్సరాలు... వారిమీద నిఘాసాగింది.

అనుమానం వున్నవారిని లాక్కెళ్లి లాక ప్పుల్లో కుళ్లబొడిచేవారు పోలీసులు. అజ్ఞా తంలో వున్న నాయకుల ఆచూకీకోసం... అనేకసార్లు చిత్రహింసలకి గురిచేసేవారు. ఒకపక్క భూమి పట్టాలు తాశీల్దార్ ఆఫీ సులో పంచేవారు. మరోపక్క ఆ పట్టా భూమికోసం భూమి స్వాధీనంకోసం భూ మిలో అడుగిడితే పోలీసులు అరెస్టుచేసేవా రు. నిర్బంధమూ, పునరావాసమూ... రెండు చేతుల్లో రెండు ఆయుధాల్నీ ప్రయోగిస్తోన్న కాలం! గిరిజనులు... కల్లోలం మధ్య కాలం గడుపుతున్న రోజులు.

గిరిజన సంఘం... ఆఖరి గుర్తు... ఆరెక సోములు ఆరిపోయేడు. కొండకు ఆనించి వుండే వలసలు కిందకి దిగిపోయేయి. గలగ లా సీకముల గారడీ డబ్బా ధ్వనించేది. తుపాకీ గుళ్లూ ప్రతిధ్వనించేవి. అపుడే ఈ వలస కొండనుంచి కోలనీకి మారింది.

ఎమర్జెన్సీ ఒచ్చి వెళ్లింది.

వలసలోకి ఓరోజు ప్రాజెక్టు ఆఫీసర్‌గారొ చ్చారు. వలస జనాల్ని సమావేశపరిచారు. కంతుణ్ణి తనపక్క కూర్చోబెట్టుకుని ఆ అధికా రిగారు-

"మీ వలసకి కోలనీ శాంక్షనైంది. కుటుంబానికో యిల్లు. నిర్మాణ ఖర్చు అంతా ఐటిడిఎ భరిస్తుంది. అయితే ఈ ప్రాంతంలో అందరూ ఇలాంటి పనులు కాంట్రాక్టర్లకి అప్పజెప్తారు. కాంట్రాక్టర్లు బిల్స్ ప్రిపరేషన్ చేసినంత పకడ్బందీగా పనులు చెయ్యరు. ప్రభుత్వం చేసే కోట్లాది రూపాయల ఖర్చు మీకు చేరకుండా అవుతోంది. గనుక మీ కోలనీ మీరే స్వయంగా కట్టుకోండి. ఒక కమిటీ వేద్దాము మీ వలస జనాల్తో. దానికి మీ సామంతు కంతుడే కార్యదర్శి. కంతుడి పేరున మేము చెక్కులు యిస్తాం. ఇంటి పనులబట్టి బిల్స్ అవుతుంటాయి. మీకు సక్రమంగా బిల్లూ, మెటీరియలూ అందజే సే పూచీ నాది. మీరు కోలనీ దృఢంగా కట్టుకున్నాక మీకు ఇంటికో కొబ్బరిమొక్క ఇస్తాం. సబ్సిడీమీద ద్రాక్షారం గేదెలిస్తాం" అని చెప్పారు.

కంతుడు పొంగిపోయాడు. పీ.ఓ.గారికి చేతులెత్తి మొక్కాడు. ఆనందం నిండిన గొంతుతో-

"బాపూ ఇదిగీనాడు నువ్వు జాకరదేవత పంపితే వొచ్చినట్టుగ మాకోసం వొచ్చినావు. మా గోస యిన్నావు. మా బతుకు సూ సినావు. నువ్వు పూనుకుని మంచి సేస్తానంత న్నావు. మాకదే పదివేలు! నువ్వు సెప్పిన ట్టుగ సొంతంగ కట్టుకుంతాం కోలనీ. నీ మాటమీద నువ్వు నిలబడి సాయంజెయ్యి. మీము నువ్వు సెప్పినట్టుగా నడుసు కుంతాం" అన్నాడు.

అయితే ఆ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గారిని మాట మీద నిలబడనీయలేదు రాజకీయ నాయకు లు. గిరిజన ప్రాంతాల్లో ఉద్యమకారణాన అమలుచేయ తలపెట్టిన అనేక సంక్షేమ, పునరావాస పథకాలు... నేరుగా గిరిజను లకు అందటంలేదు. మధ్యలో దళారులు కొల్లగొడ్తున్నారు. మరోవైపు కీలకమయిన 'భూ సమస్య' కోర్టుల్లో యెక్కి దిగుతోంది. వీటి అన్నిటిపైనా దృష్టి సారించి యెక్కడిక క్కడ గిరిజన సంక్షేమం లక్ష్యంగా చర్యలు తీసుకోవటం ఆరంభించేరు ప్రోజెక్ట్ ఆఫీసర్‌గా రు.

ఎక్కడ, ఏమి జరిగిందో... ఆ పీ.ఓ.గారికి జిల్లా కలెక్టర్‌గా పదోన్నతి లభించింది. మరో జిల్లాకు బదిలీ జరిగింది.

కోలనీకి అందవలసిన బిల్లులు అధికార్ల టేబుళ్లమీద మూలుగుతుండేవి. పునాదులు అయిపోయి గోడలు లేవటానికి డబ్బులు లేవు! కిటికీల యెత్తులదాకా (లెంటల్ లెవెల్)






# కొత్తరకం ఆట

కెనడాలోని 'ఒటైవా' లో ఇటీవల గోల్ఫ్ ఆటల పోటీ జరిగింది, సిల్వార్‌లేక్ గోల్ఫ్ కోర్స్‌లో. ఈ గోల్ఫ్‌కోర్స్‌కు 66 సంవత్సరాల లీబట్లర్ యజమాని. 9 హెూల్స్‌గల ఈ గోల్ఫ్‌కోర్స్ పోటీల్లో పాల్గొనాలంటే 56,000 డాలర్లు అంటే 16 లక్షల 80 వేల రూపాయలు చెల్లించాలి. అయినా 250 మందిదాకా అమెరికా, జపాన్, బ్రిటన్, ఫ్రాన్స్ వంటి అనేక దేశాలవారు వచ్చి పాల్గొన్నారు. పోటీలో గెలిచిన 53 సంవత్సరాల క్రిస్‌పుల్లర్‌కు బహుమతి కింద ఆ గోల్ఫ్‌కోర్స్‌తోసహా మరో పన్నెండు ఎలక్ట్రికల్ గోల్ఫ్ కోర్స్‌లు, లక్ష డాలర్ల విలువైన ఆటోమేటిక్ "వాటరింగ్' సిస్టం దీనికి అనుబంధంగా ఉన్న అయిదెకరాల విస్తీర్ణంగల సరస్సు దక్కాయి.

గోడలు కడితేగానీ, రెండో బిల్లు యివ్వం అని రూల్స్ చెప్పారు అధికార్లు. అప్పుడు మరి ఏం చేయలేక బిల్లు రాగానే తీర్చుకుంటా మని నమ్మజెప్పి కాంట్రాక్టర్ జగ్గారావు దగ్గర సొమ్ము అప్పుజేశాడు కంతుడు! ఆ సొమ్ముతో గోడలు లేపారు. బిల్లుకోసం తిరగ సాగేరు. తిరిగి, తిరిగి కాళ్లు పీకేయి కంతుడి కీ, కమిటీ మెంబర్లకీ.

కాళ్ల పీకుల్తో కూర్చున్న కంతుడు లేచి నిల్చున్నాడు. రాజుబాబు మోటార్ సైకిల్ కోలనీ చేరింది. మోటారు సైకిలు చెట్టునీడలో ఆపి, మినిట్ బుక్కూ, టేపూ పట్టుకొని వొచ్చేరు రాజుబాబుగారు. ఒక్కో ట్విన్నూ కొలతలు తీసుకొని రాసుకుంటున్నారు.

భోజనాల వేళవుతోంది. పనులు ఆపేసి కూలీలు భోజనాలకు కూర్చున్నారు చెట్ల నీడల్లో. మేస్త్రీలూ, కోలనీ లబ్దిదారులూ రాజు గారి వెనుకనే తిరుగుతూ, యెవరి ట్విన్ను పనిని వాళ్లు కొలిపించి, రాయించుకుంటు న్నారు.

బంతి గోడలు తడపటం ఆపేసిందిగానీ అప్పటిదాకా తుళ్లిన నీళ్లతో వోణీ, జాకెట్టూ తడిసిపోయి, వొంటికి అతుక్కుపోయాయి. తడిసిన తలను సుంపాత గుడ్డతో తుడుచు కుంటోంది.

కొలతలకు వొచ్చేరు రాజుగారు. బంతిమీ దనే అతుక్కుపోయేయి రాజుగారి చూపులు. బంతి కొలతలు తీస్తున్నాడు కళ్లతో. గాభరాగా బంతి ట్విన్ను బయటికి వచ్చేసింది.

ఓ క్షణం తర్వాత బంతి భోజనానికి యింటికి వెళ్దామని బయల్దేరింది. నీళ్ల కడవ ను స్టోర్‌పాకలో వుంచేసి వెళ్దామని పాక దగ్గరకు వెళ్లింది. అక్కడికి వచ్చేశాడు రాజు బాబు. రాజుబాబుకోసం మంచం తేడానికి కంతుడు ఇంటికి వెళ్లాడు. దగ్గర్లో ఎవరూ లేరు. రాజు చూపుల్తో బంతికి సిగ్గేసింది. కడవ అక్కడ పెట్టేసి వెళ్లిపోబోతే ఎదురుగా నిల్చొని-

"కంతుడి మనవరాలివా?" అనడిగేడు రాజుబాబు.

ఔనని తల ఊపింది బంతి.

అపుడు నవ్వుతూ "యేం పేరూ?" అన్నా డు

"బంతి..." చెప్పింది.

"అబ్బా... ఎంత చక్కని పేరూ.. నీలాగ!" అని బుగ్గమీద చిటిక వేయబోయా డు. తప్పించుకు పారిపోయింది బంతి!

మధ్యాహ్నం భోజనాలు తొందరగా కాని చ్చేరంతా. అందరికంటే ముందరే బంతి పనిలోకొచ్చింది. రాజుబాబు స్టోర్ పాకలో వేసిన మంచంమీద నిద్రపోతున్నాడు. కడవ తీసుకోడానికి బంతి ఆ పాకదగ్గరికి వెళ్లి కడవ తీసుకొని వస్తుంటే-

"ఏం పిల్లా... రాజుబాబ్‌కి జోకొట్టడంకె ల్నావేటి?" అని హాస్యమాడింది గంగమ్మ! బంతి గుండెలు గతుక్కుమన్నాయి. వెంటనే ఆ మాటకూ, ఆమె తీరుకూ కోపమొచ్చి-

"నాకలాగ జోకొట్టడాలలవాటు కాలేదు. అలాగే అలవాటయితే ఈపాటికి ఎవరినో జోకొట్టి ఆళ్లకి లంకె తగులుకోనా?" అంది గంగమ్మను దెబ్బకొడుతూ. ఆ దెబ్బకి గంగ మ్మ నోటిలోనే నొడుముకుంది.

"సవరదానికి సరసమాడినా విరసమే'' అని నొడిమీ...

"యేదో మాట వరసకి తెలిసిందానివన న్నాను. నువ్వు జోకొడితే నాకేల? ఊకొడితే నాకేల? నాకేటొస్తాది? ఏట్రానిదానికి యేల నీ సేత మాటలనిపించుకోవాల!" అనేసి, విసు రుగా పనిలోకి వెళ్లిపోయింది.

సాయంత్రానికి పనులాపేశారు. గెడ్డలు దిగి హాయిగా చల్లటి నీటిలో స్నానమాడు తుంటే శబ్దంచేస్తూ గెడ్డ వొడ్డు దారిన రాజుబా బు మోటార్ సైకిల్ వెళ్లిపోతోంది. అసంకల్పి తంగా బంతి కళ్లూ, చెవులూ ఆ శబ్దాన్ని వెదకసాగేయి. చల్లటి గెడ్డనీరు చక్కిలిగింత లు పెట్టగా కూనిరాగాలు తీసింది బంతి.

పొద్దు మలిగేవేళకి యింటికి చేరింది!

మర్నాడు మధ్యాహ్నానికి కాలనీ బిల్లులు అందాయి. కొంత డబ్బూ, కొంత ఇనుమూ, సిమెంటూ ఇచ్చేరు. డబ్బు జగ్గారావు బాకీకీ, మేస్త్రీల కూలికి సరిపోయింది. మరేం మిగల్లే దు. ఇచ్చిన ఇనుమూ, సిమెంట్‌తో మిగిలిన గోడలు వేసి, స్లేబు వెయ్యాలి. అపుడే ఫిని షింగ్ వర్కుకి ఫైనల్ బిల్లు యిస్తారు. ఎవరి వాటా ఇనుము, సిమెంటూ వారి ట్వెన్నుల ఖాళీ జాగాలో పడేశారు. వాటిని చూసి మేస్త్రీ సింహాచెలం-

"ఇంతేనా? ఇవి యేమాత్రం సరిపో తాయి? స్లేబుకి రెండు వరసలు యినుము పడతాది. చిప్పూ, సిమెంటూ... పాళ్లు ప్ర కారం కలపాల! ఈటితోటిగాని యెడ్జస్ట్ జేసిత్తే ఏ స్లేబు నిలబడతాది? ఓపినింగ్‌కి ముందే కూలిపోతాది! నిలబడని కోలనీ కట్టిన మేస్త్రెవుడ్రా అని అందరూ నన్ను తిడతారుగానీ మిమ్మల్ని తిట్టరు. తిట్టించు కునీ పని చెయ్యన్నీను. నిలబడని స్లేబుల్నీ వెయ్యిను'' అన్నాడు యిటునుంచి అటూ అట్నుంచి ఇటూ తిరుగుతూ యినప గజాల్ని ఎత్తి ఎత్తి చూస్తూ.

"మరేటి జెయ్మంతావైతే?"

"ఇనుమూ, సిమెంటూ మరికొంత కొ నాల"

"కొనాలంతే డబ్బేదీ మాకాడ?"

"యేదంటే, యేటి జెప్తాం? మీరు సూసు కోవాలగానీ. అప్పో, సప్పో చేసి తెచ్చుకో వాల. ఎల్లకాలం వుండవలసిన యిల్లా? కాదా? దిట్టమయిన పనిచేస్తే తరాలు తరాలు నిలబడిపోద్ది. మీ యిస్టం. ఈ మెటీరియ ల్తోటి మాత్రం మావొల్ల కాదు. మేం పన్సె య్యలేం" అనేసి పనులాపేశారు తాపీ మేస్త్రీ లు!

తలలు పట్టుకు కూర్చున్నారు కమిటీ మెంబర్లంతా కంతుడిముందు! ఏం చేయ డమో అర్థంకాలేదు. మొండి గోడల్తో ఆగిపో యింది కాలనీ! దిక్కు తోచక దిగాలుగా కూర్చున్న కమిటీ మెంబర్లనీ, కంతుడ్నీ చూస్తూ బంతి నాయినమ్మ-

"నేను ముందునుంచీ అంతన్ను. ఆఫీసర్ల మాట నమ్మి సెడిపోకర్రా అని. ఇన్నారా మీరు? సుబ్బరంగా మట్టితోటి గోడల్లేపి, ఎదురు డొంకలు కొట్టి వాసపూస్సి రెల్లిగడ్డో, దర్బగడ్డో నేసీవోలిమ. సక్కగుండీవిగావేటి మన యిళ్లు? కోలనన్నారు. ఈటికి పట్నం సిమెంటుండాల, యినుముండాల! పల్లపు మేస్త్రీలుండాల! ఏదినేపోయినా యిలగే మద్ది కాన ఆగిపోతాది!

నాకు ముందునుంచీ అనుమానమే! కొండలమీద ఒలసల్ని కాల్చినోళ్లు యెవుళు? కొండ దిగవకి మనల్ని తోలేసీ, ఇక్కడ కోలనీ కడుతున్నోళ్లు యెవుళు? ఆళ్ళపు డెందుక్కాల్సీసినారు? ఈళ్లిపుడెందుక్కడత న్రు? ఇందల మాయ యేట్లేదా?

ఉప్పుకీ, వొర్రగుండకీ, కిరసనూనికీ... పల్లానికి దిగినందుకేగదా మనం కంబారోళి మై (పాలేర్లం) పోనాం. ఇపుడు యేకంగా మనల్ని కొండదించేసినారు. అన్నిటికీ పల్లా నికి దిగితే... యేమైపోతామోగదా? నాకు అనుమానమే. ఇప్పుడికేన యీ కోలనీకి దండెమెట్టేసి, నీళ్లదార వొదిలేసి పదండి కొండమీది వొలసకి'' అని మొత్తుకుంది.

నాయనమ్మకు ఈ అభివృద్ధి పథకాలన్ని టిమీదా అనుమానమే! అది ఆమెకు జీవితం నేర్పింది. స్కూలు టీచరుగా కొండలమీదకొ చ్చినవాడు కొండ జనులకు గురువయినా డని, గిరిజన్లని సాయుధం జేశాడనీ స్కూళ్ల ను కాల్చేశారు. ఇపుడు ఆశ్రమ పాఠశాలలు ఆరంభిస్తున్నారు. కొండమీద వలసల్ని కా ల్చేసి, జనాలను కొండలు దించేసి కోలనీలు కడుతున్నారు. "సొంటిపిక్క నొక్కేసి జోల పాడడమంటాడు దీన్నే'' అంటుంది నాయన మ్మ. నాయనమ్మ మాటల్తో మరింత దిగులు చెందారు వాళ్లు. బంతి అందరిముందుకీ




వచ్చి-

"నాయినమ్మకేం తెల్సుగానీ మీరంతా వెళ్లి రాజుబాబుని కలిస్తే మంచిది. మొదట్నించీ మన కోలనీ చూస్తున్నది అతనేగదా! విషయమంతా చెబితే ఆయనే యేదో దారి చూపుతాడు'' అంది నమ్మకంగా.

ఆ మాటకు అందరూ సాలోచనగా బంతిని చూశారు. ఔను, అదీ ఒక మార్గమే అనుకుని రాజుగారి దగ్గరకు కదిలేరు. ఆ క్షణాన వారికి తప్పకుండా రాజు దారి చూపుతాడనే నమ్మకముంది బంతికి! అంతటి నమ్మకాన్ని కలిగించేడా రాజుబాబు? ఏమో? అప్పటికైతే నమ్మకముంది. అదే నిజమైంది కూడా. నమ్మకాన్ని వమ్ము చేయలేదు రాజుగారు. వాళ్లకు దారి చూపేరు!

కంతుడు, కమిటీ మెంబర్లను తీసుకొని రాజుబాబుకోసం వెళ్లేసరికి రాజుబాబు ఇంట్లో లేడు. క్లబ్బులో వున్నారు అని చెప్పారెవరో. క్లబ్బుకి వెళ్లారు. రాజుబాబుని ఎలాగో పట్టుకొని విషయమంతా చెప్పి కంతుడు-

"ఎలాగైనా నువ్వే మమ్మల్ని గట్టెక్కించాలి. ఇనుమూ, సిమెంటూ సాల్దంటన్నారు మేస్త్రులు. మరి బిల్సూ రావు. మరెలాగ. కోలని పూర్తవుతాది? సాలీ, సాలని సొమ్ముతోటి కోలని యేల మా పీకలకి తగిలించేసినాడో ఆ పీ.వో. బావు! ఇపుడు సూడండి, అటుకీ యిటుకీ మద్దెన అయిపోనాం" అని బాధపడ్డాడు.

"నేను మాత్రం యేం జెయ్యగల్ను?" రాజుబాబు.

"అలగనీకండి. మీరు వొకమాటగానీ, కంట్రాట్లు బావులు... ఎవులికేనా సెప్తే అయిపోద్ది. జెగ్గారావు బావుకి సెప్పురూ. అతగానయితే పెద్ద కాంట్రాట్లు'' అన్నాడో కమిటీ మెంబరు.

"జెగ్గారావు సంగతి మీకు తెలీదట్రా. మాకే యేడు చెరువుల నీళ్లు దాగిస్తాడు. వర్క్ ఆపకుండా బిల్స్ చెయ్యమంటాడు. ఏమంటే ఎమ్మెల్యేకి చెప్పాలా? అని బెదిరిస్తాడు'' అంటూ జగ్గారావు గురించి వివరించబోయాడు రాజుబాబు.

"మీకూ, మీకూ లచ్చ యవ్వారాలుంతాయి. అంత బేగి మీ మాట కాదనీలేడు. సెప్పి సూడండి!" బతిమాలేడు కంతుడు.

రాజుబాబుకి వలస గుర్తొస్తే బంతి గుర్తొస్తుంది. ఆమెమీది మోజు నిద్రపట్టనీయటంలేదు. వలసవాళ్లకు సాయంజేస్తే ఆవిధంగా బంతి దగ్గర గొప్పదనం వెలగబెట్టొచ్చు అన్న ఆలోచన కలిగింది రాజులో. మళ్లీ అంతలోనే జగ్గారావు కాంట్రాక్టరు యేఁవంటాడో!

ఆలోచిస్తూనే-

"మీరు యిక్కడే ఉండండి. లోపల జగ్గారావు వున్నాడు. నేను మాట్లాడి వొస్తాను'' అని చెప్పి కంతుడ్ని, జనాల్ని అక్కడే వుంచి రాజు క్లబ్బులోకి వెళ్లాడు.

ఏం చెప్పి వొప్పించేడోగానీ జగ్గారావుని వొప్పించేడు. వొలస కాలనీని పూర్తి చేయించడానికి వొప్పించేడు. బయట ఎదురు చూస్తోన్న కంతుడికీ, కమిటీ మెంబర్లకీ ఈ వార్త చెప్పాడు.

"హమ్మయ్య!" అని ఊపిరి పీల్చేరు.

అయితే యిందుకు తీర్మానంగా విధించిన షరతు... వార్ని ఇంతకంటే ఘోరంగా బాధిస్తుందని ఎరుగలేకపోయారు.

'వైకుంఠపాళీ' యెరుగని జనాలుగదా!

ఓరోజు తెల్లగా తెల్లవారుతోంది. కోలనీమీదుగా గెడ్డ నీటిలో సూర్యుడు తళతళా ప్రతిఫలించేవేళ! కొండలు వెండి వెలుగులో మెరిసే వేళ! అడవిలో పక్షులు రెక్కలు కొట్టుకుంటూ నీలిమేఘాలలో విహారయాత్రకు బయలుదేరేవేళ! పోడులమీద డబ్బాలు మోగి మోగీ మౌనం వహించినవేళ! ఆ

ప్రభాత వెలుగురేఖల్ని చూస్తూ పరవశంగా నడుస్తోంది బంతి. కడవ పట్టుకొని గెడ్డనీటికి వెళ్తోంది.

అపరిచిత యువకుడు! రంగు రంగుల బనీను బిగుతుగా కండరాలకు అతుక్కొని వుంది అతని వొంటిమీద! గొలుసు అంచు పంచె చిలకట్టు గట్టేడు. ఉంగరాల జుత్తు చిన్న కళ్లు! సూటిగా బంతివైపే చూసేడు. గభాల్న దోవకడ్డంగా నిలబడి బంతి రెక్క పట్టుకున్నాడు.

బంతికి భయంతో గుండెలు కొట్టుకున్నాయి. గింజుకుంటూ పెనుగులాడింది. ఏడుపు గొంతుతో-

"వొదులు... నన్నొదులు'' బతిమాలింది.

"రక్షించండి..." అంటూ గొంతెత్తి అరిచింది. చుట్టూ చూసింది. తన వలసవారి అలికిడి లేదు. ఆ యువకుని వెంటమాత్రం ఆరేడుగురు యువకులు కన్పించారు ఆయుధాల్తో.

ఆ యువకుడు రెక్క పట్టుకు బంతిని లాక్కుపోతున్నాడు. మిగిలినవాళ్లు ఆయుధాల్తో ఆయనని అనుసరిస్తున్నారు.

అప్పుడర్థమైంది బంతికి!

గుండె దడదడా కొట్టుకోసాగింది. దుఃఖం పెల్లుబికింది. అయినా అదేమీ గమనించడంలేదు ఆ అపరిచిత యువకుడు. లాక్కుపోతున్నాడు బంతిని. ఆ గెడ్డదోవ తప్పించేసి పక్క గోర్జిలోంచి అడవి దారిలోకి లాక్కుపోతున్నాడు. బంతి యేడుస్తూనే వుంది.

ఆమె యేడుపు పట్టించుకోలేదా యువకుడు. ఏదో రాజ్యలక్ష్మిని జయించి, చేబట్టినవానిలా సగర్వంగా సంతోషంగా వున్నాడు.

బంతికి ఇష్టంలేదు. కానీ ఆ విషయం చెప్పలేకపోతోంది. దారిపొడుగునా బంతి తమ కోలనీవాళ్లకోసం వెదికింది. ఎవ్వరూ అలికిడి కాలేదు.

అడవిలోంచి మరో క్రోసుడు (రెండుమైళ్లు) దూరం నడిచేక ఇక కొద్దిదూరంలో తమ ఊరు వచ్చేస్తుందనగా ఆగేరు వాళ్లు. బంతిని నిలబెట్టి ఆ యువకుడు-

"జరడొలస పువ్వుల సోమయ్య కొడుకుని. నా పేరు భీముడు. నిన్ను మనువాడతాను'' అని మూడే మూడు ముక్కలు మాట్లాడేడు.

బంతి యేడుస్తూ చేతులెత్తి మొక్కింది. ఇవన్నీ తనకు తెలీవంది. తననొదిలెయ్యమంది. భయం వేస్తోంది అని చెప్పింది.

"యెందుకు బయ్యిం? ఆడేటి రాకాసోడేటి? నీలాగే పెళ్లికాని కుర్రోడు. నీకేం ఫర్లేదు... పద పదా'' అని పదమంటూ దారితీసేరు మిగిలిన యువకులు.

అలా వారితో బంతి యేడుస్తూ నడుస్తుంటే అటునుంచి యెదురుగా వస్తోన్న తమ ఊరి పేసిని (తలయారిలాంటివాడు గిరిజన వలసల్లో) గాడు కన్పించేడు. బంతికి చిన్నగా ఆశ కలిగింది. గట్టిగా అరిచింది సహాయం చేయమని. పేసినిగాడికి ఆ అరుపులు వినిపించేయి. ఇటువైపు చూసేడు. బంతీ, ఆ యువకులూ కన్పించేరు. వాడికేదో అర్థమయినట్లుంది. ముసిముసిగా నవ్వుకుంటూ ఆ దారి తప్పించేసి పక్కగా వెళ్లిపోయాడు.

బంతికి చాలా దుఃఖం కలిగింది. లాక్కుపోతున్న భీముడి వెంట విచారంగా భీముడి ఇంటికి చేరింది.

ఇంకా ఈ ప్రాంతంలో ఈ పద్ధతి కొనసాగడం చాలా అరుదు. అందులోనూ యించుమించుగా మైదానానికి దగ్గరగా పదేళ్లుగా బతుకుతున్నందునా, పట్నపు వాసులతోనూ, వారి అలవాట్లతోనూ ఈ పదేళ్లూ పరిచయం పెరగటంవలన బంతి తమ జనాల్లో గల వివాహ పద్ధతుల గురించి మర్చిపోయింది. అందుకనే అంత నిర్భయంగా ఆ ఉదయం గెడ్డనీటికి అలా వొంటరిగా బయల్దేరింది.




ఇంకా ఈ నూతన పద్ధతులు చొరబడని ప్రాంతానికి చెందిన భీముడు బంతిని లాక్కుపోయాడు! పెళ్లి పద్ధతుల్లో ఇదొక పద్ధతి అని బంతికి తెలుసు.

అబ్బాయి తనకు నచ్చిన యువతిని లాక్కుపోతాడు. అడ్డు తగిలితే వారితో పోట్లాడుతాడు. తోడుగా కొంతమందిని పోట్లాటకు సాయంగా తీసుకువస్తాడు. అలా యువతిని లాక్కుపోయాక ఆ యువతి అంగీకరిస్తే యువతి తండ్రికి ఓలి (కన్యాశుల్కం) ఇచ్చి పెళ్లి ఏర్పాటు చేయించుతాడు. యువతికిగానీ ఇష్టంలేకపోతే ఆ యువకుని ఇంటినుంచి వచ్చేయవచ్చు.

బంతి బాగా ఆలోచించి మనసులో నిర్ణయం తీసుకుంది. మరి దేనికీ భయపడకుండా నిర్ణయం ప్రకారం తిరిగి తన యింటికి చేరుకోగలిగింది.

తన వొలస చేరుకుని ఇంట్లోకి వచ్చేక హమ్మ అంటూ ఊపిరి పీల్చింది.

తిరిగొచ్చిన తనని చూసి తాతయ్యా, నాయనమ్మా సంతోషపడతారనుకుంది బంతి. కానీ కందుడు కోపగించేడు! ఆశ్చర్యపోయింది బంతి!

"నాకిష్టంలేదు'' భయం, భయంగా చెప్పింది బంతి.

"ఎందుకిష్టంలేదు? ఆడికేటి లోటు?" అడిగేడు బంతి తాతయ్య.

"సదుకున్న పిల్లగదా'' సర్ది చెప్పబోయింది నాయనమ్మ.

"అయితే?" కోపంగా అన్నాడు కందుడు.

బంతి మరి జవాబివ్వలేకపోయింది. 'అయితే' లకు యెవరుమాత్రం జవాబివ్వగలరు?

తనకు ఉద్యోగాలు చేసేవారిమీద మనసుంది తప్పా, కొండల్లో పోడూ, పొలంమీదా పనిచేసి బతికేవాళ్లమీద మనసులేదు అని చెప్పలేకపోయింది బంతి! మనసులోనయితే ఆ జవాబు వుంది. మౌనంగా నిల్చుంది.

"మన ఆచారాలు మారిపోతున్నాయి. సాంప్రదాయాలు సెల్లిపోతున్నాయి. పల్లపు కపటమూ, కల్మషమూ... మనలోకీ సేరతన్నాయి. మంచి సేరితే బాగుణ్ణు! గానీ చెడ్డ చేరతంది. ఇది మనల్ని చెడగొడతాది. చెడిపోతేగానీ బోధపడదు మనకి!" అన్నాడు కందుడు బాధగా! అతని గుండెల్లో అనంతమైన బాధ వుంది ఏజెన్సీలోకి అడుగిడిన కొత్త సంస్కృతిపట్ల!



బంతికి కందుడి వేదన అర్థంకాలేదు. ఎందుకంతగా తాతయ్య బాధపడ్డాడో ఇన్నాళ్లకు యిప్పుడు అర్థమయినట్టుగా ఆ క్షణాన అర్థంకాలేదు. కందుడు అన్నట్లుగా చెడిపోతేగాని బోధపడలేదు! నిజానికి బంతికేగాదు ఈతరం యెవరికీ వారి ప్రయాణం యెటో అర్థంకాలేదు.

తెల్ల దుస్తుల వెంట, ఫైళ్లవెంట, పథకాల వెంట పరుగులు యెత్తారు. సమిష్టి తత్వం మర్చిపోయేరు. ఎవరికి వారుగా యెదిగిపోవాలనుకున్నారు. ఎదిగిపోగలం అనుకున్నారు.

ఎందరో, ఎన్నివిధాలుగానో భంగపడ్డారు. ఎన్నో విధాల మోసగించబడ్డారు. బంతి ముందు... తన బతుకూ, తన ఈడువారి మరికొందరి ఆడపిల్లల బతుకూ... రూపుగట్టినయి కళ్లల్లో నీరు కమ్మింది. కళ్లు తుడుచుకుంది.

గతాన్ని దాటి వచ్చేసినదాన్ని తవ్వుకో టంకాదు, ముందరి దోవను చూడటం ముఖ్యం. అనుకుంటోంది ఇప్పుడు బంతి.

★ ★ ★

భీముడి ఇంటినుండి బంతి వచ్చేశాక ఆ రోజునుండీ కంతుడు గతంలోలాగా బంతితో కలుపుగోలుగా వుండటంలేదు. ఆదరాభిమానాలు వ్యక్తంచేయటంలేదు. బంతిని పరిశీలన చేసేవాడు. బంతి కట్టూ, బొట్టూ, నడవడికనూ అనుమానంగా చూసేవాడు. చేతి మీంచి చెప్పా పెట్టకుండా యెగిరిపోయే చిలుకగా భావించాడో యేమో... బంతిని!

★ ★ ★

కోలనీ పని మళ్లీ ఆరంభమయింది. రోజూ తనిఖీ పేరుమీద రాజుబాబు కోలనీకి వచ్చేవాడు. రోజూ యేదో ఒక నెపంతో బంతిని పలుకరించేవాడు.

బంతికి ఇదంతా గుబులు గుబులుగా వుండేది. అద్దంముందు కూర్చుని ముస్తాబవుతుంటే బంతికి రాజుబాబు జ్ఞప్తికొచ్చేవాడు. మరికాస్త యెక్కువసేపు ముస్తాబయి పనికొచ్చేది. పనికొచ్చాక ఆమె కళ్లు, చెవులూ రాజుబాబు మోటార్ సైకిల్ శబ్దంకోసం ఎదురుచూసేవి.

రాజుబాబు వచ్చేవాడు. ఓ గంటదాకా వర్క్ అంతా తనిఖీ జేసే నటనలో వుండేవాడు. ఆ తర్వాత మేస్త్రీకి సూచనలిస్తూనో, గంగమ్మను తొందర తొందరగా పనిచేయమని చెప్తూనో కంతుడి ట్వెన్ను దగ్గర తిరుగాడేవాడు. బంతితో తన సామగ్రి తెమ్మని చెప్పటమో, మినిట్‌బుక్ మోటార్ సైకిల్ డిక్కీలో వుండిపోయింది తెమ్మనో, ఆమె చదువుకున్న టెన్త్‌క్లాస్ సబ్జెక్ట్‌మీదనో యేదో వొక సంభాషణ జేసేవాడు.

ఓరోజు కెమేరా తెచ్చి కోలనీ నిర్మాణాన్ని ఫొటోలు తీసేడు. ఆ తర్వాత రీలులో యింకా కొన్ని మిగిలున్నాయి నిల్చోమని బంతిని వివిధ భంగిమల్లో కోలనీ దగ్గరా, దగ్గరలోని గెడ్డ దగ్గరా, గెడ్డ వొడ్డున, చెట్ల దగ్గరా ఫొటోలు తీసేడు రాజుబాబు.

వారంరోజుల తర్వాత పట్నం వస్తే ఫొటోలు యివ్వటమేగాక సినిమా చూపిస్తాననాన్నాడు బంతితో.

సినిమాలు, ఫొటోలు బంతి ఎరుగని వింతలు కావు. చదువుకున్న పిల్ల గనుకా వాటి గురించి తెలుసునామెకు. అయితే విద్యావంతుడూ, ఉద్యోగీ, యువకుడూ కోరీ, వలచి, తనవెంట పడుతుంటే, ఫొటోలూ, సిన్మాల అనుభూతులను అందిస్తూంటే బంతి మనసు తీయగా మూలిగేది. ఆమెకు తెలీకుండానే ఆమె మనసులో రాజుబాబు రూపం ముద్రించబడింది. రాజుబాబు పలుకరిస్తే పులకరించిపోయింది. ఎవ్వరేమనుకుంటున్నారో అన్న విచక్షణను మరిచిపోయింది. రాజుబాబుతో గలగలా మాట్లాడేది. రాజుబాబుతో కలిసి తిరిగేది.

ఇదంతా గమ్మత్తుగా అన్పించేది బంతికి. గర్వంగా కూడా వుండేది. మరో వ్యక్తి తనకోసం తపిస్తున్నాడన్న భావన బంతికి ప్రేమ అంటే ఇదేనన్న భావం కలిగించింది! సినిమాలు చూసి, చూసీ ప్రేమకు రంగులకలలు అద్దుకుంది బంతి.

నాలుగైదు నెలలకు కోలనీ నిర్మాణం పూర్తయింది. కోలనీవాసులంతా రాజుబాబుకి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

ఓరోజు ఆ నియోజకవర్గం ఎమ్మెల్యేగారి చేత కోలనీ ప్రారంభోత్సవం జరిగింది. ఆరోజు యేర్పాట్లన్నీ రాజుబాబే చూశాడు. ఎమ్మెల్యేగారికి బంతిచేత పూలదండ వేయించాడు. సవరభాషలో బంతిచేత పాట పాడించాడు.

ఎమ్మెల్యేగారు ఎన్నో వాగ్దానాలు చేసి కోలనీ ముఖద్వారాన కట్టిన రిబ్బన్ కత్తిరించి ప్రారంభోత్సవం చేసి వెళ్లిపోయారు. రాజుబాబు గూడా బంతికి కళ్లతోనే వీడ్కోలు





చెప్పి ఎమ్మెల్యేగారితోపాటే వెళ్లిపోయాడు.

కోలనీ ప్రారంభోత్సవం అయ్యాక రాజుబాబు రాకపోకలు ఆగిపోయినయి. బంతి మనసులో రాజుబాబు జ్ఞాపకాలు ముసిరేవి. ఏమీ ఊసుబోయేది కాదు బంతికి. ఇంటిలో వుండలేకపోయేది. గెడ్డ దగ్గరకూ, రోడ్డుమీదకూ అన్యమనస్కంగా అలా తిరిగేది. కాలం ఆగిపోయినట్లన్పించింది ఆమెకు.

నెల రోజులు దాటాక ఓరోజు మధ్యాహ్నంవేళ రాజుబాబు మోటార్ సైకిల్ ఆగింది బంతి ఇంటిముందు.

బంతి గుండెల్లో ఉద్వేగకెరటం ఎగిసిపడింది. ఆమె మనసులో వేయి పున్నమిల వెలుగు ప్రసరించింది. గబగబా యింట్లోంచి పరుగెత్తుకుంటూ వచ్చింది.

రాజుబాబు మోటార్‌సైకిల్ స్టాండ్ వేసి డిక్కీలోంచి యేవో ఫారాలు తీసుకొని ఎదురుగా నిల్చున్న బంతికి చూపిస్తూ-

"ఇక్కడ సంతకం చెయ్యి'' అన్నాడు గడపలో మంచంమీద కూర్చుంటూ.

బంతి యేమిటీ? ఎందుకూ అన్న ప్రశ్నలేవీ వేయకుండా ఆయన చేయమన్న దగ్గర సంతకం చేసింది.

"టెన్త్ క్లాస్ పోయిందిగదా! పాసవలేదుగదా నువ్వు?" అని అడిగాడు రాజుబాబు కాస్త విచారంగా.

"ఔను... పోయింది. ఇంగ్లీషూ, లెక్కలూ వుండిపోయాయి. మళ్లీ కట్టలేదు'' అని చెప్పింది బంతి ఎందుకన్నట్లు ప్రశ్నార్థకంగా ఆయనను చూస్తూ.

"పాసయివుంటే బాగుండేది. టీచరువయిపోయుందువు. టెన్త్ పాసయిన ట్రైబల్ కేండిడేట్లకి డైరెక్టుగా టీచర్ పోస్టులు యిస్తున్నారు'' అని చెప్పాడు రాజుబాబు.

ఇంట్లోంచి ఈ మాటలు వింటున్న కంతుడు వీటిలో నిజాలెన్నో అబద్ధాలెన్నో అని లెక్కగడుతున్నాడేమో! అనుమానంగా చూస్తున్నాడు.

"పోన్లే యేంజేస్తాం? టెన్త్ పరీక్షకి కడుదువులే! ఈసారి కడితే నీకు ప్యాసూ ఖాయం, ప్యాసయ్యాక టీచర్ పోస్టూ ఖాయం" అన్నాడు రాజుబాబు, ఆ రెండూ తన మాటప్రకారం జరిగిపోతాయి సుమా అన్న అర్థంలో! ఆ మాటలు వింటున్న కంతుడు గడపలోంచి రాజుబాబు దగ్గరకొచ్చేడు ఆశగా. కంతుడు దగ్గరకు వచ్చాక రెట్టించిన మెహర్బానీతో-

"అయినా ప్రస్తుతానికి మా డిపార్ట్‌మెంట్లో టెంపరరీ పోస్ట్ వుంది. ఈ ధరకాస్తు తీసికెళ్లి ఇస్తే నీకు ఆ పోస్టింగొచ్చేట్టుగా ట్రైచేస్తాను. మా ఇ.ఈ.గారే ఆర్డరెయ్యాలి! అతన్ని ఎలాగ బుట్టలో వెయ్యాలో నాకు తెల్సు. అలాగేస్తాను. నీకు ఆర్డరిప్పిస్తాను'' అన్నాడు.

"బాబ్బాబూ! ఆ పున్నెం కట్టుకుందూ! ఇదేమో యిప్పుడిదాక సదువూ సట్టుబండలని నీడపట్టున పెరిగింది. ఇపుడేమో కొండమీద కష్టపల్లేకపోతంది. ఆ నౌకిరి దొరికితే దాని బతుకది బతుకుతాది. దానికొక దారి సూపి, పున్నెం కట్టుకోబావూ'' అని కంతుడు బతిమాలేడు రాజుని. ఏదో ఒక ఉద్యోగం దొరికితే బతుకు యాతనకు పరిష్కారం దొరుకుతుందని. అదీగాక ఉద్యోగం అంటే మోజు అయ్యింది గిరిజన్లకీను. అది బంట్రోతు ఉద్యోగమైనాసరే. గవర్నమెంట్ మనిషిననుకుంటాడు. మరి అక్కడినుండి తనతోటివార్ని పట్టించుకోడు! వారిలో చదువుకొని, నౌకరీలు సంపాదించినవారి తీరు అది. కంతుడికి గూడా తన మనమరాల్ని గవర్నమెంట్ మనిషిగా చూడాలని వుంది. ఆ ఆశతో అలా బతిమాలేడు. అలా బతిమాలించుకున్నాక రాజు కంతుడ్ని చూస్తూ-

"దారి చూపించడానికే గదా దరకాస్తు పట్టుకోనొచ్చేను. ఈ దరకాస్తు మా ఇయీ గారికివ్వాలి బంతీ నువ్వు'' అని చెప్పాడు.

"అలాగే రేపు నేను తీసికెల్తాను బావ్ దీన్ని'' అన్నాడు కంతుడు.

"రేపా? మా ఇయిగారు హైద్రాబాద్ కేంప్‌కెళ్తార్తే రేపు!" అన్నాడు రాజుబాబు తల పైకెత్తి సాలోచనగా.

"యెలాగైతేమరి?" అడిగేడు కంతుడు.

"వెళ్లి వారం పదిరోజులు రారు. అక్కడే పన్లేవో వున్నాయి వుంటారు'' అని ఇయిగారి భోగట్టా చెప్పాడు రాజుబాబు.

"అయితే మరీ ఆలస్యమైపోతుందేమో?" అన్నది బంతి. దరఖాస్తు ఆలస్యమైతే ఉద్యోగం రాదేమో అన్న సంశయంతో.

"అదేగదా నాకు భయం. పోస్ట్ ఖాళీగా వుందని అందరికీ తెలియకముందే మనం గడినప్పిం చెయ్యాలి. లేకపోతే కాంపిటీషన్ పెరిగిపోద్ది. ఇపుడు మీ ట్రైబ్స్‌లోనూచదువు కున్నోళ్లు యెక్కువైపోయేరుగదా'' అన్నాడు రాజుబాబు.

"అయితిపుడు బయిలెల్దుమా?" అనడిగే డు రాజుని కంతుడు.

"పోనీ ఒక పన్చెయ్యి! నా బండిమీద నువ్వొచ్చెయ్యి. నేను దగ్గరుండి ఇ.యి. గారికి దరకాస్తు యిప్పించేస్తాను. తిరిగి నిన్ను బస్ యెక్కించేస్తాను. ఎలాగూ నేను తిరిగి వెళ్లేది ఒక్కణ్ణేగదా! బండిమీద మరి ముసలోడ్ని యెందుకూ ఈ ఎండలో కష్టపె ట్టడం" అన్నాడు రాజుబాబు.

ఆ మాటకు కంతుడు సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బయి-

"అంతకంటే ధర్మమా! అలాగేకానీ బాబ్, అలక్కానీ. బేగి బయిలెళ్లయితే మరీ'' అన్నాడు. బంతిని తొందరచేశాడు. రాజుబా బుతో వెళ్తే వెంటనే నౌకరీ వచ్చేస్తుందన్న నమ్మకం కలగజేసింది కంతుడికి!

అదిగో ఆ మధ్యాహ్నవేళ అలా రాజుబా బు మోటార్ సైకిల్ యెక్కింది బంతి. తొలిసారిగా!

రాజుబాబు బంతితో యింటివద్ద చెప్పిన విధంగా ఇంజనీర్‌గారికి దరకాస్తు యివ్వటా నికి ఆమెతో రాలేదు. దరకాస్తు పట్టుకు బంతినే యింజనీర్ దగ్గరికి వెళ్లమన్నాడు. బంతి వెళ్లి దరఖాస్తు యిచ్చింది. ఇంజనీర్‌గా రు అది చూసి తర్వాత బంతివైపు చూసి-

"నువ్వు చదువుకున్నావా?" అని ప్ర శ్నించాడు.

"ఔన్సార్! టెన్త్‌క్లాసు పోయింది'' అని చెప్పింది బంతి.

"మరి టెన్త్‌క్లాస్ పరీక్షకు వెళ్లి, మంచి జాబేదో చూసుకోరాదూ?" అనడిగేరు. బంతి కి యేం చెప్పాలో అర్థంకాలేదు. ఇంజనీర్‌గా రు చెప్పిందీ బాగానేవుంది. ఆలోచిస్తూ-

"టెన్త్‌కి వచ్చే సెప్టెంబర్‌కి వెళ్తాను సార్. ఖాళీగా వుండేబదులు మీ ఆఫీసులో పనిచేస్తే కాస్తా లోకజ్ఞానం కలుగుతుందికదా!" అంది.

"ఏం ఉద్యోగం అనుకున్నావూ మేం వేయబోయేదీ?" అని ఆయన ప్రశ్నించారు. బంతికి తెలీదు. ఏ ఉద్యోగమో రాజు చెప్పలే దుగదా! మళ్లీ యింజనీరుగారే-

"వాటర్‌మెయిడ్ అంటాం. అంటే నీళ్లు మాకు అందివ్వాలి. పనిమనిషిలాంటి ఉద్యోగం! తెల్సా? చదువుకొని, నాజూగ్గా వున్నావు! నువ్వేం చేస్తావీ పని'' అనేశారు.

పనిమనిషిలాంటి ఉద్యోగం అనేసరికి బంతికి అప్పటిదాకా ఉద్యోగంమీద వున్న మోజు ఎగిరిపోయింది. నువ్వేం చేస్తావూ, నాజూగ్గా వున్నదానివీ అనేసరికి నిజమే అన్పించింది. అనవసరంగా రాజుబాబు ఈ తతంగమంతా పెట్టాడన్పించింది.

ఇంజనీర్‌గారు ఓక్షణం ఆలోచించి-

"నీ యిష్టం. చేస్తానంటే రేపట్నించీ వచ్చి పనిలో చేరు'' అని చెప్పి ఫైళ్లలోకి తలదూర్చేరు. బంతి బయటికి వచ్చేసింది. ఆఫీస్ బయట రాజుబాబు నిల్చున్నాడు. ఆయన్ని కోపంగా చూస్తూ-

"నీళ్ల మనిషి పనికి... పెద్ద ఉద్యోగ మంటారేటీ?" అనడిగింది బంతి.





ఆ మాటకు రాజు నవ్వేసి "సర్లే... నీళ్లు నువ్వేం అందివ్వక్కర్లేదు. నెలకి ఇరవై యిస్తే మా నీళ్ల మనిషి పోసేస్తుంది నీళ్లు! ఆ పేరుమీద ముందు నువ్విక్కడ చేరితే ఆ తర్వాత నెమ్మదిగా టెన్త్ పాసయిపోతే క్లర్క్‌వి అయిపోవచ్చు. ఆ ఆశతోటే ఈ ఉద్యోగంలో చేరమన్నాను. నీకెందుకూ అవ న్నీ. నాకొదిలేయ్. నిన్ను టెన్త్ పాస్ చే యించి ఈ ఆఫీస్‌లోనే క్లర్క్‌గా చేయిస్తాను నిన్ను'' అన్నాడు నమ్మకంగా.

"రేపు పనిలో చేరు, యిష్టమైతే' అన్నారు యింజనీర్‌గారు అని చెప్పింది బంతి. అందుకు రాజు ఆనందంగా-

"మరింకేం? రేపే చేరు. రోజూ ఇకనుంచి నిన్ను ఇక్కడే చూడొచ్చన్నమాట! ఈమధ్య మీ కోలనీ పూర్తయ్యాక మళ్లీ నిన్ను చూడక పిచ్చెక్కిందనుకో నాకు'' అన్నాడు.

నాకు గూడా అలాగే వుందని చెప్పాలను కుని చెప్పకుండా నవ్వేసి ఊరుకుంది బంతి.

"మా ఊరు వెళ్లాలిగదా నేను'' అంది బంతి.

అందుకు రాజు - "రేపట్నించీ ఎలాగూ బస్‌లో తిరగాలి. ఈరోజుకి దేవిగారిని మళ్లీ బండిమీద ఇంటికి దిగబెడతానులే' అన్నా డు.

సంతోషంగా చూసింది అతనివైపు.

రాజు మోటార్ సైకిల్ స్టార్ట్‌చేశాడు. బంతి ఎక్కి కూర్చుంది.

"ఇన్ని ఉపకారాలు చేస్తున్నాను. కనీసం థేంక్స్ అయినా అమ్మగార్నుండి లేవు'' అన్నాడు. ఆ మాటకు బంతి నవ్వేసి-

"థేంక్స్'' అని చెప్పింది. మోటార్ సైకిల్ కదిలింది. కొద్దిదూరం వెళ్లాక "అందమైన అమ్మాయి చెప్పే థాంక్స్ అంత చప్పగా వుండకూడదు'' అన్నాడు.

"మరెలా వుండాలీ?" అడిగింది బంతి.

ఎలా వుండాలో ఆయన ఊరు దాటేక, అడవి మధ్య రోడ్డు దారిలో మోటార్ సైకిల్ ఆపి, చెప్పాడు.

ఊహించని ఆ చర్యకు బంతి గాభరాపడి పోయింది. పెదాలను కొరుక్కుంది. బుగ్గల కంటిన తడిని తుడుచుకుంది. తమకంతో పెనవేసుకున్న ఆయన చేతుల్ని విడిపించు కుంది. తల దించుకు నిల్చుండిపోయింది.

"ఏం? కోపమొచ్చిందా?" అనడిగేడు బంతి గెడ్డం పట్టుకుని రాజు.

బంతి బదులివ్వలేదు. కంటి రెప్పల్ని టపటపా ఆడించింది. రాజు ఆమె కనురెప్ప లమీద ముద్దుపెట్టాడు. ఆమె ప్రతిఘటించలే దు. మెడ దిగువన, గుండెలమీద... ముద్దు పెట్టాడు. పాదాలనుంచీ రక్తప్రసరణ గుండె లమీదకు పొంగింది బంతికి! రాజు మొహా న్ని గుండెలకదుముకుంది!

"ఇదీ కృతజ్ఞత చెప్పే విధానం" అన్నాడు రాజుబాబు అప్పుడు!

అదిగో అక్కడ్నించీ బంతి శరీరం రాజు స్పర్శకోసం తహతహలాడేది. బంతి రోజూ పనిలోకి వస్తోంది. ఆఫీస్‌లో ఇంజనీర్‌గారూ, మరో ఇద్దరు క్లర్క్‌లూ, రాజూ... వీరే సిబ్బంది. వీరికి నీళ్లను అందించటం, టీలు చెప్పటం యిదే బంతిపని! మొదట్లో కొద్దిగా బెరుకుగా ఉండేది. క్లర్క్‌లిద్దరూ ఆమెవైపు అదోలా చూడటం, నీళ్లు అందించేటపుడు వేళ్లను తాకుతూ గ్లాసందుకోవటం, అసంద ర్భ జోకులు వేయటం, వెకిలిగా నవ్వటంతో భరించటానికి యిబ్బందిగానే వుండేది ఆమెకు. కానీ రాజుబాబుకోసం అవన్నీ భరించేది. కొన్నాళ్లకే వాటిని పట్టించుకోని స్థితికి వచ్చేసింది.

నిజానికి బంతి చదువుకోవటంవల్ల పల్లపు నాగరికపు బుద్ధులు ఆమెలో చేర టంవల్లనా... అంతగా యిబ్బంది పడింది. సవర స్త్రీ యిలాంటి చర్యల్ని పట్టించుకోదు. వేళ్లూ, కాళ్లేకాదు... రొమ్ముల్ని తాకినా ఏ అనుభూతికీ లోనయిపోదు. మనసు లోతు




ల్లోంచి కాంక్ష పుడితే తన రెక్క పట్టుకున్న వ్యక్తి పాదాలముందు సవర స్త్రీ తన జీవితాన్ని నైవేద్యంగా అర్పిస్తుంది.

బంతి మనసులో రాజుబాబు స్థానం స్థిరమైపోయింది. ఆయన చెప్పిన ఊసులు చెవిగోసుకు వినేది. ఆయనతోపాటే బతుకని... ఆయన చెప్పినట్లు నడిచేది. ఆయన వెంట సినిమాలకూ, షికార్లకూ వెళ్లేది. లాడ్జీల్లో రాత్రుళ్లు ఆయనతో గడిపేది. అందమైన తీయని అనుభూతులనెన్నింటినో తనివిదీరా అనుభవిస్తూ చేస్తోన్న తప్పుని గుర్తించలేకపోయింది బంతి!

ఏదో వొకనాడు ఆ తప్పు తనని నలుగురిలో తలెత్తుకోకుండా చేస్తుందన్నది ఆలోచించలేదామె! ఆమె శరీరంలో మెల్లమెల్లగా మార్పులు చోటుచేసుకోనారంభించాయి. చీర కుచ్చిళ్లు దోపుకునేటప్పుడు ఆమెకు అనుమానంగా ఉండేది రెండోరోజుకి. గుండెలు ఝల్లుమన్నాయి.

★ ★ ★

కంతుడు జనాన్ని తీసుకొని ఎగ్రికల్చర్ డిమానిస్ట్రేటర్ ప్రకాశరావు యింటికి చేరేసరికి ప్రకాశరావు ఇంట్లోనే ఆఫీస్‌రూంలో వున్నాడు. కరెంట్ లేక ఫేన్ ఆగిపోయింది. ఒకచేత్తో దినపత్రికను మడతపెట్టి విసనకర్రను చేసి విసురుకుంటూ, మరోచేత్తో అపుడే వచ్చిన టపా ఒకటొకటిగా విప్పుతున్నాడు. ఆకుపచ్చ సిరా సంతకంతో వచ్చిన జీవో లెటర్ కన్పించింది. ప్రభుత్వోద్యోగులు జీవో లెటర్లకీ, జీవోలకీ ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. గబగబా తీసి చదివేడు!

పోడు పునరావాస పథకం లబ్ధిదార్లనూ, కోలనీ లబ్ధిదార్లనూ గుమ్మలక్ష్మీపురం గెస్ట్ హౌస్‌కి తీసుకురమ్మనీ, గిరిజన శాఖామాత్యులూ, కార్యదర్శివారూ వస్తున్నారనీ, సభ జరుగుతుందనీ జీవో లెటర్ సారాంశం!

తీరా ఎప్పుడు సమావేశం? అని చూస్తే ఈరోజే సాయంత్రం అయిదు గంటలకు అనివుంది!

టైం చూసేడు. మధ్యాహ్నం పన్నెండు కావస్తోంది. గుండెలు గడియారంలా కొట్టుకుంటున్నాయి. ఎక్కడి కొండలు! ఎక్కడి మనుషులు? ఏ కొండోడు దొరుకుతాడు. ఆళ్లని గుమ్మలక్ష్మీపురం యెపుడు తీసుకెళ్తాను! ఇవన్నీ జరిగే పన్లేనా? ఎలా జరిగిపోతాయని జీవోలెటర్ రాసేడు ఆ పీవో? అని మనసులో గుణుసుకుంటూ కుర్చీలోంచి లేవబోతుండగా-

"దండాల్ బావ్' అన్నారు కంతుడూ, జమ్మిలస జనాలూ!

వారిని చూసేసరికి గొప్ప రిలీఫ్ కలిగింది ప్రకాశరావుకి. దాంతో సంతోషంగా "హమ్మయ్య... సమయానికొచ్చేర్రా. వెదకబోయిన తీగ కాలికి తగలడమంటే ఇదే! రండి రండి. మీకోసం నేనే వొద్దామనుకుంటున్నాను" అని పిలిచేడు.

ప్రకాశరావు సిలుపుకి జనాలు ఆనందపడిపోయేరు. తమ పని తొందరగా అయిపోతుందని ఆశించేరు. అందరూ గడపలోకి చేరారు. అందరికీ వినిపించేవిధంగా లేచి నిలబడి-

"ఈరోజు సాయంత్రం గుమ్మలక్ష్మీపురంలో మీటింగుందర్రా. గుమ్మలక్ష్మీపురం అంటే అదేనర్రా భద్రగిరి! భద్రగిరికి మినిస్టర్ గారు, పీవోగారు, డీటీడబ్ల్యూగారు... ఇంకా పెద్దపెద్దవారూ వస్తన్నారు. మీటింగ్ పెడుతున్నారు. మీ గిరిజన్లకోసమే ఆ మీటింగ్. మిమ్మల్ని అక్కడికి పంపించమని పీవోగారి ఆర్డరు. పదండి, పదండి భద్రగిరి గెస్ట్‌హౌస్ దగ్గరికి. అక్కడే మీటింగ్' అని చెప్పాడు ప్రకాశరావు.

జనాలు అయోమయంగా చూడసాగేరు. భద్రగిరెందుకూ? మీటింగేమిటి? బ్యాంకీ కాయితమిస్తానన్నాడు ఆ ఊసు ఎత్తడేటి? ప్రశ్నలు కలిగేయి అందరిలోనూ. కంతుడు-

"అదికాదు బావ్. ఈ పొద్దు మమ్మల్ని

రమ్మన్నారు. మీమొస్తే కాయితం రాసిస్తాను, బేంకీకి పట్టికెల్దురుగానీ అన్నారు. బేంకీల సొమ్ము అందుతాది అన్నారు'' అన్నాడు వినయంగా.

"ఔన్రా అన్నాను. రమ్మన్నాను. కాయిత మిస్తానని అన్నాను. కాయితానికేటి? మన చేతిలోది ఎపుడు కావాలంటే అపుడే రాసిస్తాను. బ్యాంకూ ఎటూ వెళ్లిపోదు. అక్కడే వుంటాది. రేపయినా మీరు వెళ్లొచ్చు. గాని మంత్రిగారు రేపు రారుకదా! మీటింగు రేపు ఉండదుగదా? మీకోసమేగదా ఆ మీటింగ్. దానికి మీరు వెళ్లాలిగదా!'' అని వెళ్లాల్సిన అవసరం ఉందని ప్రకాశరావు తెలియజేశాడు.

"నిజమే! ఎల్లాలి! ఎల్తే... ఆ పెద్దలు ఎగిరే పిట్టని చూపి దాన్ని యేటాడి మీకిస్తాం. మీరు మసాల నూరుకోండని చెప్తారు. ఆ పిట్టా మరి అవుపడదు! ఆ చెప్పినోళ్లూ అవుపడరు. మసాల దండుగ మాకు. కొండలు యెక్కి దిగీ కాళ్లు పీకులే మిగులు మాకు'' అని మంత్రుల, ఆఫీసర్ల వాగ్దానాల ఫలితం శూన్యమని అనుభవంతో చెప్పినట్లు చెప్పాడు మండంగి సోము.

ఆ మాటకు ప్రకాశరావు కోపగించేడు. చేతిలో పేపర్ని విసురుగా టేబిల్‌మీద పడేసి-

"ఏంట్రా? మాకోసం కొండలు దిగొస్తన్నారార? మమ్మల్ని ఉద్ధరించడానికివొస్తన్నావా నువ్వు? ఉచితంగా ఎరువులు, విత్తనాలు, సబ్సిడీ అప్పులూ... దొరుకుతన్నాయి. ఇవిగాక మీ పిల్లలకి తిండీ, బట్టా, పుస్తకాలు, మీకు మందూ మాకులు ఒకటేమిటి, అన్నీ ఆ మంత్రులూ, ఆళ్ల ఆర్డర్ ప్రకారం ఆఫీసర్లూ రాస్తుంటే అవి దొబ్బడంకి మీరొస్తన్నారు. ఒట్టి పుణ్యానికి వొస్తన్నారా?'' అని కేకలేశాడు.

కంతుడు మౌనంగా ఆ కేకలన్నీ విన్నాడు. ప్రకాశరావు కేకలు ఆపేక కంతుడు చాలా నిదానంగా గొంతులో ఆర్తి నింపుకొని "ఔను బావ్. మేము వొట్టిపున్నేనికి కొండలు దిగి రాటంలేదు. గాని ఎందుకిపుడు కొండలు దింసుతన్నారు మమ్మల్ని? ఇన్ని స్కీములూ, ఆపీసులూ ఎందుకు పుట్టేయి? ఈ అరచేతుల్ల వొయికుంఠాలు సూపే మీటింగులు ఎందుకు పెడతన్రు? మమ్మల్ని ఉద్ధరించేత్తామని... కొండలు దద్దరిల్లిపోయినట్టుగ ఎందుకు సెప్పుకుంటన్రు? ఎందుకు బావ్... ఇవన్నీ వొచ్చేయ్'' అని ప్రశ్నిస్తూ ఆగేడు కాసేపు.

ప్రకాశరావు చిరాగ్గా మొహంపెట్టి పెద్ద జ్ఞానిలా సమాధానమిచ్చేడు - "నక్సలైట్లతో కలిసిపోయి చెడిపోకర్రా. అమాయకులు మీరు. ఆళ్ల మాట నమ్మి చెడిపోతున్నారని మిమ్మల్ని ఉద్ధరించడానికి యివన్నీ గవర్నమెంట్ చేస్తోంది'' అని చెప్పాడు.

ఆ జవాబుకు కంతుడు దీర్ఘ నిశ్వాసం తీసి "యెవుల్ని నమ్మి యెలాగ సెడిపోనామో... మీకు తెల్దా బావ్? మా కొండల మీద మా పంటల్తోటి, సంపదల్తోటి... మా బతుకు మీము సుకంగ బతికినోళ్లం. మా బతుకుల్లోకి సంతలూ, సావుకార్లూ వొచ్చినారు. ఉప్పుకీ, వొర్రగుండకీ, కిర్సనూనికీ మీము పల్లానికి దిగినాం. నేస్తరికాలు గట్నారు మాతోటి. అప్పా, అన్నా, బావా వరసలు గట్టి నమ్మించినారు పల్లం సావుకార్లు. నమ్మినాం. కంబార్ల (పాలేర్లు) మయిపోనాం. ఎలాగయిపోనామో, ఎవులి పాపమెంతుందో ఆ భగవొంతుడికి తెలియాల.

గురువులొచ్చేరు. సంగాల పెట్నారు. కొండల్ని కదిపినారు. నమ్మినాం. నడిచినాం ఆళ్ల యెనకాల! మంచే జరిగిందో, సెడ్డో జరిగిందో. మాకు అనుబగంలోకి రాకముందే ఆర్పేసినారు గురువుల్ని. సెదరగొట్టేసినారు మా కొండల్ని. మమ్మల్ని కొండలు దించేసినారు. ఇపుడు అన్నిటికీ పల్లానికే దింసుతున్నారు మమ్మల్ని. ఉద్ధరిత్తామంతన్నారు నమ్మినాం!




మా గొడ్డళ్లని.... ఆపీసుల సూరుకి యేలా డగట్టేసినాం. దరకాస్తుల జోలె పట్టుకు న్నాం. ముస్టికి మూడు జోలెల తీరవగుంది మా బతికిపుడు!

నర్సరీ స్కీములంతారు. దానికోపాలి దరకాస్తు వెట్టమంతారు. ఆపీసుల సుట్టూ తిప్పుతారు. అడివిలోని చెట్టుల్ని నరి కింపించేసీ అంటుగట్టిన మొక్కల్ని పెంచ మంతారు. ఆటికి నీళ్లేపోతలకి మా ఆడపిల్ల ల్ని కాల్దబ్బులకి కుదుర్చుతారు. ఆ పిల్లలకి పట్నం సినిమాలూ, సిల్కు కోకలూ అంటగ ట్టి ఆళ్లని నీతిలేనోళ్లని జేసి, నీళ్లు లేని మొక్కలు జేస్తన్ను!

సబ్సిడీమీద గేదెలంతారు. దాక్షిణ కొండ కాంచి మమ్మల్ని దాక్షారం సంతదాకా తిప్పు తారు. దళారోడికి సబ్సిడీని మేపుతారు. ఆ గేదెలు మా కొండలకొచ్చేసరికి వొట్టిపోయి మా పీకలకి బ్యాంకీ అప్పుల్ని చుట్టుతాయి.

ఇప్పుడు అడివి కొట్టేకండి. పోడు సెయ్య కండి. అంటన్ను. జీడితోట పెంచండన్నారు. మొక్కలిస్తాం, కూల్లూ యిస్తాం అన్నారు. ఏవీ? కూల్లు యేవీ? మొక్కలేవీ? కాళ్లు పీకులు మిగిలేయి మాకు!

సెప్పండి బాప్? యేటి వొరిగిపోతంది మాకు? ఏటి బావుపడిపోనాం మీము? సె ప్పండి బావూ... సెప్పండి?" అన్నాడు.

ఆ గొంతులో ఆక్రోశం ఉంది. ఆవేదన ఉంది. నిజాయితీతో కూడిన విషాదముంది. వాస్తవముంది. గత పాతిక, ముప్ఫయి యే ళ్లుగా ఆ కొండల్లో వాళ్లు అనుభవించిన జీవిత సారముంది.

ప్రకాశరావు యేవీ చెప్పలేకపోయాడు. కంతుడునీ, జమ్మెలస జనాలనీ సానుభూతి గా చూశాడు. తనేం చేయగలడు? ఏం చెప్పగలడు? ప్రభుత్వం యంత్రాంగంలో తనో పరికరం! రాజకీయ యంత్రాంగంలో తను యేమీకాని చదరంగం ఆటగాని చేతిలో శకటం! వాళ్లను ఎలాగయినా మీటింగ్‌కి తీసుకెళ్లాలి. ప్రాజెక్ట్ ఆఫీసర్ ఆర్డర్‌ని పాటించాలి. అది తనకు ముఖ్యం. అందుక నే సాధ్యమైనంత సౌమ్యంగా-

"నేనేం చేస్తాను చెప్పండర్రా! నా చేతిల యేదేనా యివ్వగలిగేదుంటే మీకు యివ్వ కుండా వున్నానురా? చెప్పండి. ఈతకా యంత నేను వుంచుకుంటే మీకు తాటికా యంత ఇవ్వడానికే చూస్తాను. అదీ నా గుణం" అని చెప్తుంటే, జనంలోంచి ఒకతను మెల్లిగా-

"తాటికాయ నువ్వుంచుకొని ఈతకా యంత మాకిస్తావు. మాకు తెల్దా నీ గుణం?" అన్నాడు. ఆ మాట వినబడ్డ జనాలు కిసు క్కున నవ్వేరు.

ఆ నవ్వులూ, ఆ మాటలూ చూసీ చూడన ట్లుగా, వినీ వినబడనట్లుగా మళ్లీ ప్రారంభించే డు ప్రకాశరావు.

"ఇపుడీ మీటింగుంది. నా యేరియా అండర్‌లో వున్న గిరిజన్లని తీసికి రమ్మన్నా రు. తీసికొని యెల్లాల! ఎల్తే ఈ యేరియా జనాలకి యేటి కావాలో అడుగుతారు. నేను చెప్తాను. అవి రావడానికి కాయితాలు పెడతా ను! అదిగదా ప్రొసీజరు. మరి మీరు రా మంటారా? మీ ఇష్టం. పీవోగారికి అదే చెప్తాను. మంత్రిగారు మరి మన యేరియాకి యేటివ్వరు! పల్లక యెలిపోతారు. ఆ వెనక మీరొచ్చి నామీదపడిపోయి మాకు యివి కావాలో, అవికావాలో అంటే లాభంలేదు. నేనేం చెయ్యలేను మరి! ఆలోచించుకోండి'' అని జాగ్రత్తగా వాళ్లను మీటింగ్‌వైపు ఆక ర్షించాడు.

కంతుడు ఆలోచించాడు. ఎపుడూ వున్న సంగతేగదా! ఈ వృధా తిరుగుళ్ళు! మరో సారి వెళ్ళొద్దాం అనుకొని-

"సరే పద బాప్. ఏటి జేస్తాం? మీటింగుకొ స్తాం. నువ్మాత్రం యేటి సెయ్యగలవ్? నీమీదనున్నోల ఆడర్ అది. పద, వొస్తాం...

తీసికెళ్లు బావ్' అని చెప్పాడు.

ఆ మాటకు ప్రకాశరావు - "నేను తీసుకెళ్ల డమేట్రా? మీరేం చిన్నపిల్లలా? రోడ్డుమీదకి వెళ్తే బస్సొస్తాది. బస్సెక్కి భద్రగిరి వెళ్లిపోవ డమే. నేను మోటార్ సైకిల్‌మీదనొస్తాను'' అన్నాడు.

"బస్సుకి టిక్కట్ తియ్యక్కర్లేదా?" అడి గేడొకడు జనంలోంచి.

"ఎందుకు తియ్యక్కర్లేదు? టికెట్ తీసు కుంటేనే బస్ ఎక్కనిస్తాడు కండక్టర్' చెప్పా డు ప్రకాశరావు.

"తియ్యడానికి మాకాడ డబ్బులెక్కడివీ? బ్యాంకీ సొమ్ము అందుతాదిగదాని కొండ దిగిపోనాం! జెల్లగొడితే... యెవులికాడ పావ లా లేదు'' చెప్పాడు అందరి తరపునా జనంలోంచి మరొకడు.

"మరెలాగైతే? నడిచి వెళ్తే మీటింగు వేళకి అందలేరు'' అన్నాడు ప్రకాశరావు చిక్కుము డి సమస్యలా చూస్తూ.

"రానూ పోనూ చార్జీలకి ఏడెనిమిదేసి రూపాయలుండాలి. అదీగాక సల్దేల అయిపో యింది. ఆకల్తోటి కడుపులు కాల్తన్నాయి మాకు. ఇంత కడుపుకీ యేదో తినాల! సూ డండి బావ్... మీరే ఏదో దారి'' అంటూ కంతుడు ఆ చిక్కుముడిని ప్రకాశరావునే విప్పమని చెప్పాడు.

ప్రకాశరావు ఓ క్షణం ఆలోచించాడు. నిజమే వాళ్లు చెప్పింది. వాళ్లకి డబ్బు ఏర్పాటు చేయకపోతే వాళ్లు రాలేరు. వాళ్లు మీటింగ్‌కి రాకపోతే పీవో మండిపోతాడు, డీటీడబ్ల్యూ అగ్గిమీద గుగ్గిలమైపోతాడు. అమ్మో! అలా వీల్లేదు. వీళ్లని ఎలాగో తీసికె ళ్లాలి! ఎలా? ఆలోచించేడు. ఆలోచించగా ఓ మార్గం కన్పించింది. వెంటనే-

"సరే మీకు బస్ ఛార్జీలకీ, ఖర్చులకీ డబ్బు ఏర్పాటు చేస్తానర్రా. గానీ, ఆ డబ్బు లు మీరు బ్యాంక్‌లో డబ్బందుకోగానే తీర్చే యాలి. వడ్డీగూడా యివ్వాలి. అలాగైతే మా ఎకౌంటెంట్ భార్య వడ్డీకి అప్పులి స్తుంటుంది. ఆవిడ్ని అడిగి తెస్తాను. ఆవిడ వడ్డీతో అప్పులు వసూలు చేయడంలో నక్షత్ర కుడికి పెద్దమ్మ! భర్తకి గూడా... వడ్డీకే డబ్బిస్తుంది. భర్త జీతం అంతా ఈవిడ చేతికిచ్చేస్తాడా! మధ్యలో ఆయనకి అవస రంపడి... అడిగితే వడ్డీరేటు ఖండించి యిస్తాది. అలాంటి మనిషన్నమాట!

బంగారపు వస్తువుల తాకట్టు మీదనో, నెలజీతం హామీ మీదనో అప్పు యిస్తుంది తప్ప హామీలేకపోతే అప్పు యివ్వదు. మీ లాంటోళ్లకి అసలివ్వదు. మీ కోసం అయినా నా అవసరమే అని ఆవిడకి చెప్పాలి. నా పేరు మీదనే తీసుకోవాలి. ఏం చేస్తాను? తప్పదు గదా!

ముందుగానే వడ్డీకోసేసి యిస్తుందర్రో. అసలేమో, మీరు తీర్చాలి. అదీ బ్యాంక్‌లో సొమ్ము అందగానే యిచ్చేయాలి సుమా!" అని అన్ని హెచ్చరికలతోనూ విషయమంతా అందరికీ చెప్పాడు.

"మరేటిజేస్తాం? అలాగే కానియ్యండి మరి!" అని అందరూ ఒప్పుకున్నారు.

అప్పుడు, అందర్నీ అక్కడే వుండమని చెప్పి ప్రకాశరావు బయల్దేరి వెళ్లాడు వాళ్ల ఎక్కౌంటెంట్ యింటికి. ఓ అరగంట తర్వాత డబ్బులు పట్టుకొని తిరిగొచ్చేడు. డబ్బు కంతుడి చేతికిచ్చి,

"ఇదిగో కంతూ, నాలుగొందల యాభై! అయిదు వందలకీ యాభై రూపాయలు వడ్డీ కోసేసి యిచ్చింది. మీ యిరవై మందీ సమానంగా సర్దుకోండి. రేపు మీకు బ్యాంకులో అందగానే మనిషి పాతిక లెక్కన అయిదొందల రూపాయిలూ యిచ్చేయాలి సుమా! లేకపోతే, ఆ నక్షత్రకుడి పెద్దమ్మ... నన్ను వేలమేసేస్తాది!" అని మరీమరీ చెప్పా డు.

డబ్బు అందుకొని, జనాలు అక్కడ్నుండి







ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఫిబ్రవరి చతుర నవల పునరావాసం**

**సమీక్షకుని పేరు :** ............................................

**చిరునామా :** ............................................

............................................

............................................

............................................

కదిలేరు. హొటల్లో టీ టిఫిన్లూ కానిచ్చి బస్సెక్కారు భద్రగిరికి. ప్రకాశరావు మోటార్ సైకిల్ కొద్దిసేపటి తర్వాత బయల్దేరింది.



ఐ.టి.డి.ఎ వారి గిరిజన అతిథి గృహం సందడిగా వుంది. గెస్ట్ హౌస్ ముందు జీపులూ, మోటార్ సైకిళ్లూ... బుగతోడిసాలలో రాటలకు కట్టిన పశువుల్లా నిలబడివున్నాయి. గెస్ట్‌హౌస్‌కి యెదుటి మైదానంలో విశాలంగా షామియానాతో బుగత పెండ్లి పందిరిలా ముస్తాబు చేశారు. షామియానా ముఖమ్మీద 'గిరిజన శాఖామాత్యులు శ్రీ బలదేవ్‌గారికి సుస్వాగతం' అన్న బేనర్ వేలాడుతోంది. మంత్రిగారింకా రాలేదు. అధికార్ల హడావిడీ, ఉద్యోగుల పరుగులతోసందడిగా వుంది.

వలసల నుండి వచ్చిన గిరిజన్లు మైదానంలో గుంపులు గుంపులుగా తిరుగాడుతున్నారు. కంతుడూ, వలస జనాలూ సభకు చేరిపోయేరు. అందరూ అటూయిటూ ఆ మైదానంలో తిరుగుతుంటే ఓ అరగంటకు ప్రకాశరావు మోటార్ సైకిల్‌తో వస్తూ కన్పించేడు. మోటార్ సైకిల్ ఆపి, స్టాండ్‌వేసి అధికార్ల హంగామాలోకి చేరిపోబోతోన్న ప్రకాశరావు దగ్గరకు కంతుడు వెళ్లి,

"మీమంతా వొచ్చీసినాం బావ్' అని చెప్పాడు.

"వొచ్చేసారా. సరే, అలా ఆ గ్రౌండ్‌లో వుండండి. అవసరమయితే పిలుస్తాను'' అని కంతుడికి చెప్పి, తొందర తొందరగా గెస్ట్ హౌస్‌కి నడిచేడు ప్రకాశరావు! లోనికి వచ్చిన ప్రకాశరావును చూసి, డిటీడబ్ల్యూగారు,

"నమస్కారం సార్! వచ్చేసారా? తమకోసమే చూస్తున్నాం. వేంచేసి సభ ప్రారంభించండి సార్" అని వ్యంగ్యంగా ఆహ్వానించారు.

ఆ వ్యంగ్యానికి ప్రకాశరావు గుండెలు దడదడా కొట్టుకున్నాయి. కాళ్లు గజగజలాడేయి. నోరు తడారిపోయింది. ధైర్యాన్ని కూడగట్టుకొని

"నిన్నా, మొన్నా కేంప్‌లకెళ్లానుసార్. పొద్దుటే కొండల మీదకు వెళ్లి జనాల్ని సభకి పిల్చుకొచ్చేనుసార్! ఇదిగో, యిప్పుడే కూల్ డ్రింక్‌లూ, ఫ్లవర్ బొకేలూ కొనుక్కొని వచ్చేనుసార్' అంటూ చేయని పనులను గూడా, చేసినట్లు చెప్పుకుపోబోయేడు!

ఆ డి.టి.డబ్ల్యూ (జిల్లా గిరిజన సంక్షేమాధికారి) అతి తెలివయిన వాడు. ఆవులించకపోయినా ప్రేగులు లెక్కపెట్టగలడు. ప్రకాశరావు అబద్ధాల్ని కట్ చేస్తూ,

"షటప్... డోంటాక్ మోర్. గో అండ్ అసిస్ట్ మిస్టర్ ఆనందరావ్, హెచ్.సీ.(పీ)వో ఆఫీస్'' అని ఆర్డరేసాడు.

యస్సార్ అన్చెప్పి, మొహమ్మీది చెమటను రుమాల్తో తుడుచుకొని, బయటకు పరుగెత్తాడు ప్రకాశరావు. హడావిడిగా తిరుగుతోన్న ఆనందరావు అక్కడెక్కడో కన్పించేడు. అటు పరుగెత్తాడు ప్రకాశరావు. ప్రకాశరావు రాగానే, అతన్తో ఆనందరావు,

"ఓయ్ ప్రకాశరావ్, ఆ కుర్చీల్ని వేదిక ముందు వరుసలో వేయించు. టైమైపోయింది. క్విక్, క్విక్' అని పని పురమాయించి, మరోవైపు పరుగెత్తాడాయన.

ప్రకాశరావు కంతుడి కోసం వెదికేడు.



కంతుడ్నీ, జమ్మొలస జనాల్నీ పట్టుకొని, కుర్చీలన్నీ వేదికముందు వరుసగా వేయించాడు ఆనందరావు చెప్పిన విధంగా! ఇంతలో ఆనందరావు గబగబా వచ్చి,

"గొర్రిపాడు గిరిజన్లు మైదానంలో ఆవైపు మొక్కా మోడూ, గడ్డీగాదం తీసి శుభ్రం చేస్తున్నారు. వీళ్లని గూడా అక్కడికి తీసికెళ్లి శుభ్రం చేయించు. అదవగానే, గెస్ట్‌హౌస్ వరండాలో టార్పాలిన్‌లున్నాయి. వాట్ని మైదానంలో పరిచేయమని చెప్పు వీళ్లకి. వేగం అయిపోవాలి సుమా'' అని మరో పని పురమాయించి వెళ్లాడు ఆనందరావు.

మొక్కామోడూ పీకి, గడ్డీగాదం తుడిచేసి మైదానాన్ని శుభ్రంచేసి దానిమీద టార్పాలిన్‌లు పరిచి, ప్రకాశరావు చెయ్యమన్న పనల్లా చేసి జనాలు అలసిపోయేరు. అందరూ అలసటగా ఒకచోట కూర్చున్నారు గుమిగూడి!

"మంత్రిగోరొస్తను! మిమ్మల్ని రమ్మన్నారా అంటే దేనికోఅనుకున్నాం! ఇదిగీ పన్లన్నీ సెయ్యించుకోడంకన్నమాట!" అని వాపోయేడు ఒకడు. కంతుడు మౌనంగా వింటున్నాడు.

"యిప్పుడికే పొద్దు గుంకే యేళయిపోతంది. మంతిరెపుడొత్తాడు? మీటింగు యెపుడికి అవుతాది? వలస యెపుడెల్తాము?" ప్రశ్నించేడు మరొకడు. అదీ విన్నాడు మౌనంగా కంతుడు.

"కలిగినోడికి కనికరం పుట్టేయేళకి కాటికెళిపోతాడట పేదోడు. అలగుందీ యవ్వారం" అన్నాడింకొకడు.

అప్పుడు మాత్రం కంతుడు నోరు విప్పి,

"యేటిజేస్తామర్రా? అన్నీటికీ యిసిగ్గిపోతే ఎలాగ? పెద్దలతోటి యవ్వారం. ఆళ్ల టయంకి ఆళ్లొత్తారు. మనకి ఏళయిపోతందంతే ఎలాగ?" అని కోప్పడ్డాడు అందర్నీ.

ఇంతలో ప్రకాశరావు హడావిడిగా అక్కడికొచ్చి,

"ఒర్రేయ్, జమ్మొలసోళ్లో! మంత్రిగారొచ్చేసారు. మీరంతా అదిగో స్టేజికి యెదురుగా టార్పాలిన్ వెనుక మెరకమీద కూర్చోండి. మళ్లీ అవసరమైతే పిలుస్తాను'' అని చెప్పి వచ్చినంత గాభరాగా వెళ్లిపోయేడు.

జమ్మొలస గిరిజన్లు ప్రకాశరావు చెప్పిన చోటనే కూర్చున్నారు. వేదిక ముందర వరస కుర్చీలలో మండల స్థాయి రాజకీయ పెద్దలూ, వారి మద్దతుదార్లైన కాంట్రాక్టర్లూ, వ్యాపార్లూ కూర్చున్నారు. వారికి పక్కగా జిల్లా అధికార్లూ పత్రికా విలేకర్లూ కూర్చున్నారు. వారి తర్వాత ఆ ప్రాంతంలోని ఆశ్రమ పాఠశాలలనుండి రప్పించిన విద్యార్థినీ, విద్యార్థులు కూర్చున్నారు. టార్పాలిన్‌ల మీద పల్లపు గ్రామాల్నించొచ్చిన రైతులూ, మంత్రిగారి కోసం తరలించుకొచ్చిన ఆ పార్టీ కార్యకర్తలూ కూర్చున్నారు. ఆఖరున, నేల మీద గిరిజన్లు కూర్చున్నారు.

ఓ అధికారి, వేదిక మీదకు వచ్చి, మైక్ పట్టుకొని మంత్రిగారినీ, గిరిజనశాఖ కార్యదర్శిగారినీ, ప్రోజెక్ట్ ఆఫీసర్‌నీ ఆ నియోజకవర్గ ఎమ్మెల్యేనీ వేదిక మీదకు ఆహ్వానించి సభాధ్యక్షులు ప్రోజెక్ట్ ఆఫీసర్‌కు మైక్‌ను అప్పజెప్పి, వేదికదిగి వెళిపోయేడా అధికారి. సభాధ్యక్షులు పీవోగారు సభ ప్రారంభానికి ఆశ్రమ పాఠశాల విద్యార్థినులిద్దరిచేత 'మా తెలుగు తల్లికి' పాట పాడించేరు. ఆ పాట ఆ వేదికమీద ఆ క్షణం పాడటంకోసం ఆ పిల్లలిద్దరూ అయిదుమైళ్లు నడిచివచ్చేరు. మధ్యాహ్నం నించీ తమలో తామే రిహార్సల్ వేసుకొని... పట్టిన చెమటల్ని తుడుచుకొంటూ ఆరుగంటలపాటు యాతన పడ్డారు. మళ్లీ అయిదుమైళ్లు యిపుడు తిరిగి నడవాలి!

పాట తర్వాత, పీవోగారు గిరిజనోద్ధరణకై ప్రభుత్వం అమలుచేస్తోన్న చేయబోతోన్న వివిధ పథకాలను వివరించేరు. ఈ వివర




ణకు మధ్యలో రెండుసార్లు గ్లాసులో నీటిని చప్పరించేరు. ఆ తర్వాత సభకు ముఖ్య అతిథి గారైన మంత్రిగారిని మాట్లాడాల్సింది గా కోరారు.

మంత్రిగారు లేచారు. మైక్ ముందుకు వచ్చి నిలుచున్నారు. సభకు తరలించబడిన కార్యకర్తలు 'గిరిజన శాఖామాత్యులు శ్రీ బలదేవ్ జిందాబాద్, జిందాబాద్' అంటూ నినాదాలిచ్చేరు. మంత్రిగారు సంతృప్తిగా మైక్‌ను పట్టుకొని ఓ చేయి గాలిలో వూపేరు. నినాదాలు ఆగాక. ఉపన్యాసం ప్రారంభించేరు.

"అందరికీ వందనాలు. నేనింకా చాలా కార్యక్రమాలకి హాజరవ్వాలి. అందుకనీ ఉపన్యాసం పెద్దగా చెప్పదల్చలా! అసలు, మాది చేతల ప్రభుత్వం (హస్తం చూపుతూ) డైలాగుల ప్రభుత్వం కాదు. (కార్యకర్తలు చప్పట్లు కొట్టేరు).

గిరిజనోద్ధరణకి మేము యెన్నో స్కీములు పెట్టించేం. కోట్లకొద్దీ రూపాయిలు కేటాయించేం. కాలనీలు గట్టినం. స్కూళ్లు పెట్టినం. ఆసుపత్రులు, ఆఫీసులూ గిరిజన్ల కోసం తెరిపించినం. మీ కోసమే యివన్నీ చేస్తన్నం.

మిమ్మల్ని ఉద్ధరించడానికి, నేను యెంతటి త్యాగమయినా చేస్తాను. అవసరమయితే, కేంద్రంతోనైనా పోరాడతానని... సభాముఖంగా మీకు నేను తెలియజేస్తన్నా! (కార్యకర్తల చప్పట్లు) మీరు అపోజిషన్ పార్టీ వోళ్ల మాటలినకండి. అన్నల్ని నమ్మకండి. మిమ్మల్ని మేం ఉద్ధరిస్తాం. మిమ్మల్ని యింకా యింకా ముందుకి తీసుకొస్తాం. జైహింద్'' అని తన ఉపన్యాసం ముగించి, కారెక్కి మంత్రిగారు ముందుకుపోయేరు.

ఆ తర్వాత ఒకరిద్దరు గిరిజన పునరావాస పథకాలను వివరించేరు. సభ ముగిసింది. కొండమీదనుంచి దొర్లిన బండరాళ్లల్లా కార్లూ, జీపులూ పట్నానికి పరుగులు తీసేయి. వాటివెనుకనే మోటార్ సైకిళ్లూ కనుమరుగైనవి. వేదిక ఖాళీ! సందడీ, సందడితోపాటూ వెలుతురూపోయింది. అందరూ వెళ్లిపోయేక చీకటి మైదానంలో గెస్ట్‌హౌస్ కాల్తోన్న గడ్డికుప్పలా వుంది విద్యుద్దీపాల్తో.

పది గంటల రాత్రి దాటిపోయింది. తిరిగి తమ వలస పోయేదారికి బస్సులులేవు. కంతుడి చుట్టూ జనాలు చేరారు. అక్కడక్కడా గుంపులుగా వీరిలాగానే యే వలస వారో కూర్చుని వున్నారు. కంతుడు చుట్టూ చూసేడు. చీకటి... చీకటిలో కొండలు స్తంభించిన యేనుగుల్లా వున్నాయి. చుట్టూ చూస్తూ ఎందుకు పిల్చేరు? ఏమిచ్చేరు? ఏం చెప్పారు? ఏమొచ్చింది తమకు అని ఆవేదన పొందసాగేడు. అప్పటికే మిగిలిన జనాలు కూర్చున్న చోటనే అలా వొరిగిపోయి, నిద్రలోకి వెళిపోయేరు. కంతుడు ఆలోచిస్తూ, ఆవేదనతో యే రాత్రికో నిద్రపోయేడు. ఆకలిని కప్పుకొని, నిద్రను పరుచుకొని గిరిజన అతిథిగృహం ముందరి మైదానంలో కాందిశీకుల్లా ఆ గిరిజనులు నిద్రపోయేరు.

★ ★ ★

మర్నాడు నిద్రలేచి, వలస వెళ్లే బదులు ప్రకాశరావు దగ్గరకు వెళ్తే మంచిదని నిర్ణయించేరందరూ! గెస్ట్ హౌస్‌కి కొంతదూరాన గల గెడ్డకు వెళ్లి, కాలకృత్యాలు ముగించుకొని వచ్చి బస్‌యెక్కారు. పదిగంటల వేళకి ప్రకాశరావు యింటికి చేరుకున్నారు. ప్రకాశరావు యింట్లో లేడు. పీవో ఆఫీస్‌కి వెళ్లాడని ప్రకాశరావు భార్య చెప్పింది. ఎక్కడలేని నిస్సత్తువా అలముకోగా, జమ్మొలస జనాలు ప్రకాశరావు గడప ముందు అలా నిల్చుండిపోయేరు.

"రెండ్రోజులు, పనీపాటూ పోనాయి. అప్పువోడుకున్న డబ్బులూ కర్సయిపోనాయి. మూడు సోలల ముష్టికి మూడాళ్లు తిరగడమంటే యిదే!" అన్నారెవరో జనంలోంచి.

కంతుడు మౌనంగా విచారంగా వలస

వైపు దారితీసేడు. అందరూ కంతుడి వెనుక కదిలేరు. ఎండ ముదురుతోంది. కొండలు మండిపోతున్నాయి. అడవిలో ఆకు అల్లాడ టంలేదు. ఉక్కపోతగా వుంది వాతావరణం. నడుస్తుంటే చెమటలు ధారలు కడుతు న్నాయి. కంతుడు, జనాలతో ఆగకుండా నడుస్తూనే వున్నాడు. దారి మామిడిచెట్టు దగ్గరకి చేరారు.

మైదానానికీ కొండలమీద వలసలకీమ ధ్య సగందూరంలో కొండ యెక్కే దారిలో ఓ పెద్ద చాపరాయి, మామిడి చెట్టు చుట్టూ ఉంటుంది. ప్రయాణీకులు అక్కడో క్షణం కూర్చొని, అలసట తీర్చుకుని, తర్వాత మళ్లీ నడక ఆరంభిస్తారు. దాన్ని అందరూ దారిమా మిడి చెట్టు అంటారు. అక్కడ ఆగి, మామిడి చెట్టుకు రెండు చేతులెత్తి మొక్కి, దారి పక్కనున్న మొక్కల ఆకులు ఒకటో రెండో తెంపి మామిడి చెట్టు ముందు వేస్తారు. అక్కడేదో దేవత వున్నదని నమ్మకం. ఇప్ప టికీ అందరూ ఈ నమ్మకాన్ని కలిగేవున్నా రు.

దారి మామిడిచెట్టు దగ్గర నలుగురు యువకులు విశ్రాంతి తీసుకుంటున్నారు. కంతుడూ మిగిలిన జనాలూ అక్కడికి చేరా రు. వీళ్లందరినీ చూసి ఆ నలుగురు యువకు లూ లేచి నిలబడి, కుడిచేయి యెత్తి పిడికిలి బిగించి "లాల్‌సలాం!" అన్నారు.

జనాలు అయోమయంగా చూసేరు. వాళ్ల కి అర్థం కాలేదేమీ. కానీ కంతుడికి మాత్రం ఆ లాల్‌సలాం చెప్పిన వారి భంగిమ గుండె ల్ని తాకింది. నలుగురునీ పరిశీలనగా చూసే డు. అందరూ యువకులు పాతికేళ్లు దాటని, పట్టుదల మూర్తీభవించిన బిడ్డల్లా కన్పించే రు. పాతికేళ్ల కిందట యీ కొండల్లో వొలికిన నెత్తుటిలో పుట్టి పెరిగిన పసికందులు పగసా ధించ యెదిగివచ్చి, నిలబడ్డారా అన్పించింది.

వార్ని అలా చూస్తూ వుండిపోయేడు కంతుడు. అరవైయేళ్లు దాటిన కంతుడు.. వటవృక్షంలా వుంటాడు. కళ్లు పచ్చగా వట పత్రాల్లా వుంటాయి. దీర్ఘ జీవితానుభవ సారంతో నిండిన వటవృక్షంలా వుంటుంది శరీరం! అలా చూస్తూ, చూస్తూ ఒక్కసారిగా రాలిపోయిన ఆకులన్నిటినీ గుర్తు తెచ్చుకునే వటవృక్షమయ్యాడు కంతుడు. గతం కది లింది కంతుడి మనో ఫలకంమీద.

సరిగ్గా పాతికేళ్లకిందట ఓ రాత్రి!

పచ్చని అడవి మీదుగా చీకటిలో నిల్చిన జోగిపురం కొండ! కొండమధ్యలో తూర్పుకి పడమరకు పాకలు రెండు పోడు పంటల కాపుకోసం వేసివున్నాయి. తూర్పుపాకలో ఉయ్యికోడు, పడమర పాకలో కంతుడూ కాపలా కాసుక్కూచుంటారు.

ఉయ్యికోడి పాకలో గురువూ, ఆయన్తోటి వచ్చిన పార్టీ నాయకులూ సమావేశమయినా రు. అప్పటిదాకా నడిచిన గిరిజనోద్యమా న్నీ, ఆ ఉద్యమంపై అమలవుతోన్న పోలీస్ నిర్బంధాన్నీ సమీక్ష చేస్తున్నారు. నిర్బంధంలోంచి, ఉద్యమాన్ని నిలదొక్కు కుంటూ, యెలా విస్తరించాలో చర్చించు కుంటున్నారు ఆ సమావేశంలో. ఆ పాకకు ముందూ, వెనుకా ఉయ్యికోడూ, కంతుడూ బయటనిల్చుని సెంట్రీకాస్తున్నారు. సెంట్రీ కాస్తూ కంతుడు గురువుకి తను చెప్పిన విషయం గురించి ఆలోచిస్తున్నాడు. తమ జమ్మెలసలకి పల్లపు భూమి పదిహేను యెకరాలదాకా వుంది. దాన్ని షావుకారి సత్తెయ్య తప్పుడు రికార్డుల్తో తనదని చెప్పి ఆక్రమించేడు. పోలీసుల్ని దించి వలస జనా ల్ని కొట్టించేడు. ఆ భూమి వలసకి దక్కాలి! అదే చెప్పాడు గురువుకి. ఆ విషయంమీద గురువు యే నిర్ణయం చేస్తాడో? ఆ భూమే గాని వలసకి దక్కించితే వలస వలసంతా సంగంలో కలుస్తాది. గురువు యెనకాల నిలబడతాది. గురువు యేటి ఆలోచించేడో మరి? సెంట్రీకాస్తూ కంతుడి ఆలోచనల్లివి.

కోడికూసే ఝాముకి సమావేశం ముగి




సింది. గురువూ, ఆయన్తో వొచ్చిన నాయకులూ సమావేశం నుంచి లేచారు. అక్కడ్నించి మరోచోటికి వెళిపోవటానికి సిద్ధమౌతున్నారు. గురువు కంతుడి దగ్గరకొచ్చేడు. కంతుడి భుజాన్ని ఆదరంగా తడుతూ గురువు,

"కా(మ్రే... నువ్వు చెప్పిన భూమి సమస్య చర్చించేం. భూమి విడిచిపెట్టాలని ఆ షావుకారికి మన పార్టీ గతంలో రెండు పర్యాయాలు కబుర్లు పంపించింది. హెచ్చరికలు చేసింది పార్టీ. అయినా వాడు లెఖ్ఖ చేయలేదు. అంతేగాక మిమ్మల్ని పోలీసుకేసుల్లో యిరికిస్తున్నాడు. పార్టీ నాయకుల్ని పట్టి యివ్వడానికి కుట్రలు పన్నుతున్నాడు. అటువంటి వాడివలన యిటు ప్రజలకు యిబ్బందులూ, అటు పార్టీకీ, ఉద్యమానికీ నష్టమూ వస్తుంది. అందుకని ఆ షావుకారికి మరణశిక్ష నిర్ణయించేము. త్వరలో మన గెరిల్లా దళం శిక్షను అమలు చేస్తుంది. మీరు నిబ్బయంగా వుండండి. సంఘంలో చేరండి. పార్టీని మరింత బలపర్చండి'' అని విషయమంతా చెప్పాడు.

కంతుడు గురువువైపు ఆరాధనగా చూసేడు. మేకల మందమీద పడి చంపుకుతినే పులిని వేటాడే సాహసిలా కన్పించేడు గురువు! వెంటనే తన చేతిలోని నాటు తుపాకీని గురువుకి యిచ్చేస్తూ,

"గురువూ యిదుంచు నీకాడ. దీన్ని నేను అడవి జంతువుల యేటకి వుంచేను. ఆటికంటే పెమాగమయిన జెంతువుల్ని నువ్వు యేటాడతన్నావు. నీకాడ యిదుండాల. వుంచు'' అని చెప్పాడు కంతుడు.

గురువు సంతోషంగా ఆ తుపాకీని అందుకున్నాడు. కంతుడ్ని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. కౌగలించుకొని,

"ఆయుధాలే ముఖ్యంకాదు విప్లవానికి. ప్రజాశక్తిముఖ్యం. మీరంతా మాకు అండగా వుంటే యే నిర్బంధాన్నైనా ఎదిరించగలం కా(మ్రే. పార్టీకి నువ్విచ్చిన ఆయుధం పవిత్ర ఆశయం కోసం వినియోగపడుతోంది. చాలా సంతోషం కా(మ్రే. మళ్లీ మరోసారి కలుద్దాం. వస్తాం" అని చెప్పి, ఆ చీకటివేళ గురువూ, నాయకులూ బయల్దేరారు. అలా బయల్దేరుతూ చిరునవ్వుతో కుడిచేయి ఎత్తి పిడికిలి బిగించి "లాల్‌సలాం" చెప్పారు గురువూ, నాయకులూ! ఇప్పటికీ ఆ దృశ్యం... గుండెల్లోంచి చెరిగిపోలేదు కంతుడికి.

మళ్లీ పాతికేళ్ల తర్వాత!
అదే దృశ్యం!
ఎవరు వీరు?
ఏ నెత్తుటి జ్ఞాపకాలు?
ఏ వీరుల వారసులు?
మళ్లీ యే యుద్ధానికి రంగభూమిలోకొచ్చేరు?
తుడిచేసుకున్న ఏ జ్ఞాపకాల్ని కదపడానికొచ్చేరు?
మాసిపోయాయనుకున్న యే గాయాల్ని రేపడానికొచ్చేరు?

ఎందరో వచ్చేరు. వెళ్లేరు... ఎపుడూ మా బతుకుల్లోకల్లోల కెరటాలే! ఎవరెవరో తరిమితే నా తాతల తరం అడవులూ, కొండలూ పట్టినారట. నా తరం అడవుల్లో సుకంగా బతికితే మళ్లీ పల్లం నుండి షావుకార్లు, అధికార్లు, సారా కాంట్రాక్టర్లూ వొచ్చేరు. సంతలొచ్చేయి. అడవి ప్రపంచం నుండి బయటి ప్రపంచాన్ని మేం చూసేమోలేదో! మా బతుకు గోచిగుడ్డకు మిగిలింది. మేం కంబార్లమయినాం! మా పొలాల్లోనే పాలేర్లం. మా సంపదలకే మేం కూలోల్లం! కంబారోల్లిని.. కమ్యూనిస్టులు జేసాడు గురువు! పార్టీవొచ్చింది. నాయకులొచ్చేరు. కళ్లు తెరిచిన కొండలు ఎర్ర జెండాలెగరేసాయి. అడివి ఘాది అయింది. సంపద సగం చేతికి వచ్చింది. షావుకార్లు పారిపోనారు. అధికార్ల జులుం ఆగిపోనాది. కుండలోని మెతుకు మా నోటికీ, కడుపులోకీ అందింది. గానీ అందుకోసం యెంత నెత్తురొలికింది. ఎంతమంది బిడ్డల్ని అర్పించేసినాం! ఎన్ని

గాయాల్ని మోస్తున్నాం! గుండెలు తడుము కున్నాడు కంతుడు.

రక్తం వొలికిన తర్వాత రంగుల స్కీము లొచ్చేయి డబ్బాల్లో పథకాలు నింపి! కోట్ల రూపాయలు... కొండల్లో గలగల లాడించే రు. గారడీవాడి డబ్బా... అనుకోలేదు మేం! గలగలలాడిన పునరావాసంవైపు మలుపు తిరిగేం! ఇదిగో ఇలా యెక్కి ఆఫీసూ, దిగీ ఆఫీసుగా మిగిలేం.

వొలసల్లో ఒకపక్క గోచిపాతలూ, గొడ్డు బతుకులూ పోలేదు. మరోపక్క సిల్క్‌చీర లూ, సిన్మాసోకులూ చేరాయి. కంబారి బ్రతు కునుంచి కళాసీలుగా, కామాటీలుగా, బంట్రో తులుగా మారేయి, మావాళ్ల బతుకులు! కొందరికి అటు పోడుపంటా పోయీ, ఇటు ఈ పథకాలూ అందుబాటుకాక... అర్ధాకలి మిగిలింది. రెంటికి చెడ్డ రేవళ్లయ్యారు.

కంతుడిలో ఇవన్నీ ఒకదాని తర్వాత ఒకటిగా జ్ఞప్తికొచ్చి ఆవేదన, ఆక్రోశం, ఆగ్రహం, విషాదం, ఆవరించి మనసుని ముద్దజేశాయి. గతం నెమరువేతలోంచి కంతుడు బయటపడి మారుమాట్లాడలేదు. మౌనంగా అక్కడ్నించి కదలబోయేడు.

"యే వూరు కామ్రేడ్..." ప్రశ్నించాడు. నలుగురి యువకుల్లో ఒక యువకుడు. అత నే దళకమాండర్ ప్రభు.

ఆ మాటకు కంతుడు ఆగేడు. మళ్లీ ఆ యువకుల్ని చూసి,

"మీరెవులు నాయిన్లారా?" అనడిగేడు.

"అన్నలం కామ్రే..." చెప్పారు వారు.

"ఆс!" ఆశ్చర్యపోయాడు కంధుడు. మిగిలినవాళ్లు బెదురు బెదురుగా అన్నలను చూస్తూ నిల్చున్నారు

కంతుడికి తన అనుమానం నిజమే అన్పించింది. అయితే, వీళ్లు మళ్లీ ఏ నెత్తుటి యజ్ఞాన్నీ ఇక్కడ ఆరంభించకపోతేనే మంచిది. ఇప్పటి వలసలు పాత వలసల్లా టివి కావు. పాత కట్టుబాట్లు వలసల్ల మారిపో తున్నాయి. పాతరోజుల్నాటి మనుసులు. ఆ యుద్ధాన్ని మర్చిపోయి, ఆ యుద్ధంల తమ పాత్రని చెరిపేసుకొని, వాడెనకాల, వీడెన కాల ఏవేవో... పథకాల లబ్ధికోసం పరుగులు తీస్తున్రు. తమ వెంట జనాన్ని నడిపించినోళ్లే జనాన్నొదిలేసి తమ బాగు చూసుకుంటున్రు. ఇంకా, తన జనం, జమ్ముచలస మాత్రం... కట్టుగా తనవెంట వుంటున్నా అదీ ఎంత కాలంకొనసాగుతుందోఅనుమానమే కంతుడి కి. ఈ పరిస్థితుల్లో ఇంకా పార్టీలూ, సంఘా లూ ఇక్కడ మనగలగడమూ కష్టం. అదీ గాక, గురువుకాలంలో పార్టీకీ... ఇప్పటి పార్టీకీ తేడా వుంది. పార్టీ చీలిపోయింది. అందరూ గురువుకి వోరసులం అంటారు. యిప్లవం అంటారు. ఎవరిని నమ్మాలో... ఎవరిదారి సరైందో ఎవరి వెంట నడవాలో? ఇవన్నీ ప్రశ్నలే.

కంతుడు అంతరంగంలోనే యిదంతా కలియదిరుగుతుంటే, అనాసక్తంగా అన్నల వైపు చూస్తూ-

"వెళ్లొస్తాం..." అని చెప్పి కదిలేడు.

అంతకుమించి అదనంగా వారితో మాట్లా డదలచుకోలేదు. అన్నలు మాత్రం కంతుడినే చూస్తున్నారు ఆదరంగా. వాళ్లకు తెలుసు. ఆ వృద్ధుడు పోరాటానికి చేసిన సాయం. వాళ్లకు ఆ వృద్ధుణ్ణి స్పర్శించాలనుంది. అతని దే హంనిండా మచ్చలుగా మిగిలిన గాయాల ను స్పృశించి, గుండెనిండా ధైర్యాన్ని నింపి, 'మేమున్నాం నీకు' అని చెప్పాలని వుంది. ఓ యోధుడా... నిన్ను కౌగలించు కోనీ. నీ యుద్ధగాధలను వినసీయి అని చెప్పాలని వుంది వారికి.

కంతుడు దోవతీసేడు. కంతుని వెనకే మిగిలిన జనాలూ కదిలేరు. వెళ్లిపోతున్న జనాలను చూస్తూ, బండమీద కూర్చుని అన్నలదళం గళాలు విప్పి,

 

"ఓ వెంపటాపు సత్యం...

నిను మరువలేము నిత్యం" పాట యెత్తుకున్నారు.

ఆ పాట కంతుణ్ణి వెంబడించింది. కంతుడు నడుస్తూనే గురువు (వెంపటాపు సత్యం)ని తల్చుకుని కన్నీరు కార్చేడు. మనసంతా ఆవేదనతో నిండిపోయింది. కాల్పుల్లో కాలిపోయిన కొడుకూ, ఆచూకీ లేని కోడలూ... గుర్తొచ్చేరు. దోవపొడుగునా, ఎవరితోనూ మాటామంతీ లేకుండా మౌనంగా ఇల్లు చేరాడు కంతుడు.

ఇంటికొచ్చేక 'బంతి' కోసం కేకేసాడు.

బంతి- 'యేం తాతయ్యా' అంటూ వచ్చి నిల్చొంది.

కంతుడు బంతిని తేరిపార చూడసాగేడు, కొత్తగా చూస్తున్నట్లు. బంతికి వింతగా వుంది. ఎందుకలా చూస్తున్నాడు తాతయ్య?

చూస్తూ, చూస్తూనే కంతుడు... కన్నీరు గార్చేడు.

బంతిలో ఆందోళన కలిగింది. తాతయ్యకు దగ్గరగా వచ్చింది. గడపలో కూర్చోబెట్టింది. తాతయ్యను ఆదరంగా చూస్తూ,

"ఏటయ్యింది. జూజూ?" అనడిగింది.

కంతుడు కన్నీరు తుడుచుకొన్నాడు. గుండెలనిండా ఓసారి ఊపిరి పీల్చి వదిలేడు. ఆ తర్వాత, జరిగిన ఘటనలన్నీ చెప్పుకొచ్చేడు. ఎగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటర్ ప్రకాశరావు ఇంటికి వెళ్లిన దగ్గరనుంచీ, భద్రగిరి మీటింగు భోగట్టా. అక్కడినుంచి మళ్ళీ తిరిగిరావటం, తిరిగొచ్చేదారిలో 'అన్నలు' కలియటం వరకూ చెప్పాడు. చెప్పి,

"... ఆళ్లకి నీ వయసే వుంటాది. నీలాగే, ఆళ్లు... ఇక్కడ, ఈ కొండల్ల యుద్ధం జరిగేరో జుల్ల పుట్టివుంతారు. ఏ తల్లుల బిడ్డలో? ఈ అడివిలో కొచ్చేరు. ఔనమ్మా మళ్ళా యుద్ధం జరుగుతాదంతావా?" అనడిగేడు.

ఆ ప్రశ్నకు బంతి గాభరా పడింది. ఏం జవాబు చెప్పాలి? తాతయ్య ఏం కోరుకుంటున్నాడు? యుద్ధాన్నా? లేకపోతే ఇలా ఈ బ్రతుకులు సాగిపోవటాన్నా? తాతయ్య స్వరంలో ఏం వుందో బంతికి అవగాహన కాలేదు.

ఏ జవాబూ చెప్పక మౌనంగా వున్న బంతిని చూస్తూ కంతుడు ఎవరినో గుర్తు జేసుకుంటున్నాడు. గతంలోని ఏ ఘటననో స్మృతిపథంలోకి తెచ్చుకుంటున్నాడు. గుండెల్లోంచి చెరిగిపోకుండా నిలిచిపోయిన దేనినో తడుముకుంటున్నాడు. తనలోతానే గతాన్ని మళ్లీ చెప్పుకుంటున్నట్లు చెప్పసాగేడు.

బంతికి స్పష్టా స్పష్టంగా విన్పిస్తోంది.

"అప్పటికి ఈ వొలసలన్నింటా 'గిరిజన సంగాలు' లేసినాయి. కొండల్లో ఎర్రజెండా లెగిరినాయి. గురువు ఇచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. మన వొలస భూమి తగువు తేలిపోయింది. మనమూ, 'సంగం' జెండా ఎగరేసినాం.

మీ నాయనకి ఇంకా పెళ్లికాలేదు. పెళ్లీడు కొచ్చేడు. గురువుల్తోటి కుర్రోడుగదా... మా సెడ్డ సరదాగా తిరుగుతుండు. ఆ తర్వాత పంటలకి గావాలి. మీ యమ్మని మనవాడినాడు'' చెప్పుకుపోతున్నాడు కంతుడు.

తండ్రి భోగట్టా చెబుతుంటే, బంతి మరింత ఉత్సుకతతో దగ్గరకు జరిగి వినసాగింది.

"గురువులు మాకు అచ్చరాలు నేర్పేవోరు. పాటలు పాడి యినిపించేవోరు. ఏ రోజేనా, ఏ గురువేనా ఇంటికొత్తే ఆ పూట మాకు పండుగే. అంత సరదాగా వుండేది.

ఒకరోజు పొద్దుటే వొచ్చేడు వొక గురువు. చంకల గుడ్డసంఛీతోటి ఇంటిముందు నిలబడి 'లాల్‌సలాం' అన్నాడు కుడిచేయి ఎత్తి పిడికిలి బిగించి.

మీ నాయన ఇంటిలలేడు. పోడుమీద గావాల వున్నాడు. నేను గభాల్న ఇంట్లోంచి బయటకొచ్చి,



"రా, కాశ్రమే... రా, కూకో. మొయిలం ఇంటిల్లేడు, కవురెడతాను, కూకో' అని పిల్చి అరుగుమీద కూకోమన్నాను.

ఆ కాశ్రమే చిన్నగా నవ్వుతా, అరుగుమీద కూకోని.

"మొయిలం గాదులే. నీతోటే పని. రా, కూకో' అని నన్ను పిలిసేడు. ఎదురుగా కూకోమన్నాడు.

నేను, కాశ్రమే యెదురుగా కూకోని.

"ఏటి గురువా? నాతోటి పనేటి?" అడిగేను అనుమానంగా.

ఆ కాశ్రమే, మాటాడకండా, సంచీలోంచి మంగలికత్తెరా, దువ్వెన, చిన్న అద్దం తీసేడు. కత్తిరి కర కర లాడించి.

"నీకూ క్రేఫింగ్ జెయ్యాల. మన గ్రామకమిటీ తీర్మానం జేసింది. బాధ్యత నాకు అప్పగించింది'' అన్నాడు.

నాకు ఎక్కడలేని సిగ్గూ ముంచుకొచ్చింది. ఈ మద్దెకాన పిలకలు కత్తిరించి క్రేపులు జేయించటం, ఆడోళ్లకి జేకట్లు యేసుకోమని సెప్పటం, చదువు నేర్పటం... ఇవన్నీ 'సంగం' చేస్తంది.

జుత్తు తడుముకున్నాను. ఎప్పటినుంచో పెంచుకొచ్చిన జుత్తు, ఉంగరాలే, ఉంగరాలు తిరిగిన జుత్తు శిగ తగిలింది పొడవుగా. తల అడ్డంగా వూపేను. శిగముడి అటూ ఇటూ కదలాడింది.

"వొద్దొద్దు కాశ్రమే. నాకేల క్రాపు? నీనేటి కుర్రోడినేటి? కులుకులూ, సోకులూ సెయ్యడంకి. వొద్దొద్దు'' అని జుత్తుని చేతుల్తో కప్పుకోజూసేను.

ఇరుగూ, పొరుగోళ్లు ఎలిపొచ్చేరు, ఈ అలికిడికి. వొచ్చినోళ్లు "కానియ్యి కాశ్రమే'' అని కాశ్రమేకే సపోర్ట్ ఇచ్చేరు.

మీ నాయినమ్మ పెరటిలోంచి వొచ్చింది. ఆ గురువేమో కత్తెర చూపి, "కటింగ్... క్రేప్..." అనన్నాడు.

మీ నాయనమ్మ గభాల్న ఇంట్లోకెళ్లి గలాసునిండా నీళ్లు దెచ్చి కాశ్రమే ముందుపెట్టింది, పెట్టేసి-

"తిన్నగా కూకో. కదిలితే క్రేపింగు సెడిపోద్ది'' అన్నది నాతోటి.

నాకు వొళ్లు మండిపోయింది. మీ నాయినమ్మ బీపి (వీపు)మీద గుభీ గుభీమని నాలుగు గుద్దేయాలనిపించింది. గానేటన్లేక పోనాను. కాశ్రమే వున్నాడు. ఆడోళ్లని గొడితే వొప్పుకోడు. ఇన్నాళ్లలాగ కాదు ఇప్పుడు. అంతకముందులాగే, అల్లా పువ్వల సన్నాసిగోడు వొకపాలి పూడుగ తాగేసీ, ఆడి పెళ్లాన్ని కొట్టేడు. అదేమో, ఏటిజేసిందీ? సంగపోలికి సెప్పింది. గ్రేమ కమిటీల పంచాయితెట్టింది. గ్రేమకమిటీ ఆ సన్నాసిగోడికి సరిపోయినట్టగ శిక్ష ఏసింది. అది, గురుతుండిపోయింది నాకు. అందుకని ఆగినాను. మీ నాయినమ్మ నేటి అన్లేదు. కొరకొరా చూసి, లోపల కుతకుతా వుడికిపోనాను కోపంతోటి.

చక్ చక్ మన్పించేసి శిగనిఎక్కడికక్కడ తుప్పా, దొంకల్ని నరికిపడేసే రైతోడినాగ... ఆ కాశ్రమే నా జుత్తుని కటింగ్ జేసేత్తండు. నా రూపు అలాగలాగ అలాగ మారిపోతంది. అయిపోయింది కటింగ్.

'సూస్కో' అని అద్దం ఇచ్చింది మీ నాయినమ్మ. అద్దాన్ని నేలకేసి కొట్టిద్దుమనుకున్న. మళ్లా కాశ్రమే ఏటంతాడో బయ్యం.

ఒక్కపాలి అద్దంలోకి సూసినాను. నానేనా? నా మొగమేనా? అని అనుమానమేసింది. నాకు కుర్రతనం రూపొచ్చినట్టగయ్యింది.

అదేటి సిత్రమోగాని, అప్పటిదాకా అంత ఇదిగా తొందరజేసిన మీ నాయినమ్మ నా క్రేపింగ్ రూపుజూసి అది సిగ్గుపడిపోయింది. గబగబా ఇంట్లోకి పారిపోయింది. కాశ్రమే... కళ్లెగరేసి నవ్వుకుని, లెగిసాడు.




అప్పుడొచ్చేడు. ఆరికి సిద్దంగాడు. ఆదరా బాదరాగా! వొచ్చి-

"క్రామే... క్రామే. సావుకారి కామేశు దాన్నెం బళ్లు పుయ్యించినాడు. పల్లానికి తోలుకుపోతండు'' చెప్పాడు.

"అదేటది? సంగానికి లెవీ ఇచ్చేడా?" అని అనడిగేడు క్రామే.

"ఇవ్వలే'దన్నాడు సిద్ధం.

"లెవీ ఇవ్వకుండా ధాన్యం పల్లానికెలాగ తోలుకుపోతాడు?"

ఆ ముక్కే అడిగినాను క్రామే. అడిగితే, అంతాడూ లెవీ వసూలుజెయ్యడంకి మీ సంగం గవరమెంటేటిరా? అనన్నాడు'' చెప్పాడు సిద్ధం.

అప్పుడికి మీ నాయిన వొచ్చేడు. పోడు మీదనుండి. కోపంతోటి కదిలిపోతూ మీ నాయిన,

"ఇదిగీ కొండల్ల ఈ వొలసల్ల సంగమే గవిర్మెంటు అని సెప్పలేకపోనావా?" అనడిగేడు సిద్ధంని.

"ఆ షావుకారికి మాటల్తోటి లాభంలేదు. పదండి, మనమంతా వెళ్లి, ముందు ఆ ధాన్నెం బళ్లు అడ్డుకొందాం. గ్రామకమిటీ ఆఫీసుకి ధాన్యం బళ్లు తోలుకుపోదాం. షావుకారి సంగతి అక్కడే తేలుద్దాం, పదండి'' అన్నాడు క్రామే...

"నువ్వేల క్రామే. నువ్వు, సంగం ఆఫీసుల కూకో. నీ కాళ్లకాడకి ధాన్నెం బళ్లొ వొత్తాయి. సావుకారే వొత్తాడు'' అని చెప్పి, మీ నాయిన పెద్ద దుడ్డుగర్ర పట్టుకు బయలెల్లాడు.

అంతే! ఆడెనకాల బయిలెల్లిపోయింది వొలస! ఆడా, మగా, పిల్లా, పెద్దా కదిలిపోయేరు.

బళ్లనిండా ధాన్నెం బస్తాలెక్కించి, పల్లంనుండి కిరాయి మనుషుల్ని తోడుగా తెచ్చుకొని బళ్లకు ముందు గోర్జి వెంబడి నడుస్తున్నాడు సావుకారి కామేశం. నెత్తిమీద గుబ్బగొడుగు.

జనం చేరిపోయేరు. గోర్జినిండా జనమే. గోల గోల! "గిరిజన సంగం వొర్ధిల్లాలి'' "ఏజన్సీల పండిన తిండిగింజలు ఏజన్సీకి లేకండా, ఎక్కడో అమ్మడంకి ఈల్లేదు'' అరుస్తున్నారు జనం.

గుబ్బ గొడుగు మూస్సేడు షావుకారి కామేశం. ధాన్నెం బళ్లు నిలబడిపోనాయి. కిరాయి మనుసులు... బితుకు బితుగ్గా నిలబడ్డారు. ఎటు జూసినా జనమేగదా? షావుకారి కిరాయోల్ని రెచ్చగొడతండు. అప్పుడు, మీ నాయిన షావుకారి ముందన నిలబడి-

"సావుకారీ, సాల్లు. ఆగిపో! యాపారం పేరుమీద నువ్వు ఈ కొండని పల్లానికి కొల్లగొట్టి తోలుకుపోయినన్నాళ్లూ తోలుకుపోనావు. మా భూముల్ని బాకీలకింద పడేసుకొని, మా భూఁవులమీద మమ్మల్నే కంబారుల్ని జేసి పంటలు పండించుకొన్నావు. మాకు గంజికయినా లేకండా పంటగింజల్ని తోలుకుపోనావు. అయిపోనాది. ఆ కాలం అయిపోనాది. ఇప్పుడలగ- తోలుకెలిపోడం కుదర్దు. మాఁవొప్పుకోం" అన్నాడు గట్టిగా, ధీమాగా.

షావుకారి కామేశు, గుబ్బగొడుగు చంకలోబెట్టి, మెత్తటోడిలాగా మొగంబెట్టి-

"అదిగాదూ... నీనేటి మీ పంటల్ని తోలుకుపోతన్నానా? నా పంట తోలుకుపోతన్ను. మీ యేరియా అని, బలం మీకుందని యీ దోతరిఫీ సెయ్యిడం మీకు తగదు'' అన్నాడు.

"యేటి తగదు? మా భూఁవుల్ల, మా కస్టంతోటి పండిన పంట కాదేటి యిది? మరది, మాకు తిండికేన లేకండా పట్టుకెలిపోడం, నీకు తగుతుందా, యేటి?"

"అయితే, పల్లం రేటుకి డబ్బిచ్చి కొనుక్కోండిరా. నాకేమి? ఇక్కడే అమ్మేస్తాను. ధాన్నెంని! నాకూ శ్రమ దప్పుతాదిగదా!'' అన్నాడు పెద్దమనిషి తరహాగా మాట్లాడేనన్న తీరులో షావుకారి.

"పల్లంరేటు కాదు. సంగం రేటు ప్రెకారం అమ్మాలి. ఆఁ! అలాగైతేనే కొంటాం"

"అది గామాటలే వొద్దు. పల్లంలయినా, కొండమీదయినా యెక్కడయినా గవరమెంటు రేటు వొకటే, అర్ధరూపాయి అటూ యిటూమీద! ఆ గవరమెంటు రేటే యిచ్చే యండి''

"ఇక్కడ సంగమే గవర్మెంటు. సంగం చెప్పిందే రేటు!"

"నేను... ఆ రేటుకివ్వను''

"ఇవ్వపోతే, నీ సత్తువేపాటో సూసెస్తాం. తోలుకెళ్లు బళ్లు! బండి కదిలిందా... జనం సేతుల్లోని కర్రలు కదుల్తాయి ఆఁ" అన్నాడు మీ నాయన. అంతే జనం గోలగా కర్రలెత్తారు.

అప్పుడు, కిరాయికొచ్చిన పల్లపు మనుషుల్లోని వొకడు,

"వొసేటర్రా మీ దౌర్జెన్నెం? పల్లకుంతన్నామనా? మీ ఊరిలోకి వొచ్చేమనా? ఇదిగిదే మాటయితే మరి మీరు మా పల్లంల అడుగు పెట్టరు. సంతలు, గింతలూ, పట్నం బజార్లూ మర్సిపోవాల మీరు. అక్కడక్కాని వొస్తే మేమూ యీ పనే సేస్తాం" అన్నాడు.

ఆ మాటకు ధైర్యం వొచ్చింది గావాలి, మరొకడేమో,

"యిదిగో బండి నాది. ఈ ధాన్నెం న్నావీ. సావుకారివి కావు. నా ధాన్నెం అడ్డడానికి మీరెవుళు?" అని బండి తోలబోయేడు.

అంతేని తల్లీ. బంతీ. ఆడు మరి బండి మొకరమీద లేడు గోర్జిలపడ్డాడు. సావుకారి గుబ్బగొడుగు మిరిగిపోయింది. దొరికినోళ్ళి దొరికినట్టగ కొట్టేసేరు జనాలు. పల్లపోలు... పాడవా (ఓటమి) అయిపోయేరు.

అప్పుడొచ్చేడు కామ్రేే.

జనాల్ని ఆపేసేడు. కొట్లాట ఆగింది. పల్లపు మనుసుల్ని పిలిసి, కామ్రేే ఆళ్లని ఓదార్చి-

"మీకూ, వొలసోళ్లకీ తగువు పెట్టడంకి ఎత్తుగడేసాడు షావుకారి. మీరు బాగా ఆలోచించండి. మీకూ అర్థమవుతాది.

షావుకారి అన్నట్లుగా, గిరిజన సంగం గవర్నమెంటు కాదు. పోనీ, అలాగే అనుకుందాం. సంగం సంగతి వొదిలేయండి. మరి, షావుకారి గవర్నమెంటు ధర ప్రకారం అమ్ముతన్నాడా? గవర్నమెంటుకి యివ్వాల్సిన లెవీ ధాన్యం గవర్నమెంటుకి యిస్తన్నాడా? ఈ షావుకారి ఇక్కడి వలసోల్ల భూముల్ని బాకీలకింద లాక్కున్నాడు. ఈ భూములుగాక, మీ పల్లంలా భూములున్నాయి యితడికి. పండిన ధాన్యాన్ని బ్లాకులో అమ్ముకుంటాడు. లెవీ ఇవ్వకుండా, ప్రొక్యూర్‌మెంట్ వాళ్లకి వందా, యాభయి లంచాలిచ్చి తప్పించుకుంటాడు. పెద్ద పెద్ద రైతులూ, షావుకార్లు ఇలా తప్పించుకోవడంవల్లనే- గవర్నమెంటుకి లెవీధాన్యం చాలక ప్రజలకి అవసరమయినన్ని ధాన్యం చవకధరలకి అమ్మలేకపోతోంది.

గవర్నమెంటు చేయలేని పనిని గిరిజన సంగం చేస్తోంది. ఇక్కడ పండిన పంట యీ ప్రజలకి చౌకరేటుల్లో అమ్మాలి. మిగిలిన పంటనే బయట అమ్ముకోవాలి. అలా ఖచ్చితంగా అమలు చేస్తున్నాం. ఈ విషయం యిక్కడి షావుకార్లకీ, బుగతలకీ అందరికీ తెలుసు.

ఈ కామేశమే... ఇలా మిమ్మల్ని ఉసిగొలిపి, తద్వారా పంట గింజల్ని పట్టుకుపోవాలని యెత్తువేసాడు. మీరూ అందుకు సహాయపడిపోయేరు.

కామ్రేడ్స్. వొద్దు. సావుకారికి సాయం జెయ్యొద్దు. మీ, మీ గ్రామాల్లో మీరూ రైతు సంగాలు పెట్టండి. లెవీధాన్యం వొసూలుజేయండి. తిండిగింజల్ని మీకు అందుబాటు ధరల్లోకి తెచ్చుకోండి, మా పార్టీ మీకు అండగా నిలుస్తుంది'' అని బోధ పరిచేడు.

అదిగలాగ, ఆకరువురోజుల్ల, గవర్నమెంటు యిప్పించలేని చవకధరలకి




బియ్యం గింజలు యిప్పించింది గిరిజన సంగం.

తిండికాడ, పంటకాడ సంతల యాపారాలకాడ యెక్కడ బడితే అక్కడ అడుగడుక్కీ మా యెనకాల వుండి, మమ్మల్ని అలాగ అంటిపెట్టుకొని కొండతోటి సాముజేసి పండించిన పంటని యింటికీ, కంచంలోని కూడు నోటికీ యెల్లేరోజులు తెచ్చింది సంగం!

వొడ్డీమీద వొడ్డీ గుంజుకునీ సావుకార్లు సంగం రేటుకి సరుకులమ్మటం కొనటం సేసేవోళ్లు. కర్రపుల్ల నరికితే కళ్లెర్రజేసి కేసుల్రాసే పారేస్టోలి బెదురుపోనాది. వలసల్లంట దీపాలు యెలిగేయి. మమ్మల్ని మనుసుల్ని జేసినారు. పిలకజుత్తులు మార్చినారు. ఆడోళ్లకి కోకా, జేకట్లు నేర్పినారు. నలుగురికీ నాలుగు అచ్చరాలు నేర్పినారు. అది అదొక మర్సిపోలేని కాలం! ఆ జాకరదేవత మాకు ఆ మంచి రోజుల్ని తెచ్చింది అనుకో' అంటూ కంతుడు దీర్ఘంగా చూస్తూ చెప్పటం ఆపేడు.

ఆమె ఆలోచిస్తోంది. ఎంత కొట్లాడినారో గదా. బతుకుల నిలబడ్డంకి, అనుకుంది తాతయ్యను చూస్తూ.

కంతుడు బంతివైపు చూస్తూ,

"...చెట్టుకే పండిపోయి, రాలిపోడంకి సిద్ధంగున్న పండుని తల్లీ నేను! నా కళ్లతోటి మూడుతరాల బతుకుల్ని సూసేను. కొండరాజుల్లాగ బతికిన తరం! కంబార్లు (పాలేర్లు) అయిపోయిన తరం!! కమీనుస్టులుమైన తరం!!!

ఇప్పుడు మీ తరం వొచ్చింది. మీరు, మీరేమవుతారనేనా ఆలోచనమ్మా'' అన్నాడు నిట్టూరుస్తూ.

అంటే? మా ఆలోచనలు ఎలా వున్నాయని అడుగుతున్నాడా తాతయ్య? మా మనసుల్లో ఏం వుంది- అని ప్రశ్నించుతున్నాడా? బంతి లోలోపల తాతయ్య ప్రశ్నల్ని తర్కించుకుంటోంది.

బంతి మనసులో యేమున్నదో బయటపడలేదు.

కానీ, ఆమె గర్భంలో ఏదో వుంది అన్నట్లుగా భళ్లున వాంతిజేసింది బంతి.

కంతుడు గాభరాగా లేచాడు. ఆదుర్దాగా నాయనమ్మ వచ్చింది. ముంతతో నీళ్లిచ్చి బంతి మొహం కడిగించింది. కొద్దిగా నీళ్లు తాగించింది. మళ్లీ కాసేపటికి ఒంట్లో తిప్పింది బంతికి. మరోవాంతి చేసింది.

నాయినమ్మ బంతిని పెరట్లోకి తీసుకెళ్లింది. పెరట్లో కూచోబెట్టింది. కొద్దిసేపయ్యాక పెరటి చింతచెట్టు కాయ రాలిపడి వుంటే దాన్ని తీసుకుతింటోన్న బంతిని అనుమానంగా చూసింది నాయినమ్మ.

మనుమరాలిని పట్టుకొని, మెల్లగా విషయాన్ని రాబట్టింది. బంతి నిజం చెప్పింది. రాజబాబును ప్రేమించానంది. ప్రేమకు అర్థం తెలీని, ప్రేమ అన్నది అనుభవంలోకి రాని నాయినమ్మ బంతిని వెర్రిగా చూసింది. జరుగబోయే పరిణామం తలచుకు వొణికిపోయింది.

కంతుడికి విషయం తెలిసాక- బంతివైపు అయిష్టంగా చూసి, కోపంగా బయటికి వెళ్లిపోయేడు. ఆ వెళ్లడం, వెళ్లడం తిండితిప్పల వేళకీ తిరిగిరాలేదు. పోడుమీదనే వుండిపోయేడు. తాతయ్యను పిలిచే సాహసం చేయలేకపోయింది బంతి. ఆరోజు పస్తుండిపోయింది బంతి, తాతయ్యతో పాటూ!

మరునాడు ఉదయం బంతి బయల్దేరి ఆఫీసుకి వెళ్లింది. ఆ రోజంతా కన్పించలేదు రాజుబాబు. బంతి ఎంతో ఉద్వేగంతో వుంది. రాజుతో యీ విషయం చెప్దామని. తొందరగా, తామిద్దరూ వొక్కటయ్యే శుభగడియల గూర్చి మాట్లాడాలనుకుంది.

రెండోరోజూ రాజుబాబు కన్పించలేదు. వరుసగా వారంరోజులు రాజుబాబు ఆఫీసుకే

రాలేదు, ఊరిలోనా కనిపించలేదు. బంతికి ఆందోళన పెరిగిపోయింది. ఆరాదీసింది రాజుకోసం. అప్పుడు తెలిసింది- రాజుబాబు సెలవు పెట్టాడనీ, ఇల్లు ఖాళీజేసాడనీ, అట్నించి అటే మరో దూరప్రాంతానికి బదిలీకోసం ప్రయత్నిస్తున్నాడనీ!

పందులు పడి కెలికిన పంటచేను అయ్యింది, బంతి మనసు! కాళ్లకింది భూమి కదిలినట్లన్పించింది. నిల్చున్న బంతి అలాగే నిల్చున్న పాటుగా పడిపోయింది.

తిరిగి స్పృహలోకి వచ్చేసరికి బంతి ప్రైవేట్ హాస్పిటల్‌లో వుంది. కళ్లు తెరిచి, పరిసరాలు చూస్తే ఎదురుగా భీముడు కన్పించాడు. బంతికి ఓక్షణం అతనెవరో, ఎక్కడ చూసిందో గుర్తురాలేదు. అయోమయంగా బంతి చూస్తుంటే-

"ఇంజనీరుగారికాడ పనిమీద వొచ్చాను. అతగానికోసం నిల్చుంటే నువ్వు కనిపించావు. నీ దిక్కు అలాగ సూస్తున్నాను. నువ్వేమో కళ్లు దిరిగేయి గావాలి... నిలబడినపాటుగ తూలిపడిపోనావు. ఎంటనే మోసుకొచ్చి యీ ఆస్పత్రిల యేసాను'' చెప్పాడు భీముడు.

ఆ తర్వాత "వుండు... యిప్పుడే వొస్తాను'' అని బయటికెళ్లాడు భీముడు. బంతికి అపుడు గుర్తొచ్చేడు భీముడు! తన రెక్క పట్టుకు లాక్కుపోయిన రోజు గుర్తొచ్చింది!

"మరేం బయ్యింలేదు. టీ తాగు. నీరసమెగిరిపోద్ది. మీ తాతకి కబురు యెట్నాను. ఏ సిటానికో రావొచ్చు'' అని ధైర్యంచెప్తూ, తీసుకొచ్చిన టీ అందించేడు బంతికి.

బంతికి తల బరువయిపోయింది.

ఇంతటి నిష్కల్మష, నిర్మల వ్యక్తితో మనువు వొప్పుకోక తప్పుచేసినందుకు క్షోభించింది మనసు. సిగ్గూ, దుఃఖమూ కలగలిసి బాధించగా బంతి తలదించుకు కూర్చుంది.

అప్పుడే బంతి తాతయ్య కంతుడూ, మరికొంతమంది వలస జనాలూ ఆందోళనగా వచ్చారు. బంతిని పరామర్శించేరు. భీముడు జరిగినదంతా వారికి చెప్తున్నాడు. కంతుడితో తనని తాను పరిచయం చేసుకున్నాడు.

డాక్టర్‌గారొచ్చేరు. కంతుడు ఆయనను కలిసి - "బావూ... పిల్ల నా మనవరాలు. ఏటయినాది? జబ్బేటి చేసిందేటి?" అనడిగేడు.

డాక్టరుగారు - "అదేంలేదు. జబ్బుయేంలేదు. గర్భిణీగదా... నీర్సంవల్ల కళ్లు తిరిగి పడిపోయింది. అంతే! అంతకుమించి యేమీలేదు. వీక్‌నెస్ పోవటానికి బలమయిన తిండి తినాలి. ఈ కేప్సుల్సూ, టానిక్ లూ వాడాలి'' అని చీటీ రాసిచ్చేడు.

డాక్టరుగారు చెప్పిన విషయం కంతుడితో పాటు వచ్చిన వలస జనాలూ విన్నారు. బంతి పెళ్లి కాకుండానే గర్భిణీ అయ్యిందని విని బంతివైపు ఛీత్కారంగా చూసేరు. మౌనంగా కంతుడు మనుమరాలిని ఆసుపత్రి నుంచి ఇంటికి బయల్దేరదీసేడు. భీముడు కూడా వారితోపాటే వలస వస్తానన్నాడు. వొద్దనల్లేదు కంతుడు. అంతా కలిసి వలస వెళ్లేసరికి పొద్దుపోయింది. ఆ రాత్రి భీముడు అక్కడే వుండిపోయాడు. బంతికి ధైర్యంచెప్పేవాడు. కంతుడితో తన కుటుంబ విషయాలవీ మాట్లాడేవాడు. ఒక్కరోజులోనే ఆ యింటివారికి ఎప్పటినుంచో పరిచయమున్న ఆప్తుడిలా కనిపించేడు భీముడు.

తెల్లవారి లేచిన తర్వాత బంతికి నీరసం తగ్గింది. ఒంట్లో సత్తువ కలిగింది. మనసులోమాత్రం ఆవహించిన శూన్యం చెదిరిపోలేదు.

ఈలోగా వలసంతా బంతి వార్త ప్రచారమైపోయింది. వలస పెద్దలు బోయా, దీసరి కంతుడ్ని పిలిచి పంచాయితీ పెట్టారు. బంతిని పంచాయితీకి రమ్మని పిలుపుచేశా

 

రు.

అప్పుడు కలిగింది బంతిలో భయం! జరగబోయే పంచాయితీలో పెద్దల తీర్పు ఆమెకు తెలిసిందే!

చిన్ననాటినుంచీ తల్లీదండ్రీ లేని తనను గారాబంగా పెంచుకువచ్చిన తాతయ్యా, నాయినమ్మలకు ఈ వృద్ధాప్యంలో తనమూలంగా జరుగబోయే విపత్తు తల్చుకొని వొణికిపోయింది బంతి! వలసనుంచి తమ కుటుంబాన్ని బహిష్కరిస్తారన్న విషయం గ్రహింపుకొచ్చి నిలువెల్లా వొణికిపోయింది. ఇంతటి తప్పును ఎలా చేశాను? ఎందుకివన్నీ ఆలోచించలేదు? ఏ మాయపొరలు తనను కమ్మేశాయి? ఇపుడేది దారి? బంతి మనసులో అంతర్మథనం సాగుతోంది.

కంతుడు పంచాయితీకి బయలుదేరాడు. బంతిని బయల్దేరమన్నాడు. భీముడు కూడా వారిని అనుసరించేడు.

పెళ్లికి ముందు శారీరక సంబంధాలు సవరలు అంగీకరించరు. అలా సంబంధాలు పెట్టుకుంటే వారు ఒకే కులంవారయితే పంచాయితీ పెద్దలు పంచాయితీ జరిపి, జరిమానా వేసి, పెళ్లిని నిర్ణయించి జరిపిస్తారు. ఒకే కులంవారు గాక వేర్వేరు కులాలవారు ఇలా శారీరక సంబంధాలు పెట్టుకుంటే పంచాయితీ పెద్దలు మగవాడికి జరిమానా విధిస్తారు. ఆ జరిమానా చెల్లిస్తే వాడిని క్షమిస్తారు. ఆ తర్వాత అతడు మరి ఆ యువతితో సంబంధం పెట్టుకోగూడదు. ఇక ఆ అబ్బాయీ అమ్మాయీ విడిపోవాలి. కళ్యాణం అన్న ఆలోచన మర్చిపోవాలి. అబ్బాయి ఏ కులంవాడో, ఎవరో తెలియకపోతే ఆ అమ్మాయి మోసగించబడినా సరే... ఆ కుటుంబాన్ని తమ జాతినుండి వెలివేస్తారు. ఇక కష్టసుఖాల్లో కలువనివ్వరు, మాటాడనివ్వరు.

పట్నపు నాగరీక వాసనలు ఎన్ని చేరినా, కొండగాలిలో ఈ విషయాల్లో మార్పు రాలేదు. అలా అని వీరివన్నీ పనికిమాలిన ఆచారాలు అనలేం! వీళ్లు స్త్రీలను వొట్టి పుణ్యానికే అనుమానించరు. పెళ్లికాని యువతీ యువకులు కలిసి తిరిగితే ఊరికే చెవులు కొరుక్కోరు. తప్పు జేస్తేమాత్రం పంచాయితీ పెడతారు. పురుషుడికే జరిమానా విధిస్తారు స్త్రీకి యే శిక్షా విధించరు.

స్త్రీని ఇంతగా గౌరవించినా స్త్రీ అంటే పురుషుడి ఆస్తికిందనే లెక్కవేస్తారు. భర్త చనిపోయిన స్త్రీని మరో వ్యక్తి పెళ్లి చేసుకోవాలంటే ఆ చనిపోయిన భర్తకు తప్పు చెల్లించాలి. అంటే 'చుక్కపండుగ' చేసి, జంతువుని బలి ఇచ్చి, గ్రామస్థులకు విందు భోజనం పెట్టి చనిపోయిన ఆమె భర్త ఆత్మకు ఆవిధంగా సుంకం చెల్లించాలి అంటారు.

ఇన్ని కట్టుదిట్టాలూ, సంప్రదాయాలూ... అక్రమ సంబంధాలను అరికట్టడానికి రూపొందినవే! అందుకే... వీరిలో అక్రమ సంబంధాలు దాగవు. తప్పులు చెల్లించీ, పెళ్ళిళ్ళు జరిపించీ ఆమోదముద్ర పొందుతాయి.

ఎటొచ్చీ బంతి పరిస్థితే భిన్నమయినది!

పంచాయితీకి అందరూ చేరారు. ఎటువంటి ఉపోద్ఘాతమూ లేకుండా నేరుగా బంతినే చూస్తూ-

"ఈ తప్పు ఎందుకు చేశావ్? ఎవ్వులు దీనికి కారకులు? పెళ్లిగాకుండానే గర్భిణీవి కావచ్చా?" ప్రశ్నించాడో పెద్ద.

పెద్దల ప్రశ్నలకు బంతి ఏ జవాబూ చెప్పలేకపోయింది. ఆలోచనల అగ్నిపర్వతంలా వుంది మెదడు.

కంతుడుమాత్రం అన్ని కష్టాలనూ దిగమింగుకు బతకటం అలవాటయినవాడిలా జరగబోయే పరిణామానికి మానసికంగా సిద్ధమవుతున్నాడు. మనుమరాలినుంచి జవాబు రాకపోయేసరికి కంతుడే ఏదో చెప్పటానికి గొంతు సవరించుకుంటుంటే-



"ఇదంతా నావల్లే జరిగింది. నేనే కారణం. తప్పు పని చేశాను. శిక్ష నాకెయ్యండి'' అని పెద్దల ముందుకు వొచ్చి చెప్పాడు భీముడు.

బంతి ఆశ్చర్యపోయింది. కంరుడికి అయోమయంగా వుంది. బంతి ఓక్షణం భీముడివైపు చూసింది. ఎందుకిలా చెప్పాడు? ఎందుకు చేయని నేరం చేసినట్లుగా అంగీకరిస్తున్నాడు? ప్రశ్నించుకుంటోన్న బంతి "లేదు, భీముడు చెప్పింది నిజంకాదు'' అని చెప్పాలనుకుంది. 'నిన్ను మోసం చేయలేను! ఈ తప్పు నీదికాదు' అని భీముడితో చెప్పాలనుకుంది. నాగరీక యువకుడు కల్పించిన ఎండమావులవెంట పరుగెత్తిన పాప ఫలితమిది అని పంచాయితీలో పెద్దలందరికీ వినిపించేంత గట్టిగా అరిచి చెప్పాలనుకుంది గానీ ఏదీ సాధ్యంకాలేదు.

భీముడు పంచాయితీ పెద్దలకు ఆవిధంగా చెప్పేసి బంతిని లాక్కుంటూ కంతుడి యింటికొచ్చేడు. ఇంట్లో మూల కదురున వున్న కుంకుమ భరిణ తీసి కుంకుమను కుడిచేయి బొటనవేలూ, చూపుడువేలుతో తీసి బంతి నుదుటన బొట్టుపెట్టాడు. ఆ తర్వాత తమకంగా బంతిని కౌగలించుకున్నాడు. బంతి నుదుటిమీద ముద్దుపెట్టి-

"యీ సెనంనుంచి యిప్పుడికాంచి నువ్వు నా పెళ్లానివి. అంతే... ఆс... మరేటి మాట్లాడకు. ఏనాటినుంచో నీమీద మనసుపడి అలాగ పెళ్లి చేసుకోకుండా వుండిపోనాను. ఇన్నాళ్లకి... నా ఆశ తీరింది'' అన్నాడు ఆనందంగా!

బంతికి మరీ ఆశ్చర్యంవేసింది.

ఇంకా తన గురించే ఆలోచిస్తున్నాడా? మర్చిపోయేడనుకున్నానే! అని మనసులో గతం తల్చుకుంటోంది బంతి.

రెండు పర్యాయాలు భీముడు ఊరిలోకొచ్చి బంతిని లాక్కెళ్ళాడు. కానీ రెండు పర్యాయాలు కూడా బంతి తిరిగొచ్చేసింది. తనకు యిష్టం లేదనేసింది. భీముని ప్రేమను తిరస్కరించింది. ఆ తర్వాత భీముడు మరి బంతి జోలికి వెళ్లలేదు. ఇక తనను మరిచిపోయే వుంటాడు అనుకుంది బంతి.

గానీ యింకా తనను మరిచిపోకుండా తనమీదనే మనసు లగ్నంచేసి, మరో అమ్మాయినెవరినీ పెళ్లి చేసుకోకుండా తన ప్రేమకోసమే భీముడు యెదురుచూస్తూ వుండిపోయాడంటే... బంతి మనసంతా కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. అసంకల్పితంగానే భీముడి కౌగిలిలో అల్లుకుపోయింది! భీముడిని మనసారా స్వీకరించింది. భీముడు తృప్తిగా ఊపిరి పీల్చాడు.

ఇక అక్కడనుంచి బంతిలో పొడసూపే సంశయాలను చిరునవ్వుతో తుడిచేసేవాడు భీముడు. ఆమెని ఏమీ చెప్పనిచ్చేవాడు కాదు. ఒక కృతనిశ్చయంతో, సత్కార్యమేదో చేయబోయే వ్యక్తి స్వల్ప సంశయాలను లెక్కచేయనట్లే భీముడు ప్రవర్తించేవాడు. భీముని అభిమానంతో దాదాపుగా బంతిలో అపరాధభావంతో కలిగిన న్యూనత చెదిరిపోయింది.

వసంతకాలంలో ఓ ముహూర్తాన పంచాయితీ పెద్దల తీర్పు ప్రకారం భీముడితో బంతి పెళ్లి జరిగింది. పెళ్లి భీముడి ఇంట జరిగింది. పెళ్లిరోజు భీముడి హృదయం సంతోష చంద్రశాల అయింది.

బంతి పుట్టి, పెరిగిన ఇంట వున్న మగ దిక్కు వృద్ధుడైన తాతయ్య కావటంవలనా, మరో మగదిక్కు లేనందునా సాంప్రదాయం ప్రకారం భీముడు అత్తవారింటికే యిల్లరికం వచ్చేశాడు. ఇంటి బాధ్యతలు తన భుజాన వేసుకున్నాడు. అంతదాకా కంతుడు మోస్తోన్న బరువును తను అందుకున్నాడు.

కొద్దిపాటి పోడుభూమి, గెడ్డపక్క చిన్న మడిసెక్క మిగిలిన ఆస్తి, వాటిమీద కష్టపడుతూ అడవిలో కాయా, పండూ యేరుకొనీ, కట్టెలు కొట్టి అమ్ముకునీ జీవించాలి. అంతకు మించిన ఆధారం లేదు భీముడికి, ఆ




కుటుంబాన్ని పోషించేందుకు.

బంతి మరి ఇంజనీరింగ్ ఆఫీసులో ఉద్యోగానికి వెళ్లలేదు. కానీ అప్పటికే పదవ తరగతి పరీక్షలకు ఫీజు కట్టేసివుంది గనుక ఇంటిలో కూర్చొని పరీక్షలకు ప్రిపేరయ్యేది.

రోజులు, వారాలు, నెలలూ భారంగానే గడుస్తున్నాయి. 'అసలే అల్పప్రాణి, ఆపైన గర్భిణీ' అన్నట్లు నీరసంగా వుండే బంతికి నెలలు నిండుతోన్న గర్భంవల్ల మరింత నిస్సత్తువగా వుండేది. ఒక్కోరోజు ఒళ్లంతా నొప్పుల్తో చంపేది. ఇటుపుల్ల అటు కదపలేక పోయేది బంతి. అల్లాడిపోయేది. ఇంటిపనిలో, వంటపనిలోనన్నా దృష్టి సరిగా లేని నాయనమ్మకు కనీస సాయం చేయలేకపోయేది. భీముడే అన్నీ చేసేవాడు. డాక్టర్ల దగ్గరకు మందులకోసం పరుగెత్తేవాడు. బంతి ఆరోగ్యంగా, బలంగా వుండటానికి అడవిలో దొరికే రకరకాల పళ్లూ, కాయలూ, తేనే తెచ్చేవాడు.

ఇంటిపోషణ భారాన్ని మోయటమేగాక తనను మరీ పదిలంగా చూసుకుంటూ వస్తోన్న భీముడు దేవుడయ్యాడు బంతికి! ఆ దేవుడికి అపచారం చేస్తున్నానేమో? ఈ మోస్తోన్న పాపఫలం గర్భంలోనే చిదిమేస్తేనో...? ఛిద్రం చేయించేయాలి... అని తలచేది. గానీ భీముడు అంగీకరించలేదు. అనేక విధాలుగా ప్రమాణాలు చేయించుకున్నాడు ఇలాంటి ఆలోచనలు మరోసారి రానీయనని బంతిచేత. బంతి భీముడి మాటను కొట్టేయలేకపోయింది. భీముడి ఆజ్ఞను పాటించే విధేయురాలిగా తనను తాను సిద్ధంచేసుకుంది. మనసులో మరి ఇతరత్రా ఆలోచనలు మానేసి పరీక్షలకోసం చదవసాగింది. పరీక్షలు బాగానే రాసింది.

బంతికి నెలలు నిండినాయి. పదవ తరగతి పరీక్షల రిజల్ట్ వచ్చినరోజునే బంతి ప్రసవించింది. ఆడబిడ్డ పుట్టింది. కానీ జన్మించిన గంటకే బిడ్డ కన్నుమూసింది. తనకు తానే సిగ్గుపడిపోయినదేమో ఆ బిడ్డ ముడుచుకుంటూ అంటుగట్టిన హైబ్రిడ్ మొక్కలా పుట్టింది. కనీసం జన్మకేక అయినా వెయ్యకుండా చనిపోయింది, యెండీ రాలిపోయిన అంటుమొక్కలా.

అప్పుడప్పుడుమాత్రం పేగు తెంపుకు పుట్టిన ఆ బిడ్డను తలుచుకుంటే యేడుపొచ్చేది బంతికి.

ఇంత రక్తాన్నీ, మాంసాన్నీ ఇచ్చి, తొమ్మిది మాసాలూ గర్భంలో మోసినందుకయినా ఆ బిడ్డ ఒక్కసారి ఒకే వొక్క కృతజ్ఞతాపూర్వక కేక... పిలుపు పిలిస్తే... ఆ మాతృహృదయం పొంగిపోయేదిగదా!

పొర్లుకొచ్చిన చనుబాలు జాకెట్టును తడిపేయి. కన్నీటి ధారల్తో బంతి కుమిలికుమిలి యేడ్చింది.



కొండలమధ్య ఎర్ర దివిటీలా వుంది ఉదయిస్తోన్న సూర్యబింబం. ఆకులమీది మంచు బిందువులు సూర్య కిరణాలు తాకటంతో మిలమిలా మెరుస్తున్నాయి. తూరీగలు రెక్కలు విప్పుకుని జోరుగా ఎగురుతున్నాయి. ఆవుదూడలు మేతకు వెళ్లిపోయిన తల్లికోసం అంబా అని అరుస్తున్నాయి. ఆశ్రమ పాఠశాల బెల్ మోగింది. పిల్లలంతా నిద్రలోంచి మేల్కొన్నారు. హాస్టల్ కమాటీ అయిదవ తరగతి చదువుకునే ఆడపిల్లల్ని

నగులుర్ని పిలిచి నాలుగు చీపురుకట్టలు అందించేడు. పాఠశాల ఆవరణంతా తుడవ మన్నాడు. చింపిరి జుత్తయినా దువ్వుకో కుండా నిద్రమొహమయినా కడుక్కోకుండా పాఠశాల దుమ్మూ, ధూళినీ ఊడుస్తున్నాయి ఆ చిన్నారి చేతులు.. చీపురులై!

ఇంతలో వార్డెన్ తన గదిలోంచి బయటికి కేకవేశాడు... టీ తీసుకురమ్మని. బయట దంతధావనం చేసుకుంటోన్న అబ్బాయిలకు ఈ కేక విన్పించింది. వెంటనే ఒక అబ్బాయి, గ్లాసు పట్టుకుని పాఠశాలకు కొద్ది దూరంలో వున్న టీకొట్టుకు వెళ్లాడు.

కమాటీ మరికొంతమంది అబ్బాయిల్ని పిల్చి పాత్రలు తోమమని అప్పజెప్పాడు, మరికొంతమందికి వంటకి కట్టెలు తీసుకుర మ్మని పంపేడు. తనేమో... వంటపొయ్యి వెలిగించాడు.

టీ తాగిన వార్డెన్‌గారికి సిగరెట్ పెట్టె అందించేడు మరో విద్యార్థి! అన్ని పనులూ అలా ఆ పిల్లలు చేస్తూ కాలకృత్యాలు ము గించుకుని పుస్తకాలు తీసుకొని తరగతి గదు ల్లోకి వచ్చేసరికి ఉదయం తొమ్మిది గంటల వేళ అయింది.

అన్ని తరగతులవారినీ ఒకే గదిలో కూర్చోమని కేకేశారు వార్డెన్‌గారు! ఆయన ఒక్కరే ఆరోజు హాజర్ అయిన టీచర్‌గనుక.

నిజానికి ఆ పాఠశాలకు గదులు వేర్వేరు గా లేవు! ఉన్నవే రెండు నిలువుగా వేసిన పూరిపాకలు! ఒక పాక విద్యార్థుల హాస్టల్. మరో పూరిపాక పాఠశాల! అందులోనే అయి దు తరగతుల పిల్లలూ మూడు వరుసల్లో కూర్చుంటారు.

ఆశ్రమ పాఠశాల ప్రారంభించిన రెండే ళ్లకు స్కూల్ బిల్డింగ్ శాంక్షన్ అయింది. ఆ తర్వాత నిధులు చూసుకొని హాస్టల్‌కోసం కూడా బిల్డింగ్‌ను కట్టిస్తాం అన్నారు ప్రభు త్వంవారు! ముందు శాంక్షన్ అయిన స్కూల్ బిల్డింగ్ కాంట్రాక్టు వర్క్ జగ్గారావుకి వచ్చింది. జగ్గారావు కాంట్రాక్ట్ ఎమౌంట్‌ను చాలావరకు బిల్డింగ్ బయట ఖర్చుపెట్టేడు. కాంట్రాక్టు యిప్పించిన ఎమ్మెల్యేగారికి కొంత ఖర్చుపెట్టాడు. బిల్స్ రాసిన సూపర్ వైజర్‌కీ, సంతకాలు పెట్టిన ఇంజనీర్‌కీ, తనిఖీ అధికార్లకూ పర్సంటేజీవారీగా ఖర్చు పెట్టాడు. తన స్వంత ఖర్చులూ కొన్ని పెట్టుకోవల్సి వచ్చి ఖర్చుపెట్టేశాడు. స్కూల్ బిల్డింగ్ వర్క్‌కి ఖర్చుపెట్టడానికి చాలా తక్కువే మిగిలింది! దానితో పాళ్లు తక్కువజేసి సిమెంటూ, కొద్దోగొప్పో ఇనుము వాసనా చూపించి బిల్డింగ్ అయిందన్పించే డు. పాఠశాల బోర్డూ, గేటూ బలంగా పెట్టా డు. అవే నిలబడ్డాయి. తలుపులూ, ద్వారా లూ ఊడిపోయాయి. గోడలు బీటలు దేరాయి. స్లేబులో ఇనుప ఊచలు ఊడి వొచ్చేశాయి. అందులో కూర్చుని పాఠాలు చెప్పే ధైర్యం లేక ఉపాధ్యాయులు ఆ స్కూల్ బిల్డింగ్‌ని మూడేళ్లకిందటే వొదిలేసి ఈ పాకనే పాఠశాలను చేశారు.

ఆ పాఠశాలకు ఒకటే కుర్చీ ఉంటుంది! ముగ్గురు ఉపాధ్యాయులు హాజర్ రిజిస్టర్‌లో వుంటారు, కానీ ఒక్కరే స్కూలుకి హాజరౌతా రు. మిగిలినవారు స్వగ్రామాల్లో స్వంత కార్యాలు చూసుకుంటుంటారు. తనిఖీల భయంలేదు. జీతం రాదేమో? అన్న అను మానం లేదు!

"ఏం జేస్తామండీ? ఎవడిక్కావాలండీ... నీతీ, నిజాయితీ? వీళ్లనేదో ఉద్ధరించేస్తున్నాం అని చెప్పుకోడానికి యివన్నీ పెడ్తోంది గవ ర్నమెంట్. అంతే తప్పా గవర్నమెంట్‌కిమా త్రం ఈ కొండోళ్లందర్నీ అక్షరాస్యుల్ని చేసి, ఉద్ధరించేయాలన్న సిన్సియారిటీ వుందేటి? చెప్పండీ? లేదు. మరి గవర్నమెంట్‌కే లేన పుడు మనకెందుకూ సిన్సియారిటీ?

అదీగాక ఈ పిల్లలకి చదువక్కర్లేదండీ బాబూ! ఇదిగో ఈ హాస్టల్ మెతుకులకోసం వస్తారు. అంతే! మెతుకులు కడుపునిండితే అదే ఆళ్లకి బ్రహ్మాండం. మరిక చదువు ఊసు




ఎత్తరు.

పోనీ వాళ్లకు చదువు చెప్పేందుకు ఆ ఊర్లో ఉందామంటే ఇల్లు దొరకాలా? దొరక వండీ... ఆ కొండోల్లోతోపాటు ఆ పాకల్లోనే వుండాలి. పోనీ వుందాము. మరీ నీళ్లూ, పాలూ... దొరుకుతాయా? దొరకవు. గెడ్డనీళ్లు తాగాలి! యేంటంటారు? తాగాలంటారా?

ఔను, అలాగే అంటారు! మీకేంబో యిందీ. సిటీలో సిల్కు(డెస్సు నలక్కుండా నౌకరీ చేస్తన్నారుగదా తమరు! ఎందుక న్రూ... అంటారు. పోనీ ఆ నీళ్లూ, ఆ పాలే... ఛస్తామా? అలాగే తాగుతాం. మరి యే రోగమో వొస్తే మందూ, మాకూ దొరకొద్దా? దొరకదండీ బాబూ! హాస్పిటల్సా...? ఆఁఆఁ... వున్నాయి. శిథిల భవంతులూ, ఖాళీ సీసాల బీరువాలూ, డాక్టర్లూ, కాంపౌండర్లూ లేని ఆసుపత్రులూ!

బతికుంటే బలిజేపేట పశువుల సంతల బ్యాంకువారుకొనే గేదెల మెడలో కట్టడంకి బోర్డులు రాసుకొని బతకొచ్చుగానీ యింత బతుకూ బతికి యింటెనకాల కాదు కొండ మీద చావమంటారా?

మీలాంటివాళ్లే ఓసారి టీకొట్లో కూర్చున్న మా మేస్టారొకతనితో - యిదేంటి మేస్టారూ మీరిక్కడ టీకొట్లో హస్కేస్తన్నారు. అటు మీ స్కూలు యిన్స్పెక్షన్‌కి ఈవోగారు వెళ్లారన్నా డట! దాంతో ఆ మేస్టారు తాగుతోన్న టీ గొంతులోంచి పొలబారి, గాభరాగా లేచి ఈవోగారికంటే ముందే స్కూలుకి వెళ్లిపోవా లని లేచాడట! తీరా అప్పుడు ఆ టీకొట్టు యజమాని అదేంటి మేస్టారూ! ఆయన హాస్యానికంటే అంత గాభరాపడిపోతన్నా రూ? ఈవేళ ఆదివారంగదండీ! అన్నాడుట. దాంతో ఆ మేస్టారు నవ్వుతూ ఔనౌను! ఆఖరికి వారాలే మర్చిపోతున్నామయ్యా! అని బాధపడ్డాడు ఆ మేస్టారు... మీలాంటి వారి హాస్యానికి!

మంచివాళ్లే. చాల్లెండి చాల్లెండి. వెళ్లండె ళ్లండి గవర్నమెంటుకి యేం కావాలండీ! రికార్డులు కావాలి! రికార్డులు పెర్‌ఫెక్ట్‌గా వుండాలి! అంతే! అలాగే వుంటాయి. చూ స్కోండైతే రికార్డులు'' అని ఛాలెంజ్ చేయగ లరు ఏజన్సీ స్కూళ్లల్లో కొందరు టీచర్లు.

ఆ ఉదయం పదీ పదిన్నరవేళ! ఆ ఆశ్రమ పాఠశాలలో, ఆ ఉన్న ఒక్క కుర్చీలో కూర్చొని రికార్డులు తనిఖీ చేస్తున్నారు గిరి జన సంక్షేమాధికారిగారు! వార్డెన్ నిలబడ లేక నిల్చొని ఆశ్చర్యపోతున్నాడు!

"ఇతగాడు ఆఫీసరా, అల్లాటప్పయ్యా? కొండలమీది స్కూలుకీ వొచ్చేడిమేటి?" అని విచిత్రపోతున్నాడు.

సంక్షేమాధికారి చూడటానికి పూరిడుపిట్ట లాగా చిన్న మనిషే కానీ అతని అంతర శరీరం బయటి రూపానికి యెన్నోరెట్లు అధికం. అతనికి ఆఫీసే దేవాలయం! ఉద్యో గమే జీవితం! అతను అధికారి బాధ్యతలు స్వీకరించగానే సంక్షేమ పథకాలన్నిటి మీదా దృష్టి సారించేడు. అనేక పథకాలు దళారుల, ఉద్యోగుల, రాజకీయ పెత్తందార్ల జేబుల్నే నింపుతున్నాయి తప్ప గిరిజన్ల చేతికి అందటం లేదన్నది గ్రహించేడు. ఈ అక్రమాన్ని అరికట్టాలనుకున్నాడు. సంక్షేమ పథకాలు నేరుగా గిరిజనులకే చేరేట్లు చర్య లు తీసుకోవాలనుకున్నాడు. అంతేగాక, తన అధికార పరిధిలో ఈ అక్రమం ఆగిపోదని భావించి, గిరిజన్లలో చైతన్యం కలిగించాలని తలచేడు. గిరిజన విద్యకు ప్రాధాన్యతనిచ్చే డు. ఆశ్రమ పాఠశాలల్లో సౌకర్యాలను పెంచి కొత్తకొత్త మార్పులు చేసేడు. గిరిజన యువ కుల్లో విద్యపట్ల ఆసక్తి పెంచాలని సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేసే డు. గిరిజనులు చదువుకుంటే కలిగే ప్రయో జనాలను కళ్లకు గట్టేట్లుగా ఒక వీడియో ఫిల్మ్ తీయించి గిరిజన ప్రాంతాల్లో ప్రద ర్శింపచేశాడు. ఆశ్రమ పాఠశాలలను ఆటా పాటల్తో, అన్ని సౌకర్యాల్తో సంతోష చంద్ర శాలలుగా రూపుదిద్దేందుకు పూనుకున్నాడు.

ఆ పాకలో గొర్రెలమంద ఆగినట్లు పిల్లల్ని కూర్చోబెట్టి సిగరెట్ కాలుస్తూ, కబుర్లు చెప్తూ కూర్చున్న వార్డెన్‌ని చూసేసరికి ఆ సంక్షేమాధికారికి అరికాలి మంట నెత్తికెక్కింది. ఆ తర్వాత రికార్డులు చూసేసరికి మరింతగా ఒళ్లుమండిపోయింది.

రికార్డుల్లో ఆ రోజుకి గూడా ముగ్గురి టీచర్ల సంతకాలు వున్నాయి. పిల్లల ఎటెండెన్స్ రిజిస్టర్‌కీ పిల్లల హాజరుకీ లంకె కుదరటంలేదు. హాస్టల్ ఫీడ్ స్టాక్ చూస్తే ఏమీలేదు!

రికార్డులమీద అడ్డంగా ఆకుపచ్చ సిరా కలంతో రిమార్క్ రాసేరు. కోపంతో కేకలేసేరు. ఇదే ఫస్ట్ అండ్ లాస్ట్ వార్నింగ్ అన్నారు. "మరోసారి యిలా వుంటే ఐ విల్ టెర్మినేట్ ఆల్‌ఆఫ్‌యూ ఫ్రం సర్వీసెస్" అన్నాడు. ఆ వార్డెన్‌కి ఒళ్లంతా చెమటలు పట్టేసాయి. సంక్షేమాధికారి పిల్లల్ని పిల్చి కొన్ని ప్రశ్నలు వేశారు. కొన్ని పదాలు సవర భాషలో చెప్పారు. చిన్న సవర పాట యేదో పాడి విన్పించేరు. అలా కొంతసేపటికి ఆయనలో కోపం తగ్గింది. తిరిగి మరో స్కూలు తనిఖీకి బయల్దేరుతూ వార్డెన్‌తో,

"ఉపాధ్యాయ వృత్తి పవిత్రమైన వృత్తి. జనానికి జ్ఞానభిక్షను పెట్టే గొప్పవాళ్లు మీరు. భవిష్యత్ తరాల తలరాతలు రాసే గురుదేవులు... బ్రహ్మలు మీరు! మీ వృత్తికి అపచారం చేయకండి. ఆ పాపం మీకు ఎన్ని జన్మలెత్తినా పోదు'' అని హితబోధజేసి వెళ్లారు.

అంత యెండలో, ఎక్కిన కొండలను దిగబోతోన్న ఆ అధికార్ని చూసి వార్డెన్ గుండెల్లో వొణుకు పుట్టింది! వొణుకు తగ్గేందుకు ఆయన జీలుగు కల్లు కోసం నడిచేడు. మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటేయి.

మధ్యాహ్న భోజనాలకు గంట మ్రోగింది. పిల్లలంతా పళ్లాల కోసం పరుగెత్తారు. ఆశ్రమ పాఠశాల ముందర భారద్దేశ పటం ఆకారంలో విశాలంగా క్రోటన్ మొక్కలు పెంచారు. వాటిమధ్య అన్నం డేగిషా, కంది పప్పు చారు తపేలా మోయించుకొచ్చి వుంచేడు కమాటీ! పళ్లాలు పట్టుకుని పిల్లలందరూ క్రోటన్స్ మొక్కల వరుసలో నిల్చున్నారు. పళ్లాలు పట్టుకు నిల్చున్న పిల్లల్తో ఆ దృశ్యం యాచిస్తోన్న భారతదేశ పటంలా కన్పిస్తుంది.

ఓ విద్యార్థి అన్నం గరిటెనూ, మరో విద్యార్థి పప్పుచారు గరిటెనూ పట్టుకుని వరుసలో కదుల్తూ వస్తోన్న భారద్దేశపటం ఆకారంలో నిల్చున్న పిల్లలొక్కొక్కరికీ వడ్డన చేస్తున్నారు.

ఇంతలో ఓ వ్యక్తి వచ్చి అన్నం గరిటెను అందుకున్నాడు. మరొకవ్యక్తి పప్పుచారు గరిటెను తీసుకున్నాడు. ఆ యిద్దరు విద్యార్థుల్ని గూడా పళ్లాలు పట్టుకు రమ్మన్నారు.

మరో యిద్దరు వ్యక్తులు పిల్లలకు మంచి నీళ్లు అందించసాగేరు! ఆ నలుగురు వ్యక్తులూ ఎవరు? ఎందుకు వచ్చేరు? ఎందుకీ పన్లు చేస్తున్నారు! వడ్డన, భోజనం, పాత్రలు తోమటం అన్నీ తామే చేసుకునే ఆ పిల్లలకు ఆ నలుగురు వ్యక్తులూ వడ్డన చేస్తోంటే ఆశ్చర్యమేసింది. అలా చూస్తూ వుండిపోయేరు. ఎవరూ అన్నం, చారూ కలుపనైనా కలపలేదు బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు. వారి అవస్థను చూసి, ఆ నలుగురిలో ఒక వ్యక్తి

"తినండి తమ్ముల్లూ! భయపడకండి. మేము మీ అన్నలం. తినండి, ఫరవాలేదు'' అని చెప్పారు.

పిల్లలు, ఒకరొకరుగా అన్నం చారూ కలిపేరు. తినటం ఆరంభించేరు. అపుడు అడిగేరు అన్నలు,

"మీ వార్డెనేడీ? కమాటీయేడీ?" అని.

పిల్లలు బదులివ్వలేదు. ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ, భోజనాలు చేయసాగేరు. అన్నలకు అనుమానం వేసింది. పిల్లలు విషయాన్ని దాస్తున్నారన్పించింది. ఇందాక,

అన్నం వడ్డించిన విద్యార్థిని పట్టుకొని,

"తమ్ముడూ! నువ్వు చెప్పు... విద్యార్థులు నిజాలు చెప్పటం నేర్చుకోవాలి. మంచి బాలుడు మర్మంగా వుండడు'' అని అన్నలు ఆ అబ్బాయిని మంచి చేసుకుని తెలుసుకున్నారు వార్డెన్ ఎక్కడికి వెళ్లాడో!

అన్నలు ఆ జవాబుకు ఆశ్చర్యపోయేరు. స్కూలు వేళలో గూడా జీలుగు కల్లుకి వెళ్తాడా? ఇలాంటి వ్యక్తులా గురువులు అని విస్తుపోయేరు! గురువు అంటే వాళ్లకు గుర్తొచ్చేది వెంపటాపు సత్యం మాస్టారు, ఆదిభట్ల కైలాసం, రెడ్డి చిన్నంనాయుడు మేస్టార్లు.

పిల్లల భోజనాలు ముగిసేయి. అన్నలు గూడా చెరో పళ్లెంలో అన్నమూ, పప్పుచారూ వేసుకొని తిన్నారు. అందరి భోజనాలూ అయ్యాక పాఠశాలలో కూర్చున్నారు. సరదాగా కథలు చెప్పుకుందాం అన్నాడో అన్న. పిల్లలకు భయం పోయింది. అన్నలంటే అభిమానం కలిగింది. ఓ అన్న కథలు చెప్పటం ప్రారంభించేడు. పిల్లలు శ్రద్ధగా వింటూ, ఊ కొట్టేరు. పరోపకార కథలు, ఏడుగురు రాకుమారులూ ఏడు చేపలకథ, బంగారు బాతుకథ.. అలా చెప్పుకొచ్చేడు. ఆ తర్వాత పిల్లల నుండి హాస్టల్ భోజన సదుపాయాల గురించీ, టీచర్ల గురించీ తెలుసుకున్నారు.

ఈలోగా వార్డెన్ వచ్చేడు. అక్కడి దృశ్యాల్ని అయోమయంగా చూడసాగేడు. భోజనాలయ్యేక, గొర్రెల్లా అటూ యిటూ గెంతులువేస్తూ తిరిగే పిల్లలు బుద్ధిగా కూర్చోవడమేమిటి? వార్ని అంతగా ఆకట్టుకున్న ఆ నలుగురు యువకులూ ఎవరు? ఎందుకొచ్చేరు? ప్రశ్నలు దొలుస్తున్నాయి.

అన్నలు అతన్ని పిల్చి,

"నువ్వు గురువుని అని చెప్పుకోటానికి సిగ్గెయ్యటంలేదా? స్కూల్ టైములో తాగి తందనాలాడతావా? మిగతా టీచర్లేరీ? ఎక్కడికెళ్లారు? మీరు పిల్లలకి పెట్టే తిండిని కూడ కాజేస్తున్నారా? ఆ ముక్క కంపు బియ్యం, ఆ నీళ్లచారు, పప్పూ యివే వారికి పెడతావా? కబడ్దార్! మేము అన్నలం! ఇకనించీ, ఈ స్కూలు సక్రమంగా నడవాల! టీచర్లందరూ స్కూల్లో వుండాల! భోజనాలు పిల్లలకి సరిగ్గా పెట్టాల. మేం మళ్లీ వచ్చేసరికి యిందులో ఏం తేడా వచ్చినా మిమ్మల్ని జీలుగుచెట్టుకి కోదండం వేయిస్తాం జాగ్రత్త!" అని వార్నింగిచ్చి వెళ్లిపోయేరు.

తాగిన జీలుక్కల్లు మత్తు పూర్తిగా దిగిపోయింది వార్డెన్‌కి. కానీ ఆ అన్నలకుగానీ గిరిజన సంక్షేమాధికారికిగానీ తెలియని విషయం ఒకటివుంది. అదేమంటే అతడు అసలు వార్డెనే కాదు! ఆ పాఠశాల టీచర్లు వంద రూపాయల జీతానికి నియమించుకున్న నకిలీ వార్డెన్ అతను. ఏజన్సీలో కొన్ని స్కూళ్లు వీళ్లతోనే నడుస్తాయి. అసలు టీచర్లు వారి వారి గ్రామాల్లో రాజకీయాలూ, వ్యాపారాలూ వ్యవసాయాలూ చూసుకుంటారు.

నకిలీ వార్డెన్ భయం నిండిన గుండెల్తో అసలైన టీచర్లకోసం పరుగెత్తాడు.

★ ★ ★

ఆ స్కూల్ ఇన్స్‌పెక్షన్ జరిగిన నెల రోజుల తర్వాత ఇదే స్కూల్‌కు బంతిని సంగీతం టీచరుగా నియమించేరు ఐ.టి.డి.ఏ వారు. ఈ ఉద్యోగం యింత త్వరలో, యింత సులువుగా తనకు వస్తుందని బంతి అనుకోలేదు. కలలో కూడా వూహించలేదు. బంతికిదంతా నిజమా అన్న సంశయం కలిగింది చేతికి అప్పాయింట్‌మెంట్ ఆర్డరొచ్చిన క్షణాన.

బిడ్డ పుట్టిన రోజే మరణించటంతో బంతి దిగాలుగా వుండేది. ఇంట్లో అన్యమనస్కంగా తిరిగేది. తన తప్పుకు బిడ్డ శిక్ష అనుభవించిందా అని వేదన పడేది. భీముడు యిదంతా గమనించి, బంతిని మళ్లీ చదవమని పోరేవాడు. తాతయ్యతో చెప్పించేవాడు. ప్రతిసారీ ఇదే మాట చెప్పేవాడు.

"అయ్యిందేదో అయ్యింది. పుట్టిందానికి భూమ్మీద నూకలు చెల్లిపోయి ఎలిపోయింది. దాన్ని మర్సిపో.. ఉన్నోళ్ల గురించి ఆలోసించు. నువ్వు తెలివయిన దానివి సదుకుంటే మాకందరికీ మంచి సెయ్యిగలవు. నాకు తెల్సిన మేస్త్రుగోరున్నారు. గౌర్నా

విషయాలేగాక సంగీతం గురించీ, సవరల పాటల గురించీ చర్చించేవారు. బంతికి పాటలంటే ప్రాణం! ఎన్నో పాటలు పాడగలదు.

ఓరోజు మాస్టారు బంతిని గిరిజన సంక్షేమాధికారి దగ్గరకు తీసుకువెళ్లారు. సంక్షేమాధికారి వద్ద ఆ రోజు ఎవరెవరో అధికార్లున్నా



యుడు మేస్త్రు... అతగాని కాడకెళ్లు. చదువు. చదువుల బడితే నీకీ యిసారమూ పోతాది'' అని బంతికి నచ్చచెప్పాడు.

అదిగో, ఈ ప్రకారం బంతి గౌరునాయుడు మాస్టారిని కలిసింది. ఇంటర్మీడియట్ పరీక్షలకు ప్రైవేట్ అభ్యర్థిగా వెళ్లింది. గౌరునాయుడు మాస్టారు మంచి కవీ, గాయకుడూ కావడంతో బంతితో యింటర్మీడియట్ సబ్జెక్ట్

రు. ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రవారు గూడా వున్నారు.

గిరిజన సంక్షేమాధికారి ఆదరంగా బంతి వైపుచూసేరు. మేస్టార్ని కూర్చోమన్నాడు. బంతితో,

"మాకు సంగీతం టీచర్ కావాలి. మేస్టారు నీ గురించి చెప్పారు. ఓ పాట పాడి విన్పించు. ఇదే యింటర్వ్యూ నీకు'' అన్నారు.

బంతి బిడియపడిపోయింది. గొంతు పెగలక కూర్చుంది. ఈలోగా ఆకాశవాణి కేంద్రంవారు గిరిజన జీవితం గురించి కొన్ని ప్రశ్నలు వేసి బంతిని మాటల్లోకి దింపి సమాధానాలు రాబట్టారు.

"మీ గిరిజనులలో చాలా రకాల వాయిద్యాలు వుంటాయటగదా? వాటి గురించి చెప్పగలవామ్మా?" అని ఒకాయన ప్రశ్నించేరు.

బంతి తను యెరిగిన ఒక్కో వాయిద్యమూ గుర్తు తెచ్చుకుని "మాకు దాదాపుగా యిరవై రకాల సంగీత పరికరాలు వున్నాయి. వాట్ని మా వాళ్లే తయారు జేస్తారు. సాధారణంగా సంగీత వాయిద్యాలు మాలో మగవాళ్లే వాయిస్తారు. స్త్రీలు పాడగలరే తప్ప, వాయిద్యాలను వాయించలేరు. గానీ నాకు మాత్రం వాయిద్యాలను ఉపయోగించడమూ తెలుసు'' చెప్పింది బంతి!

"ఒక్కో వాయిద్య పరికరం.. ఒక్కో సందర్భాల్లో వాయిస్తారటగదా మీరు? ఏవి, యెప్పుడు ఉపయోగిస్తారో చెప్తావా?" అడిగేరు సంక్షేమ అధికారిగారు.

"మేము యీ వాయిద్యాలను పెళ్ళిళ్లలోనూ, పండుగలూ, జాతరలులోనూ యజ్జోడు పూనకం పూనిన సందర్భాలలోనూ, కొన్ని వేళల్లో కొందరు వ్యక్తుల భావోద్వేగాలబట్టి పాటయెత్తుకునేటపుడూ వీటిని వాయిస్తాము.

తెతుడు (తూతుకొమ్ము), తరయతె(సొన్నాయ్) లాంటివి డప్పుల్తో పాటుగా ఆగం పండుగకీ, చుక్క పండుగకీ, పులి పండుగకీ మేము నృత్యాలు జేసే సందర్భంగా వాయిస్తాం.

వ్యక్తులు పాడుకునేటపుడు దొద్దొంగ్‌సిర్రైనీ, గొగొజ్జెడెంగ్‌నీ వాడతారు.

శవాలను శ్మశానానికి తీసుకెళ్లే సందర్భంలో కడింగ్ (డప్పు), తుడుము, గంగలం (తాళాలు) లాంటి వాయిద్యాలు వాడతాము'' అని వివరించింది బంతి.

రేడియో వారి ప్రశ్నలయ్యేక బంతిలో బిడియం తగ్గింది. ఆ అధికారులు చూపే ఆదరంతో ఆమెలో ధైర్యం కలిగింది. ఉత్సాహంగా యింటర్వ్యూని విజయవంతంగా ఫేస్ చేసింది.

సంక్షేమాధికారి బంతిని ఒక సవరపాట పాడమని అడిగేడు. బంతి గొంతు సవరించుకుంది. స్వరాన్ని గొంతులో యిముడ్చుకుని,

"మనంగాన్ దేలేతేన్ పారొయ్
నమాత్తీన్ దేలేలేన్ పారొయ్
రగాడిన్ తంగ్‌తూలన్ పారొయ్
ఉంజ్జాలే ఆయురోయ్ పారొయ్''
"అలసిపోయినాం చుట్టం
చెమటబట్టినాం చుట్టం
కొండలు యెక్కేం చుట్టం
అడుగులు వేసాం చుట్టం" పాటను పాడి

విన్పించింది. పెళ్లిరోజు పెళ్లికొడుకు యింటికి అలసిపోయి చేరే పెళ్లికుమార్తె బంధు బృందం పాడేపాట అది! అందరూ తలలు ఊపి విన్నారు.

అదిగో, అలా ఆరోజు పాటల్లోనే బంతిని యింటర్వ్యూ చేసి,

"మీ భాష వినడానికి ఇంపుగా వుంటుంది. పక్షుల కిలకిలా రావాల్లాగా, వీణ మ్రోగేట్లుగా విన్పిస్తుంది!" అని మెచ్చుకొన్నారు అధికార్లు. ఆరోజే సంక్షేమాధికారిగారు బంతికి ఉద్యోగమిచ్చేరు. సంగీతం టీచర్‌గా యీ స్కూలుకి వేశారు.

ఇప్పుడు బంతికెంతో ఆనందంగా వుంది. జీవితం యెంతో తృప్తినిచ్చేది. పాఠశాల పిల్లలకు పాటలు నేర్పుతుంటే చనిపోయిన తన బిడ్డ యెదిగొచ్చి, కూర్చొని వింటోందన్పించేది. పరవశించిపాడేది. పిల్లలు నాగస్వరం ముందరి నాగులయ్యేవారు. పాటలతోనే వాళ్లు చదువువైపు మళ్లేరు. సంగీతం ద్వారానే వాళ్లకు అక్షరాలు నేర్పింది. ఎంతో తృప్తి కలిగింది. ఇంట్లో కూడా ఆర్థిక




యిబ్బందులు తొలగేయి. నాయినమ్మకు వైద్యం చేయించింది. ఆమె కంటికి అద్దాలు కొనిపించింది. అద్దాలు తగిలించుకోడానికి నాయినమ్మ సిగ్గుపడేది. గానీ అవస్థలు పడలేక యెవరూ లేనపుడు కంటి అద్దాలు తగిలించి యింటి పన్లు చూసుకునేది. భీముడికి చదువు నేర్పటం ఆరంభించింది. అక్షరాలు, గుణింతాలూ నేర్చుకున్నాడు.

ఇంత కుదురుగా నడుస్తోన్న బతుకూ మళ్లీ కుదుపులకి గురయ్యింది. బంతి బతుకే అంత! ఎపుడూ కల్లోలమే! ఈసారి కల్లోలానికి కారణం ఆ స్కూల్ నకిలీ వార్డెన్!

అన్నల భయం వల్లనో, సంక్షేమాధికారి తనిఖీల కారణానో బంతి రెగ్యులర్‌గా స్కూలుకి వెళ్తున్న కారణానో ముగ్గురు అసలు టీచర్లూ రెగ్యులర్‌గా స్కూలుకి వస్తున్నారు. నకిలీ వార్డెన్‌కి ఉద్వాసన చెప్పారు. దానితో అకారణ ద్వేషాన్ని డిటిడబ్ల్యూ గారిపై పెట్టుకున్నాడు ఆ నకిలీ వార్డెన్. ఆయనను యెలాగోలా అభాసుపాలు చెయ్యాలనుకున్నాడు. అందుకు పరికరంగా బంతిని వాడుకున్నాడు.

డిటీడబ్ల్యూ గారికీ బంతికీ మధ్య అక్రమ సంబంధాన్ని అంటగట్టేడు. రేడియోలో బంతి పాటలూ ఆమెతో జరిపిన యింటర్వ్యూ వస్తే అది డిటిడబ్ల్యూ గారు పొందిన సుఖానికి ప్రతిఫలంగా యెరేంజ్ చేసాడు అన్నాడు. సవర సంగీత వాయిద్యాల గూర్చి నేర్చుకోవటానికి డిటీడబ్ల్యూ గారు వలసకు వస్తే ప్రేమ పాఠాలు నేర్చుకోడానికి వస్తున్నాడన్నాడు. ఆకాశరామన్న ఉత్తరాలు రాసేడు. పాఠశాల గోడలమీద వీరి పేర్లను ప్రేమ గుర్తుల్లో చెక్కేడు. ఇదే అదనుగా టీచర్లు చెవులు కొరుక్కున్నారు. వాళ్లకి కొంతమంది కాంట్రాక్టర్లూ, వ్యాపార్లూ సహకరించేరు. గిరిజన సంక్షేమం కోసం అహర్నిశలూ కష్టించే ఆ డిటిడబ్ల్యూ గార్ని అక్కడనుంచి బదిలీ చేయించటానికి యిలాంటివే ఎన్నో అపవాదులు ప్రచారం చేశారు. ఇదే అదనుగా ఆ స్కూలులో ఒక టీచర్ బంతిని బ్లాక్‌మెయిల్ చేయాలనుకున్నాడు. ఎవరూ లేని సమయాన ఓ రోజు బంతి దగ్గరకొచ్చి వికార చేష్టలు చేయబోయేడు. బంతి కోపంగా మాట్లాడితే,

"యేం పతివ్రతవా? ఆ రాజుగాడితో కడుపు చేయించుకొని, కొండోడ్ని కట్టుకుని సంసారివైపోయేవు. ఇపుడు, ఏకంగా డిటిడబ్ల్యూ తోటే సరసం చేస్తున్నావ్. ఎవడికి తెలీదు నీ రంకు! మీ జనం ముందు బయట పెట్టేగల్ను... నన్ను కాదంటే!" అని బలవంతం చేయబోయేడు.

బంతి పెనుగులాడింది. అరిచింది. కొట్టింది. తిట్టింది... అరుపులకి పిల్లలు చేరారు పరుగెత్తుకుంటూ! ఆ టీచర్ బంతిని వదిలేసి పారిపోయేడు. ఏడుస్తూ తలదించుకుంది బంతి. పిల్లలంతా ఆమె చుట్టూ చేరి, విచారంగా కూర్చున్నారు. వాళ్లకి యేం జరిగిందో తెలీదు, కానీ బంతి యేడుస్తుంటే వాళ్లకు బాధ కలిగింది. కళ్లు తుడుచుకుని బంతి లేచింది. ఇంటికి వెళ్లకుండా తిన్నగా ఐటిడిఎ ఆఫీస్‌కి వెళ్లింది. డిటీడబ్ల్యూ గార్ని కలిసి, రాజీనామా పత్రాన్ని యిచ్చింది. ఆయన ఆశ్చర్యపోయేరు. ఏమైందని అడిగేరు. జరిగింది అంతా చెప్పింది."నామీద ఆ టీచర్ చేయబోయిన అత్యాచారం కంటే మన మధ్య అక్రమ సంబంధాన్ని అంటగట్టిన దానికే బాధపడుతున్నా"నని చెప్పింది. అప్పుడాయన,

"ఈ విషయాలు నాకూ తెల్సు. నాకూ ఆకాశరామన్న ఉత్తరాలొచ్చేయి. ఈ ఆఫీస్ గోడలమీదా మన పేర్లు రాసేరు! అయితే అంత మాత్రాన మనం బాధపడి, విరక్తికి గురికాకూడదు. మనలో యే దోషమూ, కల్మషమూ లేనపుడు లోక అపవాదును పట్టించుకోగూడదు. అది మరింత ఆ దుర్మార్గులకే సహకరిస్తుంది. నువ్వు ఉద్యోగానికి రాజీనామా చేస్తే వాళ్లు మనమధ్య అక్రమ

సంబంధాన్ని ఖాయం చేసేస్తారు. నువ్వు చివరిదాకా యిలాంటి అక్రమాలకు వ్యతిరేకంగా నిలబడాలి. వీళ్లతో పోరాడాలి. మీ తండ్రులూ, మీ ముందరితరమూ నీకు పోరాటం వొదలి వెళ్లారు. పిరికితనాన్ని కాదు. అయితే ఆ పోరాటం వారిలాగా హింసతో కాదు, అహింసతో చట్టబద్ధంగా చేయాలి. నువ్వు ధైర్యంగా నిలబడు'' అని నచ్చజెప్పి, ఆమెలో ధైర్యాన్నీ పట్టుదలనీ కలిగించేరు.

ఆ తర్వాత బంతి దగ్గర కంప్లెయింట్ తీసుకొని ఆ కంప్లెయింట్ ఆధారంగా ఆ టీచర్‌ని ఉద్యోగంలోంచి సస్పెండ్ చేశారు. అన్యాయానికి వ్యతిరేకంగా చట్టాన్ని ఆయుధంగా వాడుతున్న ఆ అధికార్ని చూసి బంతిలో కొండంత ధైర్యం నిండింది. మళ్లీ మామూలుగానే స్కూలుకివెళ్తోంది. పిల్లలు సంతోషంగా పాటలు పాడడం, వినడం చేస్తున్నారు. ఈ విషయాలేవీ భీముడి దాకా తీసుకుపోలేదు బంతి. ఆయనకు తెలిస్తే బాధపడతాడని చెప్పలేదు. గానీ విషయం ఆయనదాకా వెళ్లింది. అనేక చిలవలూ పలవలతో కట్టుకథల్తో వెళ్లింది. గానీ ఆయన నమ్మలేదా కథల్ని. ఓరోజు స్కూల్‌కి వెళ్లే ముందు బంతితో,

"బంతీ ఇంకా నేనంటే భయం పోలేదా?" అనడిగేడు, తొలిసారి ఆమెని రెక్కపట్టుకు లాక్కెళ్లినపుడు ఆమెలో కలిగిన భయాన్ని దృష్టిలోకి తెస్తూ. బంతి ఛఛా అలాంటిదేం లేదంది.

"అయితే, యికనించి నీకేటి జరిగినా నాతోటి సెప్పు. నువ్వే ఆపదల్నించి ఒక్కర్తివే బయట పడగలననుకోకు. నీకేటి కాకుండా సూడ్డానికి నేనూ వున్నాను'' అన్నాడు.

అదిగో ఆ మాట బంతి కళ్లల్లోకి ప్రేమగా చూస్తూ గుండె లోతుల్లోంచి మాట్లాడేడేమో భీముడు! ఆ ఆదరానికి బంతి అనిర్వచనీయమైన అనుబంధాన్ని గుండెల్లో నింపుకుని భీముడి గుండెలమీద ముద్దుపెట్టింది. భీముడి బుగ్గల్ని చేత్తో సుతారంగా తాకి "యికనించి అన్నీ చెప్తాను'' అని చెప్పి, స్కూలుకి బయలుదేరింది.

రోజులు, నెలలూ సజావుగా గడుస్తున్నాయి. బంతి బిఎ మొదటి సంవత్సరం పరీక్ష రాసింది. కడుపులో భీముడి వారసత్వాన్ని మోస్తోంది.

"పట్టి మనిసివి కావు. అసలే నీరసం మనిసివి. స్కూలుకి సెలవుపెట్టి యింటిలుండరాదా? పురుడయినాక యెల్లొచ్చు స్కూలుకి'' అని భీముడు సతాయించేవాడు, బంతి గర్భిణీగా వుంటూ గూడా స్కూలుకి వెళ్తొస్తుంటే.

బంతి అలాగేలే అంటూ మరికొన్ని రోజులు గడిపేసింది. అయితే యేకంగా భీముడు సంక్షేమాధికారికీ, గౌరునాయుడు మేస్టారికీ చెప్పాడు బంతి సెలవు గురించి.

అప్పుడు మరి తప్పలేదు గనుక బంతి రెండు నెలలు మెటర్నిటీ లీవు తీసుకొని యింటిలో వుండిపోయింది.

ఈ రెండు నెలల కాలంలో మొదటగా చిన్నగా ఆరంభమైన కల్లోలం తిరిగి బంతి స్కూలుకి వచ్చేసరికి చెలరేగి పోయింది. ఆమెను టార్గెట్‌గా పెట్టుకుని వేటాడాలనుకున్న ఆ నకిలీ వార్డెనూ, ఆ టీచరూ ఆమెకంటే ముందు డిటిడబ్ల్యూగార్ని వేటాడగలిగేరు. తర్వాత బంతి చుట్టూ వల బిగించి బంధించేరు. బంతి ఆ కుట్రను గ్రహించలేక యిరుక్కుపోయింది.

★ ★ ★

నెలనెలా పోడు పునరావాసం పథకం క్రింద జమ్మొలస వారికి జీడిమొక్కలు పెంచేందుకు డబ్బు యిస్తామన్నారు అగ్రికల్చర్ డిపార్ట్‌మెంట్‌వారు. ప్రకాశరావు ఎవరికెంత డబ్బు వస్తుందో స్టేట్‌మెంట్ రాసి

 

భీముడి చేతికిచ్చేడు. ఇంతకుముందు ఈ వ్యవహారాలన్నీ కంఠుడు చూసేవాడు. భీముడు ఇల్లరికం వచ్చేసాక ఆయనే చూసు కుంటున్నాడు. జనాలని తీసుకుని భీముడు బ్యాంకుకి వెళ్లాడు. అప్పటికి ఉదయం పద కొండు గంటలవుతుంది. బ్యాంకు నిండుగా జనం రద్దీగా వున్నారు. అంతమంది జనంలో యేం చేయడమో యెవర్ని కల వాలో అర్థంగాక ఒక పక్కగా నిల్చున్నారు వలసజనాలు. వీరిని చూసి ఓ పల్లపు ప్రాంత రైతు,

"కొండోళ్లు దిగిపోనారు. స్కీమేదో వొచ్చిందిగావాల! ఛేన్స్ అంటే యీళ్లదే! సగానికి సగం సబ్సిడీ. ఆ సగం ఋణానికీ పెడతారు యెగనామం!" అన్నాడు.

ఆయన మాటలకు అంత జనంలోనూ యెవరూ ఔననిగానీ, కాదనిగానీ అనలేదు. ఎవరి మానాన వారు ఊరుకున్నారు. భీము డు బ్యాంకు లోపలికి వెళ్లాడు.

బ్యాంకులో ఆరేడు విశాలమైన గదులు న్నాయి. అన్ని గదుల్లోనూ గాడ్రెజ్ అల్లిక కుర్చీలూ, గిరగిరా తిరిగే గాలిపంఖాలు, తెల్లటి కాంతిని కక్కే ట్యూబులైట్లూ వున్నాయి. గది, గదికీ పెద్దపెద్ద బీరువాలూ, ఫైళ్ల రేక్‌లూ నిల్చున్నాయి. గోడలమీద గడి యారాలు... ఆగిపోయి వున్నాయి. కేలండర్ లు గాలికి ఎగురుతోన్నాయి. చాలా కేలండ ర్లలో నోట్లకట్టలూ, పగలబడి నవ్వే రైతులూ కన్పిస్తున్నారు. అలా బ్యాంకులో ఏ రైతూ లేడు. ఏ రైతూ నవ్వుతూ కన్పించలేదు.

ముందుగదిలో మూడు కేష్ కౌంటర్లు న్నవి. వాటిల్లో ఖరీదైన దుస్తుల్లో చిరాకయిన కేషియర్లున్నారు. తర్వాత గదుల్లో గాడ్రెజ్ కుర్చీల్లో కులాసా ఆఫీసర్లున్నారు.

భీముడు ఈ కొసనుంచి ఆ కొసదాకా అందరికీ దండాలుపెట్టాడు. ఎవరూ తిరిగి పలకలేదు. దండం పెట్టలేదు. భీముడికి ఏం చేయాలో పాలుబోవటంలేదు. ఓ క్షణం నిల్చొని అటూ యిటూ చూశాడు. అపుడో లెడ్జరూ, యిపుడో రిజిస్టరూ అట్నించిటూ, యిట్నించి అటూ నడుపుతూ నవ్వుతూ ఎవరి పిలుపుకీ పలుకక ఎవరికీ అంద కుండా తామరాకుమీద నీటిబొట్టులా తిరుగు తోన్న డఫేదార్ తెల్లటి యూనిఫాంలో తెల్లగా కన్పించేడు. భీముడు ఆయనకు ఎదురుగా వెళ్లి దండం పెట్టాడు. ఆ దండం అందు కొంటూ దాంతోపాటూ ఓ లెడ్జర్ అందుకొని లోనికి వెళ్లిపోయాడు డఫేదారు. భీముడు అతడితోపాటూ వెళ్లబోతుంటే అక్కడి కుర్చీలో కులాసా ఆఫీసర్ ఆపేశాడు.

"మాది జమ్మొలస బావ్' చెప్పాడు భీముడు.

"అయితే...?" గద్దించేడు ఆఫీసర్.

అంతటితో ఆగిపోయాడు భీముడు. ఏం జవాబు చెప్పాలో తెలీదు. అంతలో చేతిలో కాగితం గుర్తొచ్చి ఆ కాగితాన్ని చూడమని యివ్వబోయాడు భీముడు.

"ఏ కాగితం బడితే ఆ కాగితం చూడ్డానికి నేనేం పోస్ట్‌మేన్‌ని అనుకున్నావా? పోవోయ్" అని పొమ్మన్నాడా కులాసాబాబు! అలా గసిరేసి, యేకంగా ఆ సీట్లోంచే లేచి వెళ్లిపోయా డా బాబు!

భీముడు నిర్ఘాంతపోయాడు. ఏం చే యటం? ఎవర్ని కలవటం? ఎవరి దగ్గర తమ పని అవుతుంది? ప్రశ్నార్థక గుండెల్తో నిల్చున్నాడు. దుర్గమారణ్యాల్లో దారి తీయ గలవాడు, కొండరాళ్లను పిండిచేసి నేలను చదునుచేసి కొత్త చిగుళ్లు మొలకెత్తించగలవా డు, చిక్కటి చీకటిలో సూటిగా శబ్దాన్ని భేదించే విలుకాడు! పట్టపగలు, మనుషు లుండే ఒకానొక కార్యాలయంలో తన కా ర్యం నెరవేర్చుకునే దారి కానరాక సతమత మౌతున్నాడు.

తెల్ల యూనిఫాం డఫేదార్ బయటికి వచ్చేడు. మళ్లీ ఆయనకు దండం పెట్టాడు భీముడు. మళ్లీ ఆ దండాన్ని అందుకున్నాడు

డఫేదార్. ఈసారి లెడ్జర్ అందుకొని వెళ్లిపోకుండా భీముడి దగ్గరకొచ్చి తీరుబడిగా భీముడి భుజమ్మీద చేయివేసి జనం అంతా వున్నచోటికి నడిపించుకు వస్తూ-

"ఏ ఊరురా అన్నా మన్ది?" అనడిగేడు సవర యాసను అనుకరించుతూ జనాన్ని చూస్తూ. జనాలు కొంతమంది డఫేదార్ అందించబోయే వినోదంకోసం యిటే చూడసాగేరు. ఇదేమీ గమనించని భీముడు-

"జమ్మోలస బావ్'' చెప్పాడు.

"ఎందుకొచ్చినావు బావ్?" డఫేదార్.

"సొమ్ముకోసం" భీముడు.

"సొమ్ముకోసం కాపోతే సోడిపిండికోసమొస్తార్రా బ్యాంక్‌కి? అదిగాదురా నేనడిగేది! ఏ సొమ్ము? ఏం లోన్? ఏం స్కీము? ఏవీ పుస్తకాలు? ఏవీ కాయితాలు? ఏరీ మనుషులు?" అని టక టకా ప్రశ్నలు దంచేడు డఫేదార్.

అన్ని ప్రశ్నలకూ ఒకే సమాధానం తెలుసు భీముడికి.

"జీడి మొక్కల స్కీం! ఎగ్రికల్చరాఫీసు ప్రెకాశిరావు బావ్ కాయితమిచ్చేడు'' అని చెప్పి కాగితం చూపించబోతే డఫేదార్ భీముడ్ని మధ్యలోనే ఆపేస్తూ 'ఇక చెప్పొద్దు. తెల్సు!' అన్నట్లుగా చేత్తో సైగచేసి, వినోదాన్ని చూసే జనం అందరికి వినబడేటట్లుగా-

"మీదేనర్రా అదృష్టం! మీ కొండలమీద, మీరు తోటలు పెంచుకున్నందుకు తిరిగి మీకు జీతాలిస్తంది గవర్నమెంటు! అదృష్టమంటే మీదికాదా? జీడితోటా మీదే! జీడిపిక్కా మీదే! అవి పెంచినందుకు సొమ్ము! ఆహాఁ! ఏం అదృష్ట జాతకుర్రా మీరు! గేదెల్ని మీకిచ్చి ఆటికి కుడితీ, గడ్డీ గూడా యిచ్చి ఆటి పాలు తాగటానికి రేపు మీకు జీతాలిచ్చే రోజులొచ్చినా వస్తాయి! అయినా మీరు బాగుపడరు. గోసిగుడ్డ మారదు. ఎలగర్రా మీరు బాగుపడతారు? ఒకపని చెయ్యండ్రా... మా యినబ్బీరువా వొట్టికెలిపోయి మీ ఇళ్లల్లో పెట్టుకోండ్రా... బాగుపడతారు'' అన్నాడు హెచ్చుస్వరంతో హేళనగా.

ఆ మాటకు వినోదాన్ని తిలకించినట్లుగా తిలకిస్తోన్న జనం 'బాగా సెప్పావ్' అని హుషారిచ్చేరతనికి! ఆ హుషారుతో మరింతగా విజృంభించేడు డఫేదార్.

"ఆళ్ల గురువే బతికి వుంటే ఆ పనే చేసున్ను. అయితే వొకటీ... గురువుకాలం మనుషులకి, ఈళ్లకీ బోల్డు తేడా. అప్పుడోళ్లు మాటంటే పడేవోరుకారు. ఒకరి సొమ్ముకి కక్కుర్తిపడేవోరు కారు. మాటకి కట్టుబడి వుండేవోరు! ఇపుడోళ్లో...? ఓలమ్మ! మనపల్లపోళ్లని మించి పోయినారు... మాయజెయ్యడంలో! మెత్తగుంటారుగానీ... యీళ్లు మా కానోళ్లు!

ఈడ్ని చూడండీ... నువ్వేటను... ఉలకడూ, పలకడూ! నీ గోస... నీదే పోరా అని అనీసుకుంతాడు మనసులో! ఆడి పని అయిన్దాకా... ఏదీ పట్టించుకోడు. ఆళ్ల గురువుని దేవుడను... ఔనన్డు! దెయ్యం అనూ... దానికీ కాదని అన్డు! అసలు యినబడనట్టే పల్లకుంతాడు. ఆఖర్నమాత్రం ఆడి ఫైలు భోగట్టామాత్రం అడగటం మానడు'' అని భీముడ్ని చూపించి మరీ యెగతాళి చేశాడు డఫేదార్!

భీముడికిదంతా అర్ధమౌతోంది. వేళాకోళాన్ని గ్రహించేడు. అయినా ఏం లాభం? ఎదురు మాట్లాడితే తగువు వొస్తుంది. తమ పని ఆగిపోతుంది. కొండలు ఎక్కి దిగీ వచ్చిన జనం బాధపడతారు. అందరి శ్రమా మరోసారి వృధా అవుతుంది! అందుకనే-

ఆ డఫేదార్ హేళనగా అన్నట్లుగానే భీముడు నిర్లిప్తంగా నిల్చున్నాడు. గుండె ఘోషను తొక్కిపెట్టేసాడు. ఆవేశాన్ని అదుపుచేసుకున్నాడు. కోపాన్ని నిగ్రహించుకున్నాడు.

వినోదం చేయగలిగినంతసేపూ చేసి ఎదురుగా వున్న వ్యక్తి దగ్గర సిగరెట్ కొట్టేసి




అంటించీ, పొగ వదుల్తూ అక్కడనుంచి వెళ్లిపోబోయేడు డఫేదార్!

"మరి మాకేటి సెప్పావుకాదు బావ్? మా ఫైలు సంగతి సెప్పవా?" అనడిగేడు భీముడు.

ఆ మాటకు డఫేదార్ - "నేనేటి చెప్పగలను బావ్? నోట్లకట్టమీద రేపర్లాంటోడ్ని బ్యాంకీల! అదిగో ఆ కొస గదిల యినబ్బీరువాలాగ కూర్చొనున్నారు చూడూ! ఆ బావ్ దగ్గరకెళ్లి కలువ్'' అని చెప్పి సిగరెట్ దమ్ము లాగి టీకొట్టుకి నడిచేడు!

భీముడు కొసగదివేపు నడిచేడు. డఫేదార్ చెప్పినట్లే ఇనబ్బీరువా బావు కన్పించేడు. భీముడు గదిలోకి వెళ్లాడు. దండాలు పెట్టాడు.

మేనేజర్‌బాబు ఫైలులోకి కళ్లు పోనిచ్చి చూడనేలేదు ఓ క్షణందాకా భీముణ్ని. ఫైల్ పరిశీలన ముగిసేక చూసేరు భీముడివైపు. భీముడు మళ్లీ దండం పెట్టాడు. మేనేజర్‌గారు కళ్లతోనే ఎందుకొచ్చావ్ అని ప్రశ్నించారు! అగ్రికల్చరాఫీసూ, ప్రకాశరావూ కాగితమూ అంటూ పదాల పేర్పుతో జవాబిస్తూ భీముడు తన చేతిలోని కాగితాన్ని ఆయనకు యిచ్చేడు.

కుడిచేత్తో భీముడు యిచ్చిన లిస్ట్ అందుకొని ఓ క్షణం చూసి యెడమ చేయి ఎత్తి టేబుల్‌మీది బజర్ నొక్కారు. బర్ర్... మంది బజర్. తుళ్లిపడ్డాడు భీముడు. గుండెలు దడదడలాడేయి. ద్వారంవైపు చూసేరు మేనేజర్‌గారు. ఎవరూ అలికిడి లేదు. మళ్లీ బజర్ నొక్కారు. అప్పటిగ్గానీ డఫేదార్ రాలేదు. డఫేదార్ రాగానే-

"పదమూడో నెంబర్ ఫైల్ తీసుకురా..." అని చెప్పారు మేనేజర్‌గారు. డఫేదార్ ఫైలు కోసం వెళ్లాడు. అపుడు మేనేజర్‌గారు-

"మీది జమ్మొలసేనా?" అనడిగేరు.

"ఔనుబావ్'' అన్నాడు భీముడు.

ఇంతలో డఫేదార్ పదమూడో నెంబర్ ఫైలు తెచ్చాడు. మేనేజర్‌గారు ఆ ఫైలు తెరిచి అందులో అగ్రికల్చర్ ఆఫీస్‌నుండొచ్చిన లెటర్ చదివి-

"మీ ఊరి ఇరవైమందికీ ఒక్కోరికీ నెలకి నూటాయాభయి రూపాయలు చొప్పున పద్దెనిమిది నెలలకి సరిపడా డబ్బు ఐ.టి.డి.ఏ. ఆఫీస్‌నుంచి మాకు జమ చేశారయ్యా'' అని చెప్పారు.

"ఔను బావ్. ప్రకాశరావ్‌బావ్ ఆమాటే అన్నారు. ఇరవయి మందిమీ వొచ్చేము బావ్'' అని చెప్పాడు భీముడు.

మేనేజర్‌గారు ఆ మాటకు బదులివ్వక మౌనంగా భీముడివైపు చూస్తూ మళ్లీ బజర్ నొక్కేరు. ఈసారి వెంటనే వచ్చేడు డఫేదార్.

"టెర్మ్‌లోన్ మూడో లెడ్జర్ తీసుకురా'' అని చెప్పారు మేనేజర్‌గారు. తీసుకువచ్చేడు డఫేదార్. ఆ లెడ్జర్ పేజీలు తిరగేస్తూ ఒక్కో పేరు జమ్మొలస జనాలు ఇరవైమంది పేర్లూ చదివేరు ఆయన.

"ఔను బావ్. అవి మా వొలసోలిపేర్లే'' అన్నాడు సంతోషంగా భీముడు.

"ఈ యిరవైమందికీ మా బ్యాంక్ గేదెల లోన్స్ ఇచ్చింది. అయిదేళ్లయింది. ఒక్క రూపాయి అయినా తీర్చలేదెవరూ'' అన్నారు మేనేజర్‌గారు.

భీముడికేం అర్థంకాలేదు! గేదెలేటీ, లోన్సేటీ? అయోమయంగా చూడసాగేడు. భీముడివైపు చూస్తూ మేనేజరుగారు-

"ఏరీ మిగిలినవాళ్లూ! వాళ్లనీ పిలువ్. తీస్కరా'' అని కేకలేశారు. భీముడు గబగబా వెళ్లి అక్కడెక్కడో గుంపుగా కూర్చున్న జనాల్ని పిల్చుకువచ్చేడు. అందర్నీ చూస్తూ మేనేజర్‌గారు-

"మీరంతా మాకు బాకీ వున్నారు. మీకు గేదెలు యిచ్చేంగదా? ఆ అప్పు తీర్చేరా? అయిదేళ్లయింది.. సబ్సిడీపోగా సగం

అప్పునీ మీరు తీర్చకపోతే ఎలా? బ్యాంకుకి ఎంత నష్టం అనుకుంటున్నారు? ఇలాంటి స్కీముల్తోటే మా బ్యాంకులు లాస్లోకి వెళ్తున్నాయి. లాభంలేదు. నేను ఊరుకోను. నేను ఊరుకున్నా నా పై అధికార్లు ఊరుకోరు. నన్ను దంచేస్తారు. చెప్పండి. గేదెల లోన్సు సంగతి చెప్పండి'' అనడిగేడు.

జనం యెవ్వరూ బదులు చెప్పలేదు. ఏం చెప్పాలో తెలీక మౌనంగా నిల్చున్నారు. భీముడికి అంతా అయోమయంగా వుంది. గేదెల్లేమిటి? లోన్సేమిటి? ఇంకా బాకీ వుండడమేమిటి? ఏంవర్థంగాలేదు భీముడికి.

మేనేజర్‌గారు మాత్రం ఏదో ఆలోచించి ఏవేవో ఓచర్లు తీసి వాటిమీద వలస జనాలొక్కొక్కరి వేలిముద్రలూ తీసుకున్నారు. ఆ తర్వాత వాటిని భద్రంగా ఫైలులో పెట్టుకొని-

"మీరు గేదెల లోన్సు తీర్చలేదు. ఆ లోన్ మా లెడ్జర్లలో వుండగా మీ పేరున డబ్బు యే స్కీంకింద వొచ్చినా... మరి మేము ఆ పాతబాకీకి జమచేయాలి. అవి మా రూల్స్. నేను వాటిని అతిక్రమించలేను. ఇదిగో మీచేత వేలిముద్రలు వేయించానే... ఈ వోచర్లు మీ పాతబాకీకి జమ రాస్తాను. ఈ సొమ్ముతో మీ బాకీలు తీరకపోవచ్చు. కొద్దోగొప్పో వుండిపోవచ్చు. దానికోసం మేము మిమ్మల్ని కోర్టుకి లాగకముందరే యేదో వొక పంటల సీజన్‌లోనో తీర్చేయండి. లోన్ పూర్తిగా తీర్చేస్తే మీకు తప్పకుండా మళ్లీ సబ్సిడీ స్కీంకింద అందరికీ లోన్స్ యిస్తాము. ఆ సహాయం నేను అపుడు చేస్తాను'' అని చెప్పాడు.

చేతి వేళ్లకు అంటిన సిరాముద్రలను తలకు రాసి చెరుపుకుంటూ తలలు వేలాడేసుకొని విచారంగా భీముడూ, మిగిలినవారూ వలస చేరారు!

భీముడు బ్యాంకులో జరిగినదంతా కంతుడికి వివరించేడు. బంతి నులక మంచంమీదనుంచి అంతా వింటోంది.

"ఇంత అన్నేయమా? లంజికొడుకు... నమ్మించి మనందర్నీ గుమ్మిల తోసేడు. ఆడే... ఆ రాజుగోడే యింత గోరంకీ మూల పురుషుడు. ఆడుగానీ మళ్లా అవుపడితే అడ్డగ నరికీయాల" కోపంతో ఊగిపోతున్నాడు కంతుడు.

ఆనాడు కోలనీ కడుతున్ననాడు స్లేబ్ దశలో మెటీరియల్ చాలక డబ్బుల్లేక కోలనీ లబ్దిదార్లంతా తలలుపట్టుకు కూర్చొని విచారిస్తుంటే బంతి ఇచ్చిన సలహాప్రకారం రాజుబాబు దగ్గరకు వెళ్లిన ఫలితం ఇదీ!

సలహా ఇచ్చినపుడు బంతికీ తెలీదు అది భవిష్యత్తులో ఎంత నష్టపరుస్తుందో. నమ్మించి బంతిని మోసగించేడు రాజుబాబు. నమ్మకంగా వలస జనాలను కసాయోడికి అప్పగించేడు.

ఆరోజు కోలనీ పూర్తి చేయటానికి జగ్గారావు కాంట్రాక్టర్ పెట్టిన పెట్టుబడికి కోలనీవాసులకు యివ్వబోయే ద్రాక్షారం గేదెలను అప్పగించాలని షరతు చెప్పారు.

కంతుడూ, కమిటీవారూ ఆ షరతుకు అంగీకరించేరు. అయితే సబ్సిడీ రూపంలో అందబోయే లాభం ఎంతో వాళ్లకు తెలీదు. నిజానికి వాళ్లకు వచ్చే రెండు గేదెలకూ, లభించే సబ్సిడీలో సగం కూడా వుండదు వారికి జగ్గారావు పెట్టిన పెట్టుబడి.

అయినా పోతే పోనీ అనుకున్నారు. గేదెల్ని వొప్పజెప్పేస్తాం అలగే... ఆటి అప్పులూ మీరే తీర్సాల అని చెప్పారు జెగ్గారావుకి. ఆనాడు జరిగిన ఒప్పందమది. గానీ ఈనాడు జరిగింది తద్భిన్నంగా!

బ్యాంకు రుణాలు వలస జనాల పేరు మీద వుండిపోయి, వడ్డీల్తో తడిసి మోపెడయ్యాయి. జగ్గారావు గేదెల్తో పాడీపంటా పెంచుకొని ఎమ్మెల్యేని పట్టుకుని ఆ యేరియాలో 'పాలశీతలీకరణ' కేంద్రం పెట్టించి పాలు ఎక్కువధరకు అమ్ముకోగలిగేడు.

"కోలనేమో బీటలు పడిపోతంది. ఉండ




డంకి భయమేస్తంది, ఎపుడు పడిపోద్దో అని! ఆ భయంకి పక్కన పాకలేసుకు బతుకుతున్నాం. ఈ కోలనీకి చేసిన అప్పుమాత్రం స్కీములన్నీ తినేస్తంది. ఇదిగీ అన్నేయం తెలిసి తెలిసీ భరించీడమేనా?" ప్రశ్నించేడు భీముడు.

బంతి ఆ ప్రశ్నకు జవాబు వెదికింది. ప్రోజెక్ట్ ఆఫీసర్‌గారికి చెప్పాలనుకుంది ఈ విషయాన్ని. ఆయనేగదా జీడిమొక్కల పెంపకానికి డబ్బు పంపించేరు. భీముడితో అదే చెప్పింది బంతి.

"ఈ భోగట్టా అంతా పీ.వో.గారికి చెబ్దాం. ఆయన తప్పకుండా యేదో పరిష్కారం చెప్తారు. అంతగా కాకపోతే డి.టి.డబ్ల్యూగారి ద్వారా రికమండ్ చేయిద్దాం" అని అధికార్ల మీద నమ్మకంతో చెప్పింది.

ఈమధ్య బంతి మెటర్నిటీ లీవులో ఉండటంతో పీ.వో. ఆఫీస్ భోగట్టాలేవీ తెలీవు. డెలివరీ అయిపోయి పదిహేను రోజులైంది. గనుక రేపో నేడో స్కూలుకి ఇక వెళ్దామనుకుంటోంది. ఎలాగూ ఈ సమస్య వుంది గనుక ఓసారి పీవో ఆఫీస్‌కి వెళ్లిరావచ్చని అనుకొని మర్నాడు అందర్నీ బయలుదేరమని చెప్పింది.

పీ.వో. ఆఫీస్‌కి వెళ్లిన తర్వాత తెలిసిన విశేషాలతో బంతికి తల తిరిగిపోయింది. అప్పటికి వారంకిందటే ఎమర్జెన్సీ ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్‌తో ఆదిలాబాద్ బదిలీ అయి వెళ్లిపోయేరట డి.టి.డబ్ల్యూగారు! ఆయన సస్పెండ్ చేసిన టీచర్‌కి రాజకీయ నాయకుల్తో బంధుత్వముంది. ఆ బంధుత్వాన్ని వినియోగించి స్థానికంగా తన కార్యకర్తలచేత అబద్ధపు ఆరోపణల్తో కంప్లెయింట్స్ పెట్టీ కార్యకర్తలచేత ప్రాజెక్ట్ ఆఫీస్ముందర ఓరోజు ధర్నాను నిర్వహించీ మొత్తంమీద డి.టి.డబ్ల్యూగారిని బదిలీ చేయించారట! కనీసం స్టాఫ్ దగ్గర్నుంచి వీడ్కోలు తీసుకునే అవకాశం కూడా యివ్వలేదట ఆయనకు. ఆయన అమితంగా అభిమానించే ఆశ్రమ పాఠశాలలకు ఆఖరి విజిట్‌కి వెళ్తానన్నా కుదరదు అనేసారట! ఎంత వేదనతో వెళ్లి వుంటారోగదా! అని బాధపడింది బంతి!

అన్యమనస్కంగానే అలా పీ.వో.గారి ఛాంబర్‌కి వెళ్లింది. బంతితోపాటు భీముడూ, మరికొంతమంది వలస జనాలూ వచ్చారు. కోలనీ నిర్మాణంనుండీ విషయాన్నంతటినీ వివరించింది బంతి. అప్పుడు పంపిణీ చేసిన గేదెలు జగ్గారావు కాంట్రాక్టర్ పాలయినాయి. అప్పులు వలస వాళ్లకు చుట్టుకున్నాయి. ఈ జీడిమొక్కల పథకం డబ్బు ఆ లోన్స్‌కి జమచేసేస్తామంటున్నారు బేంక్‌వారు అని చెప్పీ తన వాళ్లకు న్యాయంచెయ్యమని విజ్ఞప్తి చేసింది. పీ.వో.గారు ఆలోచనలో పడ్డారు. క్షణం తర్వాత-

"ఇందులో నేనేం చేయగల్ను?" అనడిగేరు.

"కాంట్రాక్టర్ జగ్గారావు చేసిన మోసమిది. పోనీ అతని పెట్టుబడికి మొదటి విడత మావాళ్లకిచ్చిన గేదెలు తీసుకుని రెండోవిడత ఇచ్చిన గేదెల్ని మావాళ్లకి వొదిలేస్తే బాగుండేది. కనీసం ఆ రెండో గేదెలద్వారా కొంతయినా అప్పు తీర్చగలిగేవాళ్లు. రెండు గేదెల్నీ ఆ స్కీమునే జగ్గారావు కొట్టేశాడు'' అని కాస్త వివరంగా స్కీం గురించి, జగ్గారావ్ అక్రమాన్నీ చెప్పింది. అలా చెప్పి-

"న్యాయంగా ఆ అప్పు ఆ జగ్గారావే తీర్చాలి'' అంది బంతి.

"గానీ లోన్ రికార్డుల్లో అతని పేరు లేదుగదా?"

"అయితే మేం లోన్ తీర్చక తప్పదా?"

పీ.వో.గారు జవాబు చెప్పలేదు.

"ఈ వొచ్చిన సొమ్ము ఆ అప్పుకి జమజేసిత్తే మరి ఆ జీడిమొక్కలెలగ పెంచుతాం బావ్? కూలాడితే కుండాడీ బతుకులు మావి!" అన్నాడు భీముడు. ఎలాగైనా మీరు ఆదుకోవాలన్న అభ్యర్థనతో!




"చట్టప్రకారం తీసుకోవాలి యే చర్య అయినా! చట్టం పరిధి దాటి యేమీ చెయ్యలే ను'' అన్నారు పీ.వో.గారు.

'చట్టాన్ని ఆయుధంగా చేసి అక్రమాన్ని ఎదిరించాల'న్నారు డి.టి.డబ్ల్యూ!

చట్టం పరిధి దాటి యేమీ చేయలేనని పీ.వో.గారు!

ఇద్దరికీ అందకుండా చట్టం కళ్ళుగప్పి చట్టం పరిధి దాటి ఒక్కోసారి చట్టాన్ని చట్టుబండ చేసి ఇక్కడ అక్రమం చలామణీ అవుతోంది! ఎవరూ యేమీ చేయలేకపోతు న్నారు!

"వెళ్లొస్తాం సార్' అని సెలవు తీసుకున్నా రు పీ.వో.గారివద్ద! బయటికి వచ్చేశారు! భీముడు నడుస్తూ-

"ఇంతకీ యేటంటాడు పీవో?" అనడిగేడు బంతిని.

"ఏమీ చెయ్యలేను. జగ్గారావుమీద చర్య తీసుకోలేను అంటాడు. చట్టం ప్రకారం అతని కీ, లోన్సుకీ సంబంధం లేదంటాడు. చట్టం పరిధి దాటి చర్య తీసుకోలేనంటాడు'' అని చెప్పింది బంతి.

"క్రూర జంతువుని మాటుగాసి సంపాల గానీ సట్టంప్రెకారం సంపగలమేటి? దరమం ప్రెకారం యెదురుగెల్లి, తప్పుతల్లీ నువ్వు జంతువులమీద పడి చంపుకుతినడం తప్పు! ఇప్పుడికేనా బుద్ధిమార్సుకో లేపోతే యిదిగో ఈ చట్టం ప్రకారం నీకు శిక్ష యేస్తానని అన్నాం అనుకో! ఆ జెంతువేటి జేస్ది! నోరు సాపుతాది. పళ్లు బయటికి సూపి ఆవలి స్తాది. నాలుక్కాళ్లు యెత్తి మీదబడి పంజా యిసిరి మన పని పట్టేస్తాది'' అన్నాడు నవ్వుతూ, పీవోగారి చట్ట పరిభాషను యెగ తాళి చేస్తూ. మళ్లీ, అపుడే గుర్తొచ్చిందేమో-

"పంజా యిసిర్తేనే గదా పారిపోనాడు డి.టీ.డబ్ల్యూగోరు'' అన్నాడు. నిజమే! భీముడి పరిశీలనలో యే అసమంజసమూ కన్పించలేదు. ఆలోచనలతోనే అలా వలస చేరారు అందరూ!

అయితే అలా ఆ సమస్యమీద పీ.వో.గారి దగ్గరకు జనాన్ని తీసుకువెళ్లటంవలన జనాని కి జరిగిన మేలు యేమీలేదు. ఆ సమస్య పరిష్కారం కాలేదు. కానీ బంతికి మాత్రం తీవ్ర నష్టం జరిగింది. బంతికి కొత్త సమస్య ఎదురైంది.

బంతిని వేటాడాలని అదునుకోసం చూస్తో న్న నకిలీ వార్డెన్‌కీ, సస్పెండయిన టీచరు కీ... మంచి పాచిక దొరికింది. బంతిని చాలా పకడ్బందీగా సమస్యలో యిరికించేరు. వారి ద్దరూ పన్నిన వలలో చిక్కుకుపోయింది బంతి!



ఆరోజు లక్ష్మివారం. గొరడ సంతకి భీము డు గంపల్లో కందులు నింపి, కావిడితో బయల్దేరాడు. బంతికీ బయల్దేరాలనీ, సంత చూడాలనీ, సంత అంతా అటూ యిటూ తిరగాలనీ వుంది మనసులో. కానీ స్కూలు! స్కూలుకి వెళ్లాలి. అదీగాక చిన్నతనంలోలా గానో, చదువురాని వ్యక్తిలాగానో ఇలాంటి అనుభూతులను, నిస్సంకోచంగా అనుభ వించడానికి ఏదో అడ్డు వస్తోంది బంతికి.

నిజానికి బంతికి ఇలాంటి అనుభూతులు అనుక్షణమూ ఎదురవుతాయి. గానీ వాటిని నాగరీక సంస్కృతిలోంచి పరిశీలించడం, మంచీ చెడూ తర్కించుకోవటంలోనూ పడి

పోయి, అనుభూతికి దూరమౌతోంది. కారణం చదువా? చదువు కారణంగా తన ఆలోచనల స్థాయిని అందుకోలేని తన జనానికి దూరమౌతున్నానా? డిగ్రీవరకూ చదివేను. నౌకరీ దొరికింది. అయినా ఎందుకు అడవిలో పక్షిలా హాయిగా స్వేచ్ఛగా వుండలేకపోతున్నాను? తర్కించుకొంటోంది బంతి.

భీముడు బయలుదేరిపోయాడు. సరదాగా అంది బంతి "నేనూ వొచ్చేదా సంతకి?" అని. భీముడు కూడా నవ్వుతూ-

"రా... అయితే! గంప నెత్తిమీద పెట్టుకొని రావాల! ఇలగే మేస్త్రమ్మలాగ ముస్తాబయి కాదు" అన్నాడు.

"మొయ్యలేకపోతేనో?" అడిగింది బంతి.

"నిన్నూ, నీ నెత్తిమీద గంపనీ కలిపి మోసుకెల్తాను. నీకు భయమక్కర్లేదు" అన్నాడు భీముడు.

బంతి సిగ్గుపడి లోనికి వెళ్లిపోయింది. భీముడు సంతకు దారి తీసేడు. ఈ సంతలే ఏజన్సీకి బయటి ప్రపంచాన్ని చూపే కిటికీలు. ఏజన్సీ గ్రామాలన్నిటినుండి జనాలు ఇలా సంతలకొస్తారు. కొర్రలు, సామలు, చోళ్లు, నువ్వులు, ఉలవలు, కందులు లాంటి ఆహారదినుసులూ; పసుపు, అల్లం, కంద మూలం దుంపలూ; అడవిలో దొరికే పళ్లూ, కాయలూ; పనసపళ్లూ, అరటిపళ్లూ, మోసుకువస్తారు. వాటిని అమ్ముకొని తమకు కావలసిన ఉప్పూ, పొగాకు, కిరోసిన్, ఎండుచేపలు, అగ్గిరాయిలు కొనుక్కుంటారు. ఇంకా డబ్బులు మిగిలితే మగవాళ్లు, రంగులబనీన్లూ, గొడుగులూ, కత్తులూ, వాయిద్యాల కోసమని ఇనుపతీగెలూ కొనుక్కుంటారు. స్త్రీలయితే రంగురంగుల గాజులు, పూసలు, అద్దాలు, దువ్వెన్లూ కొనుక్కుంటారు.

అప్పుడు పోరాటకాలంలో పోలీస్వ్యానులు తిరిగేందుకు వీలుగా తార్రోడ్డు పడింది. ఇప్పుడు 'గొరడ' సంతదాకా బస్సులొస్తున్నాయి.

పట్నంనుంచి బస్సులో పొగాకు కట్టల్తో కురుపాం షావుకార్లూ, ఇత్తడి సామగ్రితో పార్వతీపురం వ్యాపార్లూ, కిరాణాసామన్లతో కోమట్లూ వస్తారు. జేబులో డబ్బుతోనూ, ఖాళీ గోనెసంచుల్తోనూ పల్లంనుండి మరి కొంతమంది సంత వ్యాపారులొస్తారు.

కిరాణాదినుసుల దుకాణాల కోసం ఒక వరుసలో పాకలూ, వాటి వెనుక రకరకాల రంగుల బట్టల దుకాణాలకోసం పాకలూ, వాటికి ఆనించి ఇత్తడి పాత్రల కొట్లూ, వాటి మధ్యనే అక్కడక్కడా టీ దుకాణాలూ, మంగలిషాపూ ఆ ఒక్కరోజు సంతకోసం ఏర్పాటు చేస్తారు సంత యాజమాన్యంవారు. ఆ ఏర్పాట్లకోసం ఆశీలు వసూలు చేస్తారు.

సంత సందడి, సందడిగా వుంది. కావిడితో కందుల్ని సంతలో దించి- మొహానికీ, భుజాలకీ పట్టిన చెమటను గావంచాతో తుడుచుకుంటూ చుట్టూ చూసేడు భీముడు. సంత నిండుగా గిరిజన్లు మోసుకొచ్చిన గంపల్తో కిటకిటలాడ్తోంది. తెల్సినవాళ్లు కన్పిస్తే... భీముడు వాళ్లని పలకరించేడు. ఆమిటినుండి మంగయ్య వచ్చేడు. మంగయ్య గూడా కందులే తీసుకొచ్చేడు. భీముడ్ని చూసి దగ్గరకొచ్చి,

"కందులు రేటేటి పడిపోనాదంట్రను... పట్నం సావుకార్లు?" అనడిగేడు. ఆ మాటకు భీముడు,

"యేటి సెప్తాం? ఆళ్లిట్టం! ఆళ్లు రేటు పడిపోయిందర్రా అనంతే పడిపోయినట్టే! ఎవులు కాదనగల్రు?" అన్నాడు.

"అదికాదు, కార్పరేసనోల్లు ఎక్కువిత్తారేటో?" అనడిగేడు మంగయ్య. కార్పొరేషన్వారు గవర్నమెంట్ ప్రకటించిన రేట్ల ప్రకారమూ కొనుగోలు చేస్తారుగదా అన్న ఆశతో!

"ఆళ్లా? ఆళ్లు పెద్ద సావుకార్లు! దొంగతూక




మేసి, దొంగ లెక్కలు రాసీ సావుకార్లే నయం అనిపించేస్తారు'' అని కార్పొరేషన్ వాళ్లవలన లాభంలేదని చెప్పాడు భీముడు.

వీళ్లిద్దరూ ఇలా మాట్లాడుకుంటుండగా, రావాడ కంచియ్య అటువేపు వచ్చేడు. రావాడ కంచియ్యను అందరూ "కామ్రేడూ'' అని పిలుస్తారు, పేరు పెట్టి ఎవరూ పిలవరు. ఆయన పేరు మర్చిపోయేరంతా! కంచియ్య ఆనాటి పోరాటంలో గురువు వెనకాల నడిచేడు. పోరాటం స్తబ్దతకు గురయిన సమయంలో జైలుపాలయ్యాడు. ఎమర్జెన్సీ పోయేక జైలునుంచి విడుదలయివచ్చేడు. గురువుతో తిరిగినప్పటి అలవాటుతోనూ, జైల్లో తోటి రాజకీయఖైదీల సహచర్యంవలన కంచియ్య ఎవర్ని సంబోధించినా 'కామ్రేడ్' అని ఆరంభిస్తాడు. భార్యను పిల్చినా 'కామ్రేడూ' అని పిలుస్తాడు. ఆఖరికి పోలీస్‌స్టేషన్‌లో ఎస్సయితో మాట్లాడినప్పుడూ, "అది కాదు కామ్రేడో'' అని వాదిస్తాడు.

చేతిలో కరపత్రాల కట్టను పట్టుకొని వచ్చి భీముడ్నీ, మంగయ్యనూ కలిసి, చిరునవ్వు నవ్వుతూ,

"యేం కామ్రేడో ఆసూ కాపో? (కులసాయేనా?)" అని ఇద్దర్నీ పలకరించేడు.

భీముడు, కంచియ్య చేతిలో దొంతరను చూసి,

"కామ్రేడో ఏటా చేతిలోవి?" అనడిగేడు.

"కరపత్రాలు'' అని చెప్పి చేతిలో దొంతర లోంచి ఇద్దరికీ రెండు కరపత్రాలు తీసి యిచ్చేడు.

మంగయ్య కరపత్రాన్ని ఎగాదిగా చూసేడు. కరపత్రం తెల్లకాగితమ్మీద ఎరుపు రంగు అక్షరాలు ముద్రించబడివుంది. చదువు రానందున అయోమయంగా చూస్తూ కరపత్రాన్ని పట్టుకున్నాడు మంగయ్య. భీముడు పెద్ద పెద్ద అక్షరాలయితే కూడబలుక్కుని చదవగలడు. బంతి అక్షరాలనూ, గుణింతాలనూ నేర్పడం ఎంత మంచిదైందీ... అని ఆనందిస్తూ భీముడు పెద్ద అక్షరాలను కూడబలుక్కొని,

"గిరిజన రైతుల పంటలకు సరైన ధర చెల్లించాలి.

షాహుకార్ల, ప్రభుత్వాధికార్ల దోపిడీ నశించాలి'' అని కరపత్రం హెడ్డింగ్‌ను చదివేడు.

అది విన్న మంగయ్య మొహంలో ఆశ్చర్యం చోటుచేసుకుంది. భీముడు కరపత్రాన్ని చదవటం ఆపేసి ఆలోచనలో పడ్డాడు. రావాడ కంచియ్య భీమునితో,

"అంతా చదువు. బోల్డు విషయాలు చెప్పాడు కామ్రేడో! కొండ పంటల్ని సరయిన ధరకు కొనాలన్నారు. మన పంటల నిల్వ కోసం, మన ప్రాంతాల్లో గోడాములు కట్టాలన్నారు. కొండపంటలు ముడిసరుకుగా పనిచేజే పరిశ్రమలు ఈ ప్రాంతంలో పెట్టించాలన్నారు. ఫారెస్ట్ చట్టంలో తెస్తోన్న కొత్త కొత్త మార్పులు రద్దుకావాలన్నారు. ఆఫీసర్ల అవినీతీ, లంచగొండితనం నశించాలన్నారు. పోలీసుల దౌర్జన్యాలు ఇక సాగవన్నారు'' అని కరపత్రంలో వున్న విషయాలకంటే ఎక్కువగానే చేర్చి చెప్పుకుపోతున్నాడు.

మంగయ్యా, భీముడూ చెవులప్పగించి వింటున్నారు.

"ఒక్క ముక్కల చెప్తా, వినండైతే మన బతుకుల్ల దీపాలు ఎలిగించడంకి దిగినారను కోండి అన్నలు. ఆళు ఈ కరపత్రాలేసినారు. వొలసలంట మీటింగులెడతన్రు. ఇక మరి, మనం తెల్లబట్టలోడికీ, కాకీ బట్టలోడికీ భయపడిపోనక్కర్లేదు'' అని అన్నల గొప్పతనాన్ని చెప్పి, ఆఫీసర్లకూ, పోలీసులకూ మనం ఇక వొంగి వొంగీ దండాలు పెట్టక్కరలేదని చెప్పాడు. భీముడు ఆనందంగా చూస్తున్నాడు.

"ఉండండి కామ్రేడో. సంత అంతా కరపత్రాలు పంచాలి'' అని చెప్పి గబగబా వెళిపో

యేడు కంచియ్య.

మంగయ్యా, భీముడూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. ఇద్దరికీ మనసులో ఎన్నో ప్రశ్నలు?

తమ ముందరి తరంవారు చిందించిన రక్తం! అనుభవించిన భయంకర నిర్బంధం! అడవిలో ఆకు, ఆకూ రక్తంతో తడిసి, మొక్క, మొక్కా గజగజా వొణికింది. ఇంకా మాయని గాయం... నిన్నటి పోరాటం!

నేడు నిజంగా మా బతుకుల్ల దీపాల వెలుగొస్తాదా? గోచీగుడ్డల్తో, కరువుకాటకాల్తో ఆఫీసుల చుట్టూ తిరిగే దీనస్థితి పోతాదా? కరపత్రంల రాసినట్లుగ పంటలకి సరయిన రేట్లొస్తే, కార్పొరేషనోళ్లు కరెక్టుగా నడిస్తే, ఆఫీసర్ల లంచాలు మానిపోతే, ఫారెస్టోళ్ల, పోలీసోళ్ల దౌర్జన్యాలు నశించితే, సావుకారోడి దోపిడీ అంతమయితే, మా కష్టం అంతా మాకు దక్కితే, మా సంపద మా అనుభవంలోకొస్తే ఎంత బాగుణ్ణు! రానిస్తారా? మాకు దక్కనిస్తారా? రాచిరంపాన పెట్టరా? ఊరుకుంటారా? ఊరిమీదబడి నరకం సూపించరా? అదే భయం!

వెన్నుపూసలోంచి భయం గుండెల్లోకి చేరాక కరపత్రం బరువనిప్పించింది. మోయలేని దాన్ని మోస్తున్నట్లనిప్పించింది. చించి పారేయడమా? మనసొప్పుకోవడం లేదు. ఇంటికి వెళ్లి, బంతికిచ్చి, చదివించి ఆలోచించాలి- అనుకొని గబగబా కరపత్రాన్ని మడతలు పెట్టి మొలగుడ్డలో దాచేసాడు భీముడు.

మంగయ్య ఆలోచిస్తూ, అలాగే చేతిలోంచి జారవిడిచేసాడు కరపత్రాన్ని.

కరపత్రం చిరుగాలికి అలా, అలా యెగుర్తూ అటే వస్తోన్న పట్నం వ్యాపారి వాసుబాబు కాళ్లకు తగిలింది. వాసుబాబు వంగొని, కరపత్రం తీసి చూసేడు. నడుస్తోన్న పాదాలాగినాయి. కళ్లు, కరపత్రం వెంట పరుగులు దీసినయి. చివరి పేరా వాక్యాలు చదువుతుంటే ఒళ్లంతా చెమటలు పట్టేసింది, "సత్యం మాస్టారి చావుతో విప్లవం చావలేదని రుజువు చేస్తాం. సత్యమన్న వారసులం మేము'' అన్న పదాలు గుండెల్ని వణికించేయి. వాసుబాబు కరపత్రమంతా చదివేక, చుట్టూ చూసేడు. అంతా సందడి సందడిగా వుంది సంత! గోలగోల సంతగోల. గుంపులు గుంపులుగా జనాలు. అటూ ఇటూ తిరిగే గిరిజన్లు. అన్నలుగానీ, ఈ సంతలోనే వున్నారా?! అమ్మో, ఈ వ్యాపారానికి దండం! అని భయపడ్తూ, కరపత్రాన్ని జేబులో కుక్కేసి, జోరుగా అడుగులు వేయసాగేడు. బస్సెక్కి పట్నం పోవాలని!

వాసుబాబుని చూసిన మంగయ్య, భీముడ్ని వొదిలేసి వాసుబాబుకి ఎదురొచ్చి,

"నేస్తంబావూ! కసిన్ని కందులున్నాయి. నీ కోసిమే సూత్తన్ను. రా బావూ, కొలుసుకుందువ్'' అని పిలిచేడు.

మంగయ్యకీ, వాసుబాబుకీ మధ్య వ్యాపార లావాదేవిలు చాలా యేళ్లనించీ వున్నాయి. ఇద్దరి మధ్యా నేస్తరికమూ వుంది. వాసుబాబు పంట మదుపుకి అప్పులిస్తాడు మంగయ్యకి. మంగయ్యగానీ పట్నం వొస్తే ఇంట్లోకి పిలుస్తాడు. పంకా కింద కూర్చోమంటాడు. మజ్జిగ నీళ్లు తాగమనిస్తాడు. సినిమాకెల్లమని రూపాయి కాయితం చేతిలో పెడతాడు. ఆ మాత్రానికే పొంగిపోతాడు మంగయ్య! నేస్తం సేనా మంచోడు అనుకుంటాడు. అదే వాసుబాబు వలసకిగానీ వస్తే... వొంటికి బత్తెమిస్తాడు. కోడికోస్తాడు. పనసపండు పట్టుకెల్లమని ఇస్తాడు. అరటి గెల అమ్మగోరికిమ్మనిస్తాడు.

ఇద్దరి మధ్యా ఇలాంటి రాకా, పోకా వుంది. లావాదేవిలున్నాయి. అయినా వాసుబాబు మాత్రం నడక ఆపకుండానే,

"వొద్దొద్దు. నేనేటికొన్ను. పనుంది, బేగెలిపోవాల" అని చెప్పాడు మంగయ్యకు. అయినా మంగయ్య ఆయనను వొదలకుండా,




"అదేటిబావ్? అలగనేస్తావ్. నీ కోసంగదా సూస్తన్ను. నువ్వు కొనప్పోతె ఎలాగ మరి?" అని బ్రతిమాలేడు. ఈలోగా, భీముడు గూడా వచ్చి చేరాడు, తన కందులూ ఈ షావుకారికే అమ్మేద్దామని. వాసుబాబు చికాకుపడుతూ.

"ఎలాగేటీ అలాగే! నాలాగే మరొకలికి అమ్ముతావ్. నా కొద్దంతన్నానా? పట్నంల రేటు లేదు. నష్టంకి యాపారం చెయ్యలేను'' అని కసిరేశాడు మంగయ్యని.

"అదా సంగతి. మరలగన్రాదా? నువ్వు నష్టపోడమేల? నీకు కిట్టుబాటయిన రేటుకే తీసుకో! నాకు నమ్మకమయిన సావుకారివీ నా నేస్తానివీ గదా నువ్వు'' అని నచ్చజెప్పే ధోరణిలో అన్నాడు మంగయ్య.

"నువ్వలగే అంతావుగానీ, ఆళ్లో? ఆళ్లొప్పుకోవద్దూ?" అన్నాడు వాసుబాబు అనుమానంగా భీముడ్ని చూస్తూ.

"ఎవుళు బావ్?" అడిగేడు భీముడు.

"ఇదిగో... ఈళ్లూ'' అన్నాడు వాసుబాబు, జేబులోంచి కరపత్రాన్ని బయటికి తీసి చూపిస్తూ.

భీముడూ, మంగయ్యా గతుక్కుమన్నారు. ఇందుకా రాజుబాబు ఇంత గాభరాగా పారిపోతన్నాడు. ఇంతకీ ఈ బాబు భయంతోటి పారిపోతండా? పోలీసోళ్ళకి చెప్పడానికి పారిపోతండా- అన్న ప్రశ్నలు కలిగేయి భీముడిలో. ఇద్దరూ, ఆ కరపత్రం గురించి ఎరుగన్నివాళ్లలా మొహాలు పెట్టారు.

"ఎవుళు బావ్?" అనడిగేరు మళ్లీ కరపత్రంలోకి చూస్తూ!

వాసుబాబు ఇరువురి వంకా అనుమానంగా చూసేడు. వాళ్ల కళ్లల్లోకి చూసేడు. మంగయ్య, భీముడూ మొహాల్లో ఏ భావాన్నీ ప్రదర్శించలేదు. అయినా అనుమానం తీరక, ఈ కరపత్రంతో వీరిద్దరికీ ఎంతమేరకు సంబంధమున్నదో కూపీ లాగాలన్న ఆలోచన కలిగింది వాసుబాబుకి.

మళ్లీ అంతలోనే ఆలస్యంజేస్తే అన్నలుగానీ అలికిడి అయితే లేనిపోని ప్రమాదం అన్న భయమూ మరోవైపు కలుగుతోంది వాసుబాబుకి.

అయితే స్వతహాగా వాసుబాబు కాస్త ధైర్యం కలవాడు. రిస్కని చూసి పారిపోడు. లాభిస్తుందేమో అని ఎదుర్కోడానికి చూస్తాడు. వ్యాపారంలో ముందుకు పోవాలంటే ఆపాటి చొరవ వుండాలన్నది అతని థీరీ. రిస్క వున్నచోటనే లాభాలెక్కువొస్తాయని నమ్ముతాడు.

ప్రొహిబిషన్ రోజుల్లో నాటుసారా వండించి అమ్మేవాడు. ప్రొహిబిషన్ ఎత్తేశాక ఫారెస్టుమీద పడ్డాడు. టేకు, గుగ్గిలం దూలాలను అడవినుంచి మాయం జేసేవాడు. ఆ తర్వాత అలా వలసమీద పడ్డాడు. అప్పాసప్పులిచ్చేడు. కొండ పంటల్ని లాగేడు. కొండల్లో ఎదురులేని వ్యాపారి అయినాడు. పట్నంలో హొటళ్లకు పాలు అమ్ముకుబతికే శ్రీనివాసు ఇలా రిస్క వ్యాపారాలు చేసి వాసుబాబుగా ఎదిగేడు.

వాసుబాబుగా ఎదిగిన రోజుల్లోనే కొండల్లో ఎర్రజెండాలు ఎగిరేయి. వడ్డీవ్యాపారుల మీద కమ్యూనిస్టుల దాడులు జరిగేయి. సంతలలో కమ్యూనిస్టు కార్యకర్తలు దగ్గర వుండి గిరిజన్ల పంటల్ని తూనికలనుంచీ ధరల చెల్లింపుదాకా మోసం జరక్కుండా చూసేవారు. పట్నం సరుకుల్ని చవకధరలకు అమ్మమనేవారు. గతంలోలాగా రూపాయికి రూపాయి లాభాలు పడేసుకునే అవకాశం లేకుండా చేశారు పార్టీవారు. చాలామంది వ్యాపార్లు సంతల వ్యాపారానికి దండం పెట్టేశారు. వాసుబాబు మాత్రం మానలేదు సరికదా, వలసల్లోకి వచ్చేవాడు.

"మీరు అన్నిటికీ పట్నం రాగల్రా? మాటిమాటికీ పల్లానికి దిగగల్రా? దిగలేరు. అలాగని అవుసిరిమైన సరుకుల్లేకండ బతగ్గల్రా? బతకలేరు! మీకిబ్బంది వుండగూడదని, నా

కడుపుకీ ఇంత ఆధారంగా వుంటాదనీ, ఈ యాపారం చేస్తన్ను. మీ కొండా, కోనలకొస్త న్ను'' అనేవాడు వలసల్లో జనాలతో.

ఒక్కో వలసలో, ఒక్కో గిరిజనుడితో నేస్తరికం కట్టి వారి ద్వారా వ్యాపార లావాదే విలు నడిపేవాడు. వాళ్లతో మాట్లాడితే 'గిరి జన సంగం' వుండాలనేవాడు. 'గురువంటే ఎవుళు? దేవుడే' అనేవాడు. 'ఇంటికో పువ్వు- ఈశ్వరుడికో మాల' నా వాటాగా సంగానికి ఇదుంచండని చందా యిచ్చేవాడు.

ఆ రకంగా ఎఱ్ఱజెండా ఎగిరే రోజుల్లో, ఆయుధాల్తో అటు పోలీసులూ, ఇటు నక్సలై ట్లూ తిరిగే ఆ రిస్క్ రోజుల్లో వ్యాపారం చేసేవాడు! అయితే అది ఎంతకాలమో సాగ లేదు. ఇటు వలసల్లో గిరిజన్లూ, పార్టీ నాయ కులూ అనుమానించేవారు వాసుబాబుని. అటు ఏజన్సీ ముఖద్వారాలన్నిటా వెలసిన స్పెషల్ పోలీస్ అవుట్‌పోస్ట్‌లూ అనుమా నించేవి. ఏరోజు కారోజు ఎక్కడో ఒకచోట కాల్పులు జరిగేవి. రెండువైపులా మరణాలు సంభవించేవి. ఎవరిమీద ఎవరు, ఎప్పుడు కాల్పులు జరుపుతారో అన్న భయానక యు ద్ధవాతావరణం! అప్పుడు వొదులుకున్నాడు వలసల వ్యాపారాన్ని వాసుబాబు. యుద్ధం జరుగుతున్న నేలమీద వ్యాపారం నడవదు. యుద్ధభూమికి దూరంగా వుండి రెండు వర్గా లకీ ఆహారాన్నీ, ఆయుధాలనీ అమ్మటం లాభదాయకమైన వ్యాపారం!

గానీ, ఏ వర్గమూ ఆ అవకాశాన్నివ్వలేదు వాసుబాబుకి. వ్యాపారాన్ని పట్నానికి మార్చేసాడు. పట్నంలో వ్యాపారపోటీని తట్టుకోలేకపోయేడు. ప్రతిచోటా ఎదురు దె బ్బ తిన్నాడు. ఎందులో చేయిపెట్టినా... అసలు గూడా నష్టపోవాల్సి వచ్చేది. ఇక్కడ వ్యాపారానికి కావాల్సినవి, తెలివితేటలూ, సాహసమూ కాదు, పరిమితి లేని పెట్టుబడీ, పరిస్థితుల్ని అనుకూలంగా మార్చే అవకాశా లూ ముఖ్యం అని గ్రహించేడు. అవకాశాలు వొట్టినే రావు. అవకాశాన్ని కొనగలిగేవాళ్లు తనకంటే శక్తివంతంగా పట్నంలో వున్నారు. ఇక మరి పనికి రాదు. మన చేయిఇక్కడ ఆడదు అన్న నిశ్చయానికొచ్చేసరికి ఐదేళ్లు పట్టింది. ఆ తర్వాత పట్నంలో రియల్ ఎస్టేట్ వ్యాపారంలో దిగి, కాస్తో కూస్తో వెనకేసుకోగలిగేడు. అయిదేళ్లు రియల్ ఎస్టేట్ వ్యాపారం సాగింది. కొండ వ్యా పారం ఆపేసి పదేళ్లయింది.

కొండల్లో మళ్లీ రోజులు మారేయి. పోరాటం ఆగిపోయింది. కొత్త కొత్త స్కీము లు, కొత్త కొత్త ఆఫీసులూ ఏజెన్సీకి దగ్గరగా వచ్చేయి. పాతతరం పోరాటనాయకులు... చనిపోయినోల్లు చనిపోగా మిగిలినవాళ్లు బలుసాకు తిని బతికేస్తున్నారు. పోలీసు కేంప్‌లు ఎత్తివేశారు. పూర్వ భయానక వాతా వరణం పోయింది. మళ్లీ వలసల్లో వ్యాపారా న్ని ఆరంభించేడు వాసుబాబు! ఇదిగో, ఈ అయిదారేళ్లకి మళ్లీ ఈ అలికిడి. అప్పుడూ అలాగే తొలిత కరపత్రాలేశారు. కరపత్రాలకి కదిలిపోద్దా, గవర్నమెంట్ అనుకున్నారు. ఊరేగింపులూ, ధర్నాలూ దీస్తే ఆళ్ల కాళ్లూ, ఆళ్ల నోళ్లేగదా పీకుతాయి అనుకున్నారు. ఆఖరికి పీకలుకోసి, ఉట్టిల్లో యేలాడగట్టిన ప్పుడుకి కళ్లు తెరిసింది గవర్నమెంట్! ఈ కరపత్రం గూడా అంతాదాకా దారి తీస్తదా? వాసుబాబు ఆలోచిస్తూనే,

"బాగా రాసేర్రా ఇందులో! మీ గురించే! మళ్లా పోరాడాలని చెప్పారు. కరక్టుగా చెప్పే రు కదర్రా?" ప్రశ్నించేడు భీముడ్నీ, మంగ య్యనీ.

"ఏమో బావ్' పొడిగా జవాబిచ్చేరు భీముడూ, మంగయ్యా.

"కందులూ, ఉలవలూ, కరక్కాయలూ... కొండ పంటలకి సరయిన ధర ఇవ్వాలని రాసేర్రా''

"ఏమో బావ్'

"కార్పొరేషన్ ద్వారా నిత్యావసర సరుకు




ల్ని గిరిజన్లకు చవకధరలకు అమ్మించాల న్నార్రా..."

"అదేమో బావ్..."

"పారెస్టోలు, పోలీసోలు, షావుకార్లూ... పాత రోజుల్నిగానీ, మర్చిపోతే మళ్లా అప్పటి లాగే సీకలు తెగ్గోసి గుమ్మాలకి వేలాడదీస్తా మన్నాడు. బాగా రాసేరు. ఎవుల్రా ఈళ్లు?"

"ఎవుళు బావ్?"

"యీ కరపత్రం యేసినోళ్లు?"

"యెవుళు బావ్?"

"మీరు చూడ్లేదా?"

"యేటి బావ్?"

"ఈ కరపత్రమేసినోల్ని చూడ్లేదా?"

"లేద్సూడ్లేదుగదా''

"మీకు తెలీదా?"

"తెల్దుగదా మళ్ల..."

"మరెక్కడిదిరా యిదీ?"

"నువ్వే గదా సూపినావ్ మళ్ల...! మాకేటి తెలుస్తాది''

ఇక మరి వీళ్లను అనుమానించటం తగ దని నిర్ణయానికొచ్చేడు వాసుబాబు. ఆ తరువాత మంగయ్యతో.

"వొస్తాన్రా. కందులు పట్నంల మా ఇంటికి పట్టుకొచ్చిరా. కొలిపించి, డబ్బిచ్చేస్తాను'' అని చెప్పేసి వాసుబాబు గబగబా వెళ్లిపోయేడు.

★ ★ ★

సంతలో ఆ తర్వాత జరిగిన భోగట్టాలను భీముడు గొప్ప ఉత్సాహంగా చెప్పసాగేడు బంతితో.

వాసుబాబు మంగయ్యతో అలా చెప్పి, గబగబా వెళ్లిపోతుంటే అప్పుడొచ్చేరట. తను ఊహించలేదట. గాభరా పడిపోయేడట.

అది ఆశ్చర్యమో, ఆనందమో భీముడిలో పెల్లుబుకుతోన్నది గ్రహించలేకపోతోంది బంతి. ఆమె మొహంలోకి చూస్తూ చెప్పుకొస్తున్నాడు భీముడు.

నలుగురొచ్చేరట. నలుగురి చేతుల్లోనూ తుపాకులున్నాయట. నినాదాలిచ్చుకుంటూ వొచ్చేరట అన్నలు. తుపాకులు గురిబెట్టి వాసుబాబుని తమతో అడవిలోకి తీసుకుపోయేరట.

గందరగోళంతో సంత ఎక్కడిదక్కడ విరిగిపోయిందట. దుకాణాలు వొదిలీసి సావుకార్లు పరుగో పరుగట. రావాడ కంచియ్య ఆ దుకాణాల్లోని సామాన్లని జనాలకు సంతర్పణ పెట్టేసేడట. అందరినోటా అన్నల మాటలేనట.

"ఇదిగో, ఇది చదువు బంతీ తెలుస్తాది'' అని మొలగుడ్డలో దాచిన కరపత్రాన్ని తీసిచ్చేడు భీముడు, బంతికి.

కరపత్రమంతా చదివేసరికి బంతి మనసులో ఎంతో ఉద్వేగభావన చోటు చేసుకుంది. అయితే అంతలోనే మళ్ళీ భయం ప్రవేశించింది.

తర్వాత ఏం జరుగుతుంది? పోలీసులు వలసలపై దాడులు చేస్తారా? వాసుబాబుని అన్నలుగానీ చంపేస్తారా? లేదా హెచ్చరించి వొదిలేస్తారా? రేపు ఏం జరుగుతుంది? ప్రశ్నలు ప్రశ్నలు... బంతి మనసును తొలుస్తున్నాయి.

భీముడు- ఇవేమీ ఆలోచించినట్లుగా లేదు. తన ధోరణిలో తాను కంతుడికీ, నాయినమ్మకీ ఈ విషయాలే వర్ణనల్తో వివరిస్తున్నాడు. కంతుడుకి ఈ భోగట్టా లాంటిదే గతంలోది గుర్తొచ్చింది. ఉత్సాహంతో ఆ ఘటనను భీముడికి చెప్పసాగేడు.

"నాయినా భీంవూ! అప్పుడు మంచి బలంమీద సంగం వున్న రోజుల్లా యిలాగే జరిగింది.

అప్పుడు సంతల్ల కాన్రమేలుండేవోళు. ఆ కాన్రమే దగ్గిరుండి మన పంటని తూకమే

యించి అమ్మించేవోడు. అలాగే మనం కొనుకున్నప్పుడూ సావుకారి తూకం రాయిని తనికీ జేసేవోడు కా్మే. రేటు గూడా కా్మే సెప్పిందే. అయితొకపాలేటయ్యిందీ. సంతలమీద గూండాలతోటీ, రెల్లోలతోటీ దాడులు జేయించటం ఆరంభించేరు సావుకార్లు, భూసాములు. తిరగ నక్సలైటోలు సంతలు దోసుకుంతన్రు. అని పెచారం జేసేవోళు. దీంతోటి, వొక మాసంరోజులు సంతలు ఎక్కడా జరగలేదు. ఎవులొచ్చేవోలుగాదు సంతలకి.

అయితే, బాకీ వుండిపోయిందని, ఎలగేనా ఇది గీకందులు సీజన్ల కందులు కొట్టుకుపోవాలని పల్లంనుండి సావుకారి నలుగురు మనుషుల్ని తోడుదెచ్చుకోని మన వొలసొచ్చేడు. అప్పుడు వొలసల ఎవులిమి అలికిడి లేదు. పోడుమీదున్నాము. పత్తిక బుధడు బాకీ వున్నాడని ఆడింటికెల్లాడు సావుకారి. బుధడింటిల ఆడితల్లి కళ్లు కనపడని ముసిల్ది వుంది. దాన్ని బెదిరించి, అదిరించి బుధడు అటుకుమీద దాచిన కందుల బస్తా దింపించడానికి ఇంటిల దూరేడు సావుకారి. ఆ ముసిల్ది ఏటి జేసిందీ? ఈ గంగడికిలగ్గాదని ఇంటికి ఇవతలకొచ్చి, తలుపు గొల్లేమేస్సి పోడుమీదకొచ్చి సెప్పింది. అప్పుడు గ్రేమకమిటీవోళ్లు ఏటి జేసారూ, గొడ్డళ్లు పట్టుకొని వొచ్చేరు. తలుపు తీసేరు. సావుకారిని పట్టుకెలిపోనారు పోడుమీదికి. ఆడితోటి వొచ్చిన నలుగుర్నీ తన్ని తగిలేసేరు. ఆ సావుకార్ని పట్టుకెలిపోయిన గ్రేమకమిటీవోళ్లు ఆ సావుకారిసేత వారంరోజులు పోడుపంట, కందిసేను కొట్టడం, పసుపు దుంపలు తవ్వడం చెయ్యించేరు. వారంరోజులు సావుకారిసేత పనిచెయ్యించేరు. అదిగలగ ఈ వాసుబాబుకి సేస్తారేటి అన్నలు?" అనడిగేడు. అలా చేస్తే బాగుణ్ణు అన్న భావన వుంది కంఠుడి కంఠస్వరంలో.

బంతికి మాత్రం ఎందుకో నీరసం ఆవహించింది. భయంతో గుండె చల్లబడింది. ఈ ఘటన తాలూకా మలుపు గురించి ఆందోళన పడ్తోంది బంతి.

ఆ సాయంత్రానికి మరో వార్త అందింది. పోలీసులు గ్రామాలమీద దాడులు చేయటం లేదుగానీ, ఒక మేస్టారినీ, వొక రైతునీ పోలీసులు పట్టుకపోయేరట, వాళ్ల ఇళ్లమీద దాడి జేసి.

ఆ ఇద్దరూ పౌరహక్కుల సంఘాల జిల్లా బాధ్యులు. గ్రామాలలో ప్రజలపై జరుగుతోన్న అక్రమాల గురించి వీరు ప్రశ్నించటం, పౌరహక్కులపై దాడి జరిగితే ఖండించటం చేస్తుంటారు. కూలిరేట్ల కోసం భూమిపట్టాల కోసం భూస్వాముల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ఆ ప్రాంతంలో సాగే ప్రజా ఉద్యమాల్ని వీళ్లుసమర్ధించడంవలన పోలీసులు వీళ్లను ఆ ఉద్యమాన్ని నడిపేవాళ్లుగానే భావించటం ఆరంభించేరు. ఉద్యమ నాయకత్వంమీద చేయదలిచే దాడికి, ముందు గురయ్యేది ఈ పౌరహక్కులవాళ్లే... ఈ ప్రాంతంలో.

పోలీసులు పౌరహక్కులవార్ని పట్టుకుపోయేక వారిచేత అన్నలకు ప్రకటన యిప్పించేరు వాసుబాబుని వొదిలేయమని!

ఈ ప్రకటన ఫలితమో లేదా అన్నలే కేవలం వాసుబాబుని హెచ్చరించటానికి తీసుకువెళ్లారో- మొత్తమ్మీద ఆ మర్నాడు సాయంత్రానికి వాసుబాబుని అన్నలు విడిచిపెట్టేసారు.

"హమ్మయ్య..." ఊపిరి పీల్చుకుంది బంతి. ఎంత తొందరగా ఈ సంఘటనకు ముగింపు జరుగుతుందా అని యెదురు చూసిందేమో... వాసుబాబు విడుదల వార్త వినటంతో ఆమెలో ఆందోళన తగ్గింది.

అయితే ఆరోజునుంచీ యిలాంటి ఘటనల గురించి సంభాషణ రోజూ జరిగేది యింట్లో. భీముడు యెక్కడెక్కడనో సేకరించి అన్నల కదలికలమీద వార్తలను కాస్త మసాలా పూసి హుషారుగా చెప్పేవాడు.




కంతుడు... గత పోరాట ఘటనల్తో వీటిని సరిపోల్చుకునేవాడు. నాయనమ్మ కన్నకొడుకుని తలుచుకు మౌనంగా దేన్నో చూస్తూ కూర్చొనేది.

రోజూ... గంటల తరబడి యింట్లో విని పించే ఈ గత, వర్తమాన ఘటనలపట్ల బంతికి ఆసక్తి లేకపోయినా ఏదో క్షణాన శ్రోత అయ్యేది. అప్పుడు మాత్రం... పాలుదాగే పసితనంలో తనను తాతయ్యకు అప్పగించి ఆశయసాధనకు అడివిలోకి నడిచిన తన తల్లి గుర్తువచ్చేది. చనిపోయిందో, బతికి వుందో, బయట వున్నదో, జైలులో వుందో ఏమీ తెలీదు! 'తల్లీ... నీ బిడ్డని బతికున్నాను. నాకు నీ రూపం తెలీదు. నీకూ నా రూపం తెలీదు! అమ్మా... నిన్ను చూసే భాగ్యం ఉందా నాకీ జన్మలో?' అని మనసులోనే కుమిలిపోయేది బంతి! తల్లిపట్ల అనంత ప్రేమ నింపుకున్న బంతికి తల్లి మార్గంపట్ల యింకా అవగాహన ఏర్పడలేదు. ఆ మార్గం గురించి ఆలోచించనూ లేదు. 'గుర్తు తెలీని మహిళా తీవ్రవాది మరణం' అన్న వార్త రేడియోలో విన్నపుడు, పత్రికల్లో చదివినపుడూ బంతికి గుండెల్లో దేవినట్లుంటుంది!

★ ★ ★

సెకండ్ సాటర్‌డే సెలవు గనక ఆరోజు యింటిలోనే వుంది బంతి! పీవోగారు రమ్మన్నారని ఐటిడిఏ ఆఫీస్‌నుంచి మెసెంజర్ వచ్చి చెప్పాడు. బహుశా ఆరోజు జీడిమొక్కల స్కీం డబ్బు గురించి పీవోగార్ని కలిసేంకదా దాని గురించి ఏదో దారి చూపిస్తారేమో పీవోగారని భీముడు ఆశపడ్డాడు. ఎందుకు రమ్మన్నారా? అని ఆలోచిస్తూనే పార్వతీపురం బయల్దేరింది బంతి.

బంతి వెళ్లేసరికి ప్రాజెక్ట్ ఆఫీసర్ ఆఫీస్ కొత్తగా కన్పిస్తోంది. గేటు దగ్గర సాయుధ పోలీస్ చెక్‌పోస్ట్ పెట్టారు. ఇదేమిటీ కొత్తగా ఈ ఏర్పాటు? అనుకుంటూ, గేటుదాటి లోనకొస్తే పీవోగారి రూము ముందరి వరండాలో సాయుధ పోలీసుల గస్తీ! ఎందుకో అర్థంకాలేదు! ఎప్పుడూ ఏవో కబుర్లాడుకోవటం, టీలు తాగటం, సీట్లలోంచి లేచి తిరగటంతో గడిపేసే సిబ్బంది... ఎవరి సీట్లోవాళ్లు సిన్సియర్‌గా పనిచేసుకుంటున్నారు! ఎవరో పెద్ద ఆఫీసరో లేదా మంత్రిగారో విజిట్‌కి వస్తున్నారేమో అనుకుంది బంతి వాతావరణాన్ని చూసి! పీవోగారికి యింటర్వ్యూ కోసం స్లిప్ పంపించింది.

ఓ క్షణం తర్వాత పీవోగార్నుండి పిలుపు వచ్చింది. లోనికి వెళ్లింది. పీవోగారూ, వారి యెదుటి కుర్చీలో డిటిడబ్ల్యూగారూ యిద్దరే వున్నారు. "నమస్తేసార్' నమస్కరించింది బంతి!

పీవోగారు తల ఊపి ఊరుకున్నారు. డిటిడబ్ల్యు గారు బంతివైపు దీర్ఘంగా చూసేరు.

ఇద్దరు అధికార్లూ ఈమధ్యే బదిలీ అయి, యిక్కడికొచ్చేరు. బంతి ఇదే చూడడంవార్ని! పీవోగారు తెల్లగా, లావుగా ఏభయ్యేళ్లు దాటేయేమో... ఆరముగ్గిన దోసపండులా వుంటారు. డిటీడబ్ల్యూ గారు సెనగపప్పు బస్తాలో పనసపళ్లు నింపితే ఎలా వుంటుందో, చాలని కుర్చీలో అలా వున్నారు.

డిటీడబ్ల్యూగారు ఒక ఫైలులోంచి ఒక లెటర్‌తీసి యిది చదువు అని యిచ్చేరు. బంతి ఆ లెటర్ అందుకొని చదవసాగింది.

హెచ్చరిక

"ఏజెన్సీలో ప్రజలకు సేవ చేయాల్సిన ప్రభుత్వ కార్యాలయాలు ఏవీ ప్రజలకు సేవ చేయటంలేదు. మీ ఐటిడిఏ కార్యాలయము గూడా యిందుకు మినహాయింపుకాదు. బ్యాంకులు ఋణాలు యివ్వటంలేదు. ఆస్పత్రుల్లో మందులు వుండడంలేదు, డాక్టర్లు రావడంలేదు. స్కూళ్లకు టీచర్లు రావటంలేదు. ఏ సంస్థ గూడా సక్రమంగా పనిచేయటంలేదు. వీటన్నిటినీ సక్రమంగా పనిచేయించాలనీ, ప్రజల జీవితాలు మెరుగు కావా

లనీ ఉద్యమాలు నిర్మిస్తూ ప్రజలకోసం అంకితమైన మా విప్లవకారులను పోలీసులు దొంగ ఎదురుకాల్పుల్లో చంపుతున్నారు. ఈ రకమైన బూటకపు ఎన్‌కౌంటర్లకు నిరసనగా మొండెంఖల్‌లో బ్యాంక్‌ని, యితర సంస్థల కార్యాలయాల్నీ దగ్ధం చేయాలని నిర్ణయించేం ఖబర్దార్!

-రాడికల్స్!"

అదీ ఆ లెటర్‌లో వున్న విషయం! బంతికేమీ బోధపడడంలేదు. రాడికల్స్ యేవిటి? హెచ్చరిక ఏమిటీ? ఆ లేఖ తనను చదవమనటం ఏవిటి? ఇది చదివించటానికే పిలిపించారా? ప్రశ్నలు!

"ఆమధ్య మీ స్కూల్‌కి ఇన్స్‌పెక్షన్ కొచ్చేను. నువ్వు ఆరోజు స్కూల్‌కి రాలేదు. ఆబ్సెంట్' అన్నారు డిటీడబ్ల్యూగారు!

ఆయన ఏకవచనంలో సంబోధించటం గమనించింది బంతి! కొత్తవారు గబాల్న ఏకవచనంలో సంభోదన చేస్తే వెంటనే వారి సంస్కారాన్ని కొలతలు దీయటం ఆరంభిస్తుంది ఆమె మనసు! ఎందుకో ఆయనపట్ల సదభిప్రాయం కలగలేదు. గౌరవభావమూ ఏర్పడలేదు. ఆయన చెప్పిన విషయం ఆలోచించసాగింది. బంతి మెటర్నిటీ లీవు తర్వాత ఆబ్సెంట్ అయ్యింది ఒక్కరోజే! ఆరోజు బ్యాంకుకీ, పాతపీవోగార్ని కలవడానికీ పీవో ఆఫీసుకి వెళ్లింది. 'పోడు పునరావాసం' స్కీం డబ్బును గేదెల లోన్స్‌కి జమజేస్తున్నారని భీముడు చెప్తే ఆ మర్నాడు బ్యాంక్ మేనేజర్నీ, పీవోగార్నీ కలిసి న్యాయం చేయమని కోరడానికి వచ్చినరోజే! ఆబ్సెంట్ అయిన రోజు అదే! ఆ విషయమే చెప్పింది డిటీడబ్ల్యూగారికి.

"నువ్వు టీచరువా? లీడరువా?" కోపగించేరు డిటిడబ్ల్యూగారు.

సరిగ్గా యిదేవిధంగా ఆ రోజుల్లో సత్యం మేస్టార్ని ఓ విద్యాశాఖాధికారి అడిగేరుట! అప్పటికి సత్యం మాస్టారు ఏజన్సీ స్కూల్లో సింగిల్ టీచర్. ఆ రోజుల్లో ఈ ఐటిడిఎ లేదు. సమితి ఆధ్వర్యంలో స్కూళ్లు నడిచేవి. స్కూల్‌కి టీచర్ వెళ్లకుండా సమితి రాజకీయాల్లో మునిగి తేల్తూవుంటే ఫరవాలేదు. స్కూల్‌కి వెళ్తేనే అనుమానించేవారు. ఆగ్రహించేవారు! పిల్లలకి చదువు నేర్పి, పెద్దలకి బతుకు గూర్చి చెప్పి... ఏజెన్సీ ప్రజల తలలో నాలుకైన సత్యం మేస్టార్ని "నువ్వు సింగిల్ స్కూల్ సింగిల్‌టీచర్‌వి! అలా సింగిల్‌గా వుండక, జనంతో మింగిల్ అవుతావేం?" అని ఓ విద్యాశాఖాధికారి ప్రశ్నించేడట కంఠుడు ఈ విషయం చెప్తుండేవాడు బంతితో.

మళ్లీ అదే భావంలో ప్రశ్న బంతికి యెదురైంది. ఆమె జవాబు చెప్పలేదు. మౌనంగా నిల్చుంది.

అప్పటిదాకా అంతా గమనిస్తూ అసహనంగా వున్న పీవోగారు జోక్యం చేసుకొని,

"లెటజ్ కమ్ టుది పాయింట్' అన్నారు డిటిడబ్ల్యూగారితో. అందుకు డిటిడబ్ల్యూ,

"ఎస్, యెస్! అదే, ఆ రోజే ఆ స్కూల్ టీచర్ ఒకాయన డౌట్ ఎక్స్‌ప్రెస్ చేశాడు. బట్ ఐ డోంట్ బిలీవ్డ్ యిట్. గానీ యీ కాషన్ లెటరొచ్చేక డౌట్ కలిగింది'' అని పీవోగారికి చెప్తూ, బంతివైపు డౌట్‌గా చూసేరు.

అప్పుడు అప్పటిదాకా డౌట్‌లో వున్న బంతి ప్రశ్నల కన్నింటికీ సమాధానం దొరికింది. నకిలీ వార్డెన్ పన్నిన వలయంగదా యిది అని తెలిసింది! సాక్ష్యాల్తోసహా వాడు కట్టుకథ అల్లాడు. చుట్టూ వల బిగించి బంతిని యిరికించేడు.

ఆ విషయమే చెప్పింది. ఈ హెచ్చరిక లేఖ అబద్ధమనీ, తను ఏ అన్నలనూ కలువలేదనీ నకిలీ వార్డెనూ, మరో టీచరూ కలిసి వేసిన అభాండమిది అని బంతి నిజాయితీ వుట్టిపడే స్వరంతో చెప్పింది.

"వాడికి ఏమిటి ప్రయోజనం నీమీద





అనవసర అభాండాలు వేయటంవలన?" అన్న లాజికల్ ప్రశ్న వేశారు డిటీడబ్ల్యూగారు.

ఆ ప్రశ్నకు ఏ జవాబు చెప్పగలదు? నకిలీ వార్డెన్ ప్రయోజనాల గూర్చి ఆమె నడిగితే ఏం చెప్పగలదు? వాడి శాడిస్టిక్ మనసుకి తృప్తి కలగొచ్చు. స్కూలుకి రెగ్యులర్‌గా టీచర్లు రావటానికి కారకులైన ఆనాటి సంక్షేమాధికారి మీద కక్ష తీర్చుకున్నారు. మిగిలిన వ్యక్తి బంతి! ఆమె మీదా కక్ష తీర్చుకోటానికి ఈ విధమైన కుట్ర పన్ని వుండొచ్చు. ఏదైనా ప్రయోజనం వాడికి నేరుగా లేకపోవచ్చు, బంతికి నష్టం జరగడమే వాడి ప్రయోజనం కావచ్చు. అయినా విధ్వంసానికీ, విద్వేషానికీ వెనకగల ప్రయోజనాలను వెదకటమంత వెర్రితనం మరోటి వుంటుందా?

బంతి ఏమీ చెప్పకుండా నిల్చోవటంతో పీవోగారిలో అసహనం పెరుగుతున్నట్లే వుంది. కుర్చీలో అటూ యిటూ కదిలి ఆమెవేపు చూస్తూ,

"నువ్వింకా టెంపరరీ టీచర్‌వి. ఈ క్షణమే నిన్ను ఉద్యోగంలోంచి తొలగించవచ్చు. పోలీసుల వరకూ ఈ విషయాన్ని తీసుకెళ్తే.. నువ్వు జైలు పాలుగావల్సి రావచ్చు'' యిలా బంతికి జరుగబోయే ప్రమాదాలను వివరించసాగేరు.

అంతవరకూ నకిలీ వార్డెన్‌గాడి ప్రయోజనాల గురించి ఆలోచించిన బంతి మెదడు యిపుడు తనకు రాబోయే ప్రమాదాలను గురించి ఆలోచించసాగింది.

"నువ్వు మంచి సంగీత కళాకారిణివనీ, గిరిజనుల్లో పనిచేసి వార్ని విద్యావంతుల్ని చేస్తావనీ ఐటిడిఎ నీకు ఉద్యోగమిచ్చింది. గత ఆఫీసర్లు గూడా నీ గురించి మంచిగానే రిపోర్టులిచ్చేరు. అలాంటిది ఇప్పుడు డిటిడబ్ల్యూగారు చెప్తే నమ్మలేకపోయేను'' అన్నారు బంతి మీద సానుభూతితో.

"నేను గూడా నమ్మలేద్సార్. గానీ, యీ విడ వాళ్ల వలస జనాల్ని తీసుకుని బ్యాంక్‌కీ, యిక్కడకీ వచ్చిందని తెల్సాక..." అని మాటల్ని మింగేసారు డిటిడబ్ల్యూ గార్రు.

అంటే ఇద్దరూ ఏకాభిప్రాయానికొచ్చేశారన్న మాట! ఇద్దరూ ఈ లేఖకు కారణం తనే అని నమ్ముతున్నారన్న మాట!! గుండెలు దడదడా కొట్టుకున్నాయి బంతికి!

"ఆ పీవోగారికి యిష్యూ చెప్పారుగదా? ఆయన బదిలీపై వెళ్లిపోయాక నేను రావడం ఆలస్యమైంది. ఇంతలోనే ఏం కొంపలు మునిగిపోయేయి? రాడికల్స్ వరకూ యెందుకు తీసుకెళ్లావ్?" అని, అడగదలచుకున్న అసలు ప్రశ్న అడగనే అడిగేరు పీవోగారు.

ఏం జవాబు చెప్పను? ఒక సాధారణ సమస్యను బాధితుల తరపున అధికార్లకు విన్నవించిన నేరానికి యెంతటి విషమస్థితి వచ్చింది? ఎవరు దీనికి బాధ్యులు? నకిలీ వార్డెనా? సస్పెండైన టీచరా? ఏజెన్సీలో అడుగిడిన అన్నలా? అసలింతకీ ఆ లేఖ అన్నలు రాసినదేనా?

బంతి పరిపరివిధాల ఆలోచిస్తోంది. ఆలోచనల్లోంచి తేరుకొని, "కాదు ఆ లేఖ అబద్ధపు లేఖ..." అని స్థిరంగా, నమ్మకంగా చెప్పింది బంతి.

"లేఖ అబద్ధమో, నిజమో గానీ ప్రొటెక్టివ్ మెజర్స్ తీసుకోక తప్పదుగదా'' అన్నారు పీవోగారు. ఆఫీస్‌కి యేర్పాటు చేసిన పోలీస్ రక్షణ గురించే ఆ మాట అన్నారనుకుంది బంతి! కానీ తర్వాత వారు అన్న మాటల బట్టి ప్రొటెక్టివ్ మెజర్స్ బంతిపైన గూడా ప్రయోగించారని అర్థమైంది.

"మా ప్రొసీజర్స్‌ని మేము ఫాలోగావాలి. ఈ విషయాన్ని పోలీసులకు పొక్కకుండా మూడగలం. బట్ ఉయ్ కాన్ట్ కంటిన్యూ యూ యాజె టీచర్! నిన్ను టెర్మినేట్ చేస్తున్నాం" అని చెప్పారు చల్లగా చావుకబు

రు డిటిడబ్ల్యూగారు! అదీ, సహాయం చేస్తు న్నాం అన్న తీరులో చెప్పారు.

బంతికి కళ్లవెంబడి నీళ్లు ఉబికి వచ్చేయి. పీవో గారు ఫైల్ మూసేసేరు, యింతటితో వ్యవహారం ముగిసింది, యిక బంతిని వెళ్ల మన్నట్లుగా!

బంతి యేమీ పాలుపోక దీర్ఘంగా ఆలోచి స్తూ అన్యమనస్కంగా యింటికి చేరింది... ఒక దుర్మార్గుని బాణానికి బలయిపోయిన పక్షిలా.

జరిగిన వ్యవహారం యింట్లో యెవరికీ చెప్పలేదు బంతి. భీముడికి గానీ, యీ విషయం తెలిస్తే చాలా ప్రమాదం అని భయపడింది. అసలే ఆవేశపరుడు! ఆవే శంలో ఆ నకిలీ వార్డెన్నో, ఆ టీచర్నో కొడతాడు. మళ్లీ అదో గొడవవుతుంది. భీము డికి చెప్పకపోవటమే మంచిదని నిశ్చ యించుకుంది.

ఐటిడిఏ సంస్థలో ఫండ్స్ ఖర్చయిపోయే యనీ, టెంపరరీ టీచర్ గనుక తనను ఉద్యోగంలోంచి తొలగించేరనీ, ఫండ్స్ వచ్చేక మళ్లీ తనకు ఉద్యోగమిస్తారనీ యింట్లో చెప్పింది. భీముణ్ని నమ్మించింది.

నెల రోజులు గడిచేయి. బంతి యింట్లో దిగులుగా గడిపేది. మరో నెల గడిచింది. ఆ అబద్ధపు లేఖలో హెచ్చరించినట్లుగా ఏ ఉప ద్రవమూ జరుగలేదు. బ్యాంకు దగ్ధమూ జరగలేదు, యే కార్యాలయానికీ యే ప్రమా దమూ జరగలేదు.

జరిగిన నష్టం బంతికే జరిగింది. ఉద్యోగం పోయింది.

ఆ లేఖ అబద్ధపులేఖ అనీ, ఎవరో కావా లని బంతిమీద కక్షతో సృష్టించిన లేఖ అనీ ఐటిడిఏ సంస్థలో అందరికీ అర్థమైంది. బంతి ఋజువు జేయాల్సిన అవసరంలేదు.

అయినా బంతి మళ్లీ ఉద్యోగం కోసం ఆ అధికార్ల దగ్గరకు వెళ్లలేదు. అనుమానపు చూపుల్తో అనునిత్యం పరీక్షించే ఆ అధికార్ల ను చేతులు చాచి ఉద్యోగాన్ని అర్థించదలచలే దు. ఇంట్లోనే నెలల పాప తన చిన్నారి బోసి నవ్వుతో బోర్లా పడి చేసే చిన్నారి చేష్టల కోసం మనసంతా పరుచుకు కాలం గడిపేది బంతి!

కొన్ని రోజులు ఈ దినచర్యలో బంతి తన వలసనంతట్నీ పరిశీలనజేసింది.

రోజంతా తను చిన్నారిని ఆడించు కుంటూ యింట్లో కూర్చుంటే వలసలోని ఆడవాళ్లు యింటిపన్లూ, పోడుమీద పనులూ చేస్తూ, క్షణం తీరికలేకుండా కన్పించేవారు. నిత్యం పనిజేసే యంత్రాల్లా కన్పించేవారు.

బంతి యిదంతా గమనించేక తనూ పనీపాటూ చేయదలచింది. చిన్నారి పాపను తాతయ్యకు అప్పగించి రెండురోజులు వరు సగా పోడు కొట్టడానికి వెళ్లింది. చేతులు బొబ్బలు దేరినయి. అన్నం కూడా కలుపు కొని తినలేకపోయింది.

రెండురోజులు విశ్రాంతి తీసుకొని, యీ సారి విప్పపువ్వు యేరి తేవటానికి అడవిలో కి వెళ్లింది. గానీ నడుము వంచి, విప్ప పువ్వు ఏరటంవలనా, యెండనబడి, గంపలో పువ్వు మోసుకురావటం వలనా నిస్సత్తువగా వాలిపోయేది బంతి యింటికొ చ్చేక. కనీసం పాపతోకూడా కబుర్లు చెప్పలే కపోయేది. భీముడు మందలించేవాడు. ఇంట్లోని పని చూసుకోసాలు. తెలీని దానివి.. పోడూ, అడవి పన్లేటి సెయ్యిగలవు. వొద్దనేవా డు భీముడు.

నిజానికి, సవర స్త్రీలు శ్రమ జీవులు. మగవాళ్లకంటే ఆడవాళ్లే ఎక్కువ కష్టపడతా రు.

పోడు కొట్టడం, కంకతో నేలను తవ్వటం, అడవిలో పళ్లూ, కాయలు ఏరుకు రావటం నుంచి యింట్లో వంట పనులదాకా సవరస్త్రీ లు యంత్రాల్లా చేసుకుపోతుంటారు.

కానీ బంతి చిన్న నాటినుండీ అల్లారు




ముద్దుగా పెరిగింది. తల్లీ తండ్రీ యిద్దరూ ఉద్యమంలోకి వెళ్ళిపోయినందున బంతిని ఊరి వారందరూ ముద్దుజేసేరు. సవరలకు ఎంతో యిష్టమయిన బంతిపువ్వులా వుండే దని బంతి అని పేరు పెట్టారు ఊరివాళ్లు. ఊరందరి ఊయలల్లోనూ బంతే ఊగేది. ఊరు, ఊరంతా బంతికి జోలపాడేది. అలా అల్లారు ముద్దుగా, అందరి ఒడిలో పెరిగిన బంతి ఆ తర్వాత చదువుకొనే యీడులో ఆశ్రమ పాఠశాల హాస్టల్‌లో చేరింది. స్కూలూ, హాస్టలూ, చదువూ, ఆటా పాటా తప్ప పోడూ, అడవీ పనులు తెలీకుండా పెరిగి పెద్దదయింది బంతి. శ్రమించటం అన్న విషయం తెలీకుండా పెరిగింది. శ్రమశక్తికి దూరమైంది.

బంతి యింట్లో పనీపాటూ లేక కూర్చుంటే ఆలోచనలు ముసురుకునేవి. అన్నింటినీ తర్కించుకొని పెంటకుప్పను కోళ్లు పొడిచినట్లు మెదడులో తర్క వితర్కాలు...

రెండునెలల తర్వాత, బంతి పనిజేసిన స్కూలు నుండి ఓ విద్యార్థి వచ్చేడు. కాసేపు అవీయివీ మాట్లాడి,

"అన్నలు మళ్లీ వచ్చేరు టీచర్ స్కూల్‌కి. టీచర్లు ఆ రోజు యెవరూరాలేదు. ఆ వార్డెనే వున్నాడు. అన్నలకీ తెల్సిందట, వాడు అసలు వార్డెను కాదని. వాడ్ని చిదగ్గొట్టేసి యీసారి స్కూల్లో టీచర్లు అందరూ వుండకపోతే, నువ్వుగానీ కనిపిస్తే చంపేస్తాం అని బెదిరించి, వెళ్లిపోయేరు మేడమ్.

ఆ దెబ్బకి ఆడేమో టీచర్లని లాక్కొచ్చేడు. టీచర్లు యిపుడు రోజూ స్కూలుకొస్తున్నారు. ఆ నకిలీ గాడేమో వంటపని చూస్తున్నాడు. ఇంతకు ముందు మా చేత వంట పాత్రలు తోమించటం, స్కూలు తుడిపించటం చేయించేవారా! యిపుడా పన్లు వాళ్లే చేసేసుకుంటున్నారు. అన్నలతోటి చెప్పేస్తామని భయం! ఇప్పుడు బాగుంది మేడం స్కూలు! మీరుంటే మరీ బాగుణ్ణు!" అన్నాడు సంతోషంగా ఆ కుర్రాడు.

బంతికి మాత్రం ఆ పిల్లాడిలో కలిగిన సంతోషం కలుగలేదు. అన్నల కారణంగా ఉద్యోగం పోయినందున నిరాసక్తంగా వుంది మరి అదే అన్నల కారణంగా స్కూల్ సక్రమంగా నడుస్తోంది! నకిలీ వార్డెన్‌కి సరైన శిక్షపడింది! మరి యివి సంతోషించదగ్గ విషయాలే గదా! కానీ ఎందుకు తనలో సంతోషం కలగటంలేదు. తనలో చేరిపోయిన వ్యక్తివాదమేనా దీనికి కారణం? అని తర్కించుకుంటోంది బంతి!

బంతికి తన ఉద్యోగమే సమస్య. దానినే ఆలోచిస్తోంది. అలాగే గిరిజనుల్లో చదువుకున్న వాళ్లూ మారిపోయేరు. ఇంతకుముందు వలసల్లో యిలా వుండేవిగావు జనం ఆలోచనలు! ఉమ్మడిగా సమస్యలొచ్చేవి. ఉమ్మడిగా ప్రతిస్పందించేవారు. పోడు పంటకి జంతు సమస్య ఎదురైనా, ఫారెస్ట్ ఆఫీసర్ల జులుం అయినా, భూమి సమస్య అయినా వలసంతటికీ సమిష్టిగా వుండేది. సమిష్టిగా వలస అందరూ ఎదుర్కొనేవారు. ఇపుడలా క్కాదు. ఒకరికి ఉద్యోగం పోవటం సమస్య. ఇంకొకరికి సబ్సిడీ స్కీం అందకపోవటం సమస్య. సంతోషమూ, విచారమూ సామూహికంగా అనుభవించే వీళ్లు ఎవరి పుణ్యమువల్లనో, ఈ రోజు ఎవరి బ్రాకెట్లలో వాళ్లే అనుభూతి పొందుతున్నారు.

ఇలా ఆలోచిస్తుంటే బదిలీ అయి వెళ్లిపోయిన ఆ డిటిడబ్ల్యూగారి మాట గుర్తొచ్చింది బంతికి.

"ఈ పునరావాసం, సంక్షేమం పేరుమీద మేమంతా మీ స్వచ్ఛమైన సవర సంస్కృతిని కల్తీ చేస్తున్నామేమో"

ఆ మాట నిజమేకదా!

సహజసిద్ధమైన నిండయిన అడవీ, కొండా వున్నాయి. టేకు, మద్ది, వేప, మామిడి, మద్ది మొదలైన రకరకాల కలపకు పనికొచ్చే వృక్షాలూ, ఔషధాలకు పనికొచ్చే

మొక్కలు, ఫలాలనిచ్చే చెట్లూ కోకొల్లలు.

కానీ వాట్ని నరికించేసి నర్సరీలను పెట్టి యూకలిప్టస్, పామ్ ఆయిల్, కాఫీ తోటలూ పెంచుతున్నారు. వ్యాపార మొక్కల్ని అంటుగడ్తున్నారు. అంటు గట్టిన హైబ్రీడ్ మొక్కల్లా యిపుడు గిరిజన వలసలు కోలనీ లుగా మారేయి! కోలనీలలోకీ రేడియోలు, టీవీలూ వచ్చేయి. మగాళ్ల పిలక జుత్తులు... క్రాపులయినాయి. ఆడోళ్లకు సిల్క్‌చీరా జాకె ట్టొచ్చేయి. వాటి మధ్యనే గోచీ గుడ్డల్తో, ఆకలి కడుపుల్తో, మిగిలిన దేహాలూ వున్నాయి.

దేన్ని చూసి అభివృద్ధిని లెక్కవెయ్యాలి? అసలు తాము అభివృద్ధి చెందుతున్నామా? అంటుగట్టిన మా మొక్కలు రూపు మారి యెదిగేయా? ఎదిగి ఎవరికి ఉపకరిస్తు న్నాయి? ప్రశ్నలు ప్రశ్నలు... బంతి మదిలో.

ఆమె ప్రశ్నార్థక మొహం చూసి ఆ విద్యార్థి నిరుత్సాహపడి పోయేడు. సరదాగా కబుర్లు చెప్పబోతున్నవాడు ఆపేశాడు. బంతి వైపే ఓ క్షణం చూసి,

"నేనిక వెళ్తాను మేడం" అని చెప్పి లేచాడు. గడపదిగి వెళ్లబోయి ఆగి, మళ్లీ వెనక్కి వచ్చి,

"అమ్మగారూ ఆరోజు అన్నల్తోటి భీమన్న గూడా వచ్చేడు'' అని చెప్పాడు. ఆ కబురు తప్పకుండా బంతిని ఆనందింపచేస్తుందని అనుకున్నాడేమో! ఆశగా ఆమెవైపు చూసి నిరాశగా వెళ్లిపోయేడు.

ఆ అబ్బాయి చెప్పిన కబురుతో బంతి గుండెలు ఒక్కసారిగా వేగంగా కొట్టుకోసా గాయి. వెన్నుపూసలోంచి భయం జరజరా పాకి మెదడుమీద దాడిచేసింది. అలా భయంనిండిన గుండెల్తో ఒంట్లో బాగోలేక మంచంమీద పడుకున్న నాయనమ్మ దగ్గ రకు వెళ్లి అలా విచారంగా కూర్చుండిపో యింది చాలాసేపటివరకూ! ఎడతెగని ఆలో చనలూ, భయాలూ... ముసురుకున్నాయి బంతి మనసులో.

తన దేవుడు... భీముడు! తనదగ్గర కూడా విషయాలను దాస్తున్నాడా? భీము డు... అన్నల్తో తిరుగుతున్నాడా? ఆ విషయం తనతో ఎందుకు చెప్పలేదు? తన ను నమ్మటంలేదా? లేదా, అలా అన్నల్తో కలిసి తిరగొద్దని తను ఆటంకపరుస్తానని అనుమానిస్తున్నాడా? ప్రశ్నలు... ప్రశ్నలు! పరిపరివిధాల తర్కవితర్కాలు... అన్నింటి కీ మించి మరోప్రశ్న-

'ఇంతకీ నేను భీముడు అన్నల్తో తిరగడా న్ని వ్యతిరేకిస్తానా? ఆమోదిస్తానా?' తనను తనే సూటిగా ప్రశ్నించుకుంది బంతి.

ఎందరో ఒరిగిపోయారు. తల్లీదండ్రీ... ఉద్యమానికే అంకితమయ్యేరు. ఇపుడు పునరావాసం యాతనలో అందరూ పరాయీ కరణకు గురవుతున్నారు.

మళ్లీ ఏ పోరాటానికి... ఏ నెత్తురు పోయాలి?

నాలుగు కాలాలపాటు భీముడ్ని చల్లగా చూడమని దేవతలందరికీ మొక్కుకుంది బంతి!

★ ★ ★

మరికొన్ని నెలలు గడిచాయి. బంతి ఆలోచ నల్లోనే పొద్దు గడిపేది. 'చిన్నారి' లేచి నిలబడుతోంది. చిన్ని చిన్ని అడుగులు వే స్తోంది. ఇంటి పంచలో యిటూ అటూ పడుతూలేస్తూ తిరుగుతోంది. నాయినమ్మా, జూజూలకు చిన్నారే పంచప్రాణాలయింది. నిత్యమూ చిన్నారిని ఆడించటమే వారికి సరదా! భీముడుమాత్రం యిందుకు భిన్నంగా వుంటున్నాడు. ఇంతకుముందులా గా ఇంట్లో అన్ని విషయాల గురించీ చర్చించటంలేదు. అపుడపుడూ అడిగే ప్రశ్న లకే జవాబులు చెప్తున్నాడు బంతికి. అంతకు మించి మాటల్లేవు. ఇంట్లో కూడా ఎక్కువగా వుండటంలేదు. ఎటో వెళ్లి వస్తుంటాడు.




బంతి గుండెల్లో ఆందోళనతో యిదంతా గమనిస్తోంది.

ఓరోజు ఉదయం ఆరూ యేడుగంటల మధ్యవేళ! బంతి పొరుగింటివాడు లక్కాయ్ ఆందోళనగా పరుగెత్తుకుంటూ వచ్చేడు ఎక్కడినుండో! బంతి యింటిదగ్గరకొచ్చి ఆయాసంగా నిల్చున్నాడు.

గడపలో కంతుడు మనవరాలి కూతురు చిన్నారిని ఆడించుకుంటున్నాడు. లక్కాయ్ ఆందోళనగా రావటం చూసి చిన్నారిని చంకకు ఎత్తుకొని లేచి నిల్చుని లక్కాయ్‌దగ్గరకొచ్చి-

"ఏఁవిరా? యేటయ్యింది? అంత గాభరాగున్నావేటి?" అని అడిగాడు కంతుడు.

"... మన... మన గెడ్డపొలంల యేళ్లు బూసి, ఆళ్లు ఆ జెగ్గారావు మనుషులు దుక్కి దున్నేస్తంద్రు..." ఆవేశంగా చెప్పాడు లక్కాయ్.

"అదేటదీ? ఆడు దున్నీడమేటీ? రికార్డులు సూసి, తేల్సి సెప్పీదాకా యెవుళూ గెడ్డపొలంల దిగగూడదన్నాడుగా‌దేటి పీవో? మరి, యిదేటి మళ్లా?" ఆశ్చర్యపోయేడు కంతుడు.

లక్కాయ్ ఆవేశం తగ్గలేదు. మొహం అంతా ఉద్రేకంతో రక్తనాళాలు పొంగి మొహం ఎఱ్రబడింది. మనిషి కోపంతో ఊగిపోతూ-

"దున్నీడా? మనం పల్లక వుండిపోతే ఆడికి సలుపేటి? మన గెడ్డపొలమేటి... మన వొలసనీ దున్నేస్తాడు..." అని అంటూ గబగబా యింట్లోకి వెళ్లి గండ్రగొడ్డలి పట్టుకు వచ్చేడు ఆవేశంగా!

కంతుడు కూడా మరి కిందూ మీదూ ఆలోచించలేదు. చిన్నారిని అరుగుమీద దించేసి ఇంట్లోకెళ్లి మూలనున్న దుడ్డుకఱ్ఱ తీసి పట్టుకువచ్చేడు.

బంతికి భయంతో గుండెలు వేగంగా కొట్టుకోసాగేయి. ఏఁవిటి చెయ్యడమో అర్థంకాలేదు. భీముడు రెండురోజులుగా ఇంట్లో లేడు, ఎటో వెళ్లాడు. వీళ్లు కొట్లాటకు పరుగెడితే ఏం జరుగుతుందో? ఎటునుంచి ఏమొస్తుందో ఆందోళన పడసాగింది.

కోపంతో కొట్లాటకు బయల్దేరిన తాతయ్యకీ, లక్కాయ్‌కీ ఎదురుగా వెళ్లి నిల్చుంది ఆగమన్నట్లుగా! నిల్చుని-

"ఆవేశపడితే లాభముండదు. గొడ్డో... అంటే దుడ్డు అందుకోడమేనా? కొట్టాడుకుంతే ఎవళికి నష్టం? ఇంతకీ యెవుళ్లోని కొట్లాడుతారు? ఆ జగ్గారావు రాడుగదా కొట్లాటకి? ఆడి తరుపు కూలికి వచ్చిన మనుషుల్ని దింపుతాడు. మీరు కొట్లాడుకుంటే మీకో ఆ కూలి మనుషులకో దెబ్బలు తగుల్తాయి. అసలు మనిషి ఆ జగ్గారావు మాత్రం హాయిగా వుంటాడు. ఆ తరాత మీమీద పోలీసుకేసు పెడతాడు. జెయిల్లబెట్టిస్తాడు. కోర్టులసుట్టూ తిప్పుతాడు'' అని బంతి చెప్పుకొస్తోంది

"అయితే...? ఏటంతావ్? ఆడు కోర్టులంట తిప్పుతాడనీ, జెయిలుపాలు జేత్తాడనీ.., వొల్లకోమంతావా? నీ ఇంటిముంగటి నీ ఆస్తిని ఆడు జారావరీ జేస్తంటే... తోకముడిసి పారిపోతావా? ఆడికి బలముందని. బలగముందని... భయపడిపోవాలా? అదేన నువ్వు సెప్పింది? సేతగానోళ్లలాగా... సేతులు ముడుసుకోమనేనా... నువ్వన్నిది?" అడిగేడు లక్కాయ్ ఆవేశంగా... బంతిని.

బంతి, లక్కాయ్‌ని చూస్తూ అతన్ని వొప్పించే స్వరంతో-

"అదిగాదు... ఆవేశం తగ్గించుకు ఆలోచించండి. దుక్కి దున్నినంతమాత్రాన సరేనా? అయిపోయిందా? విత్తనాలెయ్యాలా? గాబులు దియ్యాలా? పండించాలా? పండిన పంటనతడు యింటికి పట్టుకెల్లాలా? ఇంత తతంగముందిగదా? ఈలోపు కొట్లాటకి దిగడమెందుకూ? ఎలాగూ పీవో చెప్పాడు, ఎవళూ పొలంల దిగొద్దని. పీవోకే చెపుదాం జగ్గారావు పీవో ఆర్డర్‌ని కాదనేసి పొలంల దిగినాడని! ఆయనే చట్టపరంగా జగ్గారావు




మీద చర్య తీసుకుంటాడు. ఆయనకి చెప్ప కుండా మనం కొట్లాటకు దిగటం మనకే మంచిదికాదు'' అని నచ్చచెప్పే ధోరణిలో చెప్పింది బంతి.

కంతుడు బంతివైపు దీర్ఘంగా చూశాడు. ఓ నిట్టూర్పు తీసేడు. భూమికి సంబంధించి జరిగిన కొట్లాటలు, కోర్టులు, జేళ్లు, రక్తతర్ప ణలు... యాదిలో కొస్తన్నాయి. ఇన్ని గాలీవో నల తరాత గూడా యింకా భూసమస్య... అలగే వుండిపోయినందుకు... ఆశ్చర్యపో వాలి ఎవరైనా... అని కంతుడు ఆలోచిస్తున్నా డా?

ఆలోచనలన్నింటిలోంచీ గెడ్డపాలం భూ సమస్య కదులాడి ముందుకొచ్చింది. కంతు డు బంతివైపు చూస్తూ-

"అమ్మా బంతీ! ఈ గెడ్డపాలం చెర్రిత నీకు తెల్దు. ఈ పొలం అలనాడెప్పుడో మా పెద్దలకాలంనాడు ఈ వొలసకి యీనాంకింది చ్చేరు సాలూరు జమీందారువారు! అపుడి కాంచీ యీ పొలాన్ని వొలస ఉమ్మడిగ సాగుజేసుకొస్తంది. ఉమ్మడి అవుసిరాలకి ఫలసాయాన్ని కర్సుబెట్టీవోరు. తరం తరాత తరం దీన్ని అలగ సాగు జేసుకొచ్చీది. మా తరంకి వొచ్చేసరికి అప్పుడప్పుడూ కొర్నుగా వుండి పోయిందీపొలం. ఒక్కో సంవచ్చరం సాగు అదునూ పదునుమీద అయిందికాదు. ఉమ్మడిసాగు అనేసరికి గెడ్డపొలం పని యె నకబడిపోయి, కార్తె దాటిపోయి అలాగ కొ ర్నుగ వొదిలీసోళ్లం.

అలగ కొర్నుండిపోతే యేటకేటా ఆ సత్తె య్య సావుకారి ఆడి మడిగట్లని దున్నీసి... గెడ్డపొలం కలుపుకొచ్చేవోడు కొద్దికొద్దిగా! కొసకేటి జేసేడూ! ఆడిభూమి సరిహద్దు కిందటే ఈ భూమి అన్నాడు. ఆడి జిరాయితీ పొలం అని సెప్పీవోడు. మీము కాదనేవోళ్లం. కొట్టుకున్నాం. కేసులు పడ్డాం. కోర్టులెక్కాం. సావుకారి మమ్మల్ని ముప్పుతిప్పలు బెట్టీవో డు. అయినా మీము బూమినొదల్లేదు. సావు కారి మామీద యేదో వొక కుతంత్రం జేసీవో డు.

అదిగప్పుడు సంగం మాకు దన్నుగ నిలబడింది. గురువుకి సెప్పినాం. సంగం... సత్తెయ్య సావుకార్ని యెచ్చరించింది. ఆడు లెక్కజెయ్యిలేదు. ఏటయ్యేడు...? సంగం చేతిల సచ్చిపోనాడు. గురువు యీ భూమిని వొలసకి అప్పగించినాడు.

ఆ తరాత యుద్ధం నడిసింది. గురువూ, గురువుతో పాటు నడిసినోళ్లమీదకి సీఆర్పీ, మిల్ట్రీ పోలీసులు దిగినారు. భూములు యుద్ధ భూఁవులయినాయి. అంతా అయిపోయింది.

ఇదిలాగ మన వొలస... యిదిగీ కోలనీకి మారిపోయింది. ఏటి జేసేడో, యేటయ్యిందో మరి కాంట్రాటు జెగ్గారావుతయారయి పోయిం దిపుడు.'గెడ్డపొలం' నాదంతాడు. రికార్డులు న్నాయంతాడు. కొనుకున్నానంతాడు. వారస త్వ హక్కుదారునంతాడు.

ఇప్పుడు నువ్వన్నట్టుగే మీము కొట్లాటకి యెళ్లీబదులు సర్కారువోరికి సెప్పుకుందుం అని బయల్దేరినం. పీవోగోరికి సెప్పినాం. కలకటేరుకి కలిసి కతంతా సెప్పినాం. ఎంపీ బాప్ కోటలోకీ యెల్లి సెప్పినాం! ఏట్లాబం? అందరూ కత యిన్నట్టుగ యినేసి యిదిగో "యెవురూ పొలంల దిగకండి మేం రికార్డు లు సూసి తేల్చేదాక" అని యింజక్షనిచ్చేరు.

ఆ యింజెక్సన్ని యీనెపుల్లలాగ తీసి అవతల పడీసి, ఆ జెగ్గారావు భూమి దున్ని స్తండు. ఇంకా పీవోకి సెప్తే మరేం సాయిం జేసెత్తాడమ్మా? ఆళ్లకిగానీ, ఆ జెగ్గారావుగ్గానీ యెవుళిగ్గానీ తెలన్ది యేటంతే... ఈ వొలసల పిట్టమనిసి బతికివున్నా యీ భూమిని వొద ల్డు. తరాలనుండొచ్చిన యీనాం యిలువ తెలిసినోడెవుడొప్పుకోడు'' అన్నాడు ధృ ఢంగా.

బంతి ఆశ్చర్యపోయింది. 'గెడ్డపొలం' భూమి వెనుక యింత కథ వుందని ఆమెకి తెలీదు. 'వలసలో పిట్టమనిషి బతికుండగా ఈ భూమినొదల్డు...' కంతుని మాటలు

తిరిగి తిరిగి విన్పిస్తున్నాయి. బంతికీ ఆ భూమిమీద మమకారం కలిగింది. అయితే భూమికోసం ఘర్షణ పడటానికి మాత్రం ఆమె మనసు అంగీకరించలేదు. అందుకనే-

"పీవోగారికి తెలియకుండానే జగ్గారావు పొలంలోకి దిగినాడేమో? అందుకని పీవో ఆఫీసుకి వెళ్దాం. పదండి నేనూ వొస్తాను. రిపోర్టు యిద్దాము. చట్టాన్ని ధిక్కరించినవాడిమీద చర్య తీసుకోండని చెప్పుదాం. వాళ్లు చర్య తీసుకుంటే మనం కొట్లాటకి దిగక్కరలేదుగదా'' అని బోధపర్చసాగింది.

కంతుడు ఆలోచనలో పడ్డాడు. లక్కాయ్... గంధ్రగొడ్డలి దించేశాడు. అప్పటికే వలసలోనివాళ్లు వొక్కొక్కరూ అలా అలా వచ్చి చేరారు. అందరూ బంతి మాట ప్రకారం పీవోకి రిపోర్టు చెయ్యడమే మంచిదన్నారు.

బంతి జనాలను తీసుకొని బయల్దేరింది పీవో ఆఫీసుకి. దోవ పొడుగునా కంతుడూ, లక్కాయీ, మరికొంతమందీ... బంతితో తమ భూములెలా దురాక్రమణలయినాయో చెప్పసాగేరు కథలు కథలుగా.

"మనోళ్లికెవులికీ సదువూ, సాముా తెలీదు గదమ్మా. సావుకార్లు బాకీల కిందనేమో... భూముల్ని క్రెయిం రాయించుకొనీవోరు. పోనీ, ఆ క్రెయిం పత్రమేనా సరిగ్గా రాసేవోరా? అంటే... లేదు! భూంవులు సరిహద్దులు మారిసీవోరు'' చెప్తున్నాడు కంతుడు.

బంతి శ్రద్ధగా వింటూ నడుస్తోంది. లక్కాయి అందుకొన్నాడు-

"యిప్పుడు నీకు తెల్సుగదా? మీ యిప్పమాను గుడ్డి వుందనుకో. దాన్ని క్రెయిం జేత్తే హద్దులెలగ రాసీవోరనుకున్నావు? తూరుపుకి గోర్జిదారి, పడమటకి కొండ, ఉత్తరంకి గెడ్డ... యిలాగ రాసీవోరు. కొన్నాళ్లు పోయాక ఆ పత్రాలు పట్టుకొని యిప్పమాను గుడ్డినేగాక అక్కడి భూమినంతట్నీ తమదే అనీవోరు! అనుమానమయితే పత్రాలు సూడు.. అనీవోరు!" లక్కాయ్ చెప్తుంటే కంతుడు మళ్లీ అందుకున్నాడు.

"మళ్లీ... యెప్పుడు...?

గురువొచ్చినప్పుడు! సంగాలు పుట్టినప్పుడు భూంవుల లెక్కలు తేలినాయి..." అని గిరిజన సంగం నిర్మాణమయ్యేకనే, భూదురాక్రమణలు రద్దయినాయని చెప్పాడు కంతుడు.

"యింకా గోరమేటంతే? కర్నపోడికి శిస్తు గట్టీవోలిమా? ఆడిచ్చిన రశీదు దాసుకోడంకి సోటులేక యింటి పెడక ఎదురు బొంగుల యెట్టీవోలిమి! ఇల్లు కాలిపోయినపుడా... రశీదులూ కాలిపోయాయి, వొక్కోపాలి గాలీవోనలకీ ఎదురు బొంగుల్లోని రశీదు కాయితాలెగిరిపోయాయి! అపుడు మరంతే సంగతులు. సిత్తగించవలెను... అనీవోడు. శిస్తు రశీదు లేదని దున్నే భూమిమీద హక్కు లేదనేవోడు. ఆ భూమిని సావుకార్లుకి పట్టాజేస్సీవోడు... ఆం!" చెప్పాడు లక్కాయ్.

"నిజిమే?" నమ్మలేకపోతోంది బంతి.

"మీమాడిన మాటల్ల వొక్కముక్క అబద్ధంలేదు. అన్నీ నిజాలే. ఇలాపింటి తీరవగా గోరాలు జేసీవోరు గాబట్టే తెల్లబట్టలేసుకున్నోడన్నా, పల్లపోడన్నా పారిపోయీవోలిమి. దార్యాతలు దోసుకు తినేత్తారని! రూపాయికి పాతిక రూపాయిలు శిస్తు వసూల్జేసీవోళ్లు. అడివిలోకెల్తే ఫారెస్టోడు, సంతలోకెల్తే సావుకారీ, భూమ్మీదకెల్తే పోలీసోడూ... అందరూ మనల్ని దోసుకుతినేసేరు కదమ్మా.

పోతే పోనియ్యి తల్లీ... రత్తం! రకతం పారింతరాత గదా... కొండల్ల ఎర్రజెండాలెగిరింతరాత గదా భూంవి మనదయ్యింది. పంటలకి ధర పలికింది. ఖండగుత్తల ఫాయిదాలు పోయినాయి'' కంతుడు గత పోరాట కాలానికి ముందటి రోజుల్ని తల్చుకు చెప్పసాగేడు. ఆ ఉద్యమాన్ని అణచివేసేందుకు ఆయుధాలేగాక భూపంపక తతంగాన్నీ నడి




పింది అప్పటి ప్రభుత్వం. లక్కాయ్ అప్పటికి పదిహేనేళ్ల యీడువాడు. ఈ భూమి పంపక తతంగం వొకటి గుర్తొచ్చి కంఠుడు చెప్తున్నదాన్ని ఆపమని తను చెప్పసాగేడు.

"ఒకపాలి... యేటయ్యిందంతే? నీనూ అప్పుడికి ఈడుదేరలేదులే. నువ్వింకా సిన్న పిల్లవి. మా నాయిన పోరాటంల సేరాడని జెయిల్లబెట్నారు. సిదగ్గొట్టీసినారు. ఆ తరాత కేసు వొకటీ రుజువుగాలేదని వొదిలీసేరు. అపుడే లష్మిపురంల రోజూ ప్రభుత్వంవోరు పట్టాకాయితాలు పంచీవోరు. మా నాయినకీ పట్టా కాయితమిచ్చేరు. మా నాయినా, నీనూ ఆ కాయితిం ప్రెకారం భూమికోసం యెదికినాం. ఎవురినడిగినా యీ కాయితిం ప్రెకారం భూమి నీకు దొరకాలంతే పట్టా యిచ్చిన ఆర్డీవోని అడుగనీవోరు. మా నాయిన ఆర్డీవోకాడకెల్నాడు. పట్టా సూపి భూమిలేదు బాప్... అని సెప్పాడు. ఆ ఆర్డీవో ఆరయ్యికి అప్పజెప్పాడు. ఆ ఆరయ్యి కరణంకి వొప్పజెప్పబోతే కరణం సేతులెత్తి మొక్కి వొంద రూపాయిలు మా నాయినకిచ్చి పారిపోనాడు'' అని చెప్పి నవ్వసాగేడు లక్కాయ్.

ఎందుకు నవ్వుతున్నాడో గ్రహించలేకపోయింది బంతి. కరణం వందనోటిచ్చి, వంద నాలుబెట్టి యెందుకు పారిపోయేడో అర్ధమవలేదామెకి. అందుకనే-

"ఎందుకు పారిపోయేడు కరణం?" అనడిగింది బంతి.

లక్కాయి నవ్వు ఆపుకుంటూ - "రోజూ పట్టాలు రాసిచ్చేస్తం(డ్రు)గదా! వోలు మొత్తం ఏజన్సీ అంతా అయిపోయింది. మరి భూమిలేదట మాకిచ్చిన పట్టా ప్రకారం భూమి సూపడంకి! అదన్నమాట సంగతి'' చెప్పాడు.

బంతికి అంతా వింతగా వుంది. ఏఁవిటీ పరిస్థితి? భూములు కోల్పోయిన యెందరో గిరిజన రైతులు యీనాటికీ భూమికోసం అర్రులు చాస్తున్నారు. ఇప్పటికీ ఏజన్సీలో భూమి సమస్య కీలక సమస్యగానే వుందన్నది అర్ధమవుతోంది బంతికి!

పీ.వో. ఆఫీసుకి చేరారు. జనాలనందరినీ తీసుకొని బంతి పీ.వో.గారిని కలిసింది. గెడ్డపొలం వివాదం విషయమంతా చెప్పింది. వివాదం కోర్టు పరిశీలనలో ఉంటుండగా జగ్గారావు కాంట్రాక్టరు అక్రమంగా పొలం సాగుకు దిగేడని చెప్పింది.

పీ.వో.గారు ఆర్డీవోగారికి ఫోను చేశారు. ఆర్డీవోగారు... ఎమ్మార్వోగారికి ఫోనుచేశారు. ఎమ్మార్వోగారు ఆరయ్యిగారికోసం కబురుచేశారు. ఆరయిగారు వలసలోకి వచ్చేరు. పేసిని (తలయారి)గాడిచేత దండోరా వెయ్యించేరు.

"ఫలానా సర్వే నెంబరు గెడ్డపొలం వివాదంలో వుంది గనుక ప్రభుత్వం వివాదాన్ని పరిష్కరించేదాక ఎవరూ ఆ భూమిని సాగు చేయరాదనీ, సాగుచేస్తే చట్టాన్ని అతిక్రమించిన వారవుతారనీ, శిక్షార్హులవుతారనీ'' పేసినిగాడి దండోరా సారాంశం!

దండోరా వలసలో యింటింటికీ విన్పించింది గానీ, దురాక్రమణ చేసిన జగ్గారావుకి ఈ దండోరా వినబడనేలేదు. జగ్గారావు వుండే వూరిలో అసలు యే దండోరా వేయించలేదు.

జరిగిన తంతు అంతా చూసి లక్కాయ్ బంతి మొహంలోకి చూసి నవ్వేడు. కంఠుడు మాత్రం-

"పోన్లే... మనం పద్ధతిప్రకారం రిపోర్టు చేసినాము. ఆళ్లూ ఆళ్ల రూల్సు ప్రకారం సేసింది సేసారు. ఇకనేనా ఆ జగ్గారావుగాడు ఆగిపోనాడా మంచిదే! లేకపోయి ఆగలేదా? ఆడు, ఆ జెగ్గారావుగానీ యిత్తనాలు దెచ్చి ఆకుపోసేడా... మనం ఆ ఆకుదీసి ఉడుపు ఉడిసెస్తాం. పంట పండించుకుంతాం. అంతే! అంతేగాని పంట ఆ జెగ్గారావుకి మాత్రం దక్కదు... ఆఁ!" చెప్పాడు ధీమాగా!

నేలతల్లికోసం రైతు ఎంత ధీరోదాత్తంగా వుంటాడో కంగుడు మాటల్లో అర్థమైంది బంతికి!

ఆరోజు జూజూ అన్నటువంటి ఆ మాటలే... ఆ తర్వాత అయిదారు నెలలకు... చరిత్రను మారుస్తాయని గ్రహించలేకపోయింది బంతి!



ఏజన్సీలో వలసలన్నిటా మెదడువాపు వ్యాధి సోకింది. వలసల్లో యింటికొకరుగా ఆ మహమ్మారి మెదడువాపు వ్యాధికి బలయిపోతున్నారు. ఇంత ఘోరంగా మరణాలు సంభవిస్తున్నాయి. సమయానికి ప్రభుత్వం స్పందించలేదు. మందులు... విదేశాల నుంచి తెప్పిస్తున్నామనీ, వ్యాధిని శాస్త్రరీత్యా పరిశీలిస్తున్నామనీ ప్రకటనలిచ్చేవారు సంబంధిత శాఖల అధికార్లు! పరిసరాల పరిశుభ్రత, ఆహార అలవాట్ల గురించి అప్పటికప్పుడు బోధించసాగారు.

బంతి ఎన్నో జాగ్రత్తలు తీసుకుంది. ఇంటి పరిసరాల్ని శుభ్రంగా వుంచింది. ఆహారం వేడివేడిగా వున్నప్పుడే అందరికీ వడ్డించేది. ప్రథమచికిత్స కాదు... ముందు జాగ్రత్తలన్నీ తీసుకుంది.

అయినా చిన్నారికి వ్యాధి సోకింది. తీవ్ర జ్వరం. మెడ వంపు తిప్పి వాల్చేసేది చిన్నారి. వెంటనే పట్నానికి తీసుకువెళ్ళింది బంతి. ఏవేవో మందులు వాడేరు. జ్వరం తగ్గినట్లే తగ్గి మళ్లీ వచ్చేసేది. మెదడువాపు వ్యాధికి సంబంధించిన వ్యాక్సిన్ దొరకలేదు. వైద్యులు చేసిన ఏ ప్రయత్నమూ సఫలం కాలేదు. మూడురోజుల తర్వాత చిన్నారి మరణించింది.

బోసినవ్వుల్లోనూ, తపడ తపడ అడుగుల్లోనూ... తన మనసునిండా నిండిపోయిన పాప... మరణించడాన్ని బంతి తట్టుకోలేకపోయింది. చిన్నారి శవాన్ని గుండెలకదుముకొని భోరున ఏడ్చింది. సవరభాషలో శోకగీతమాలపించింది. నాయినమ్మ, జూజూలయితే మరీనూ! చిన్నారి లేని లోటు ఆ వృద్ధ దంపతులకు మరింత బాధాకరం. నిశ్శబ్దంగా గెడ్డ వాలులోంచి జారే ఊటజలంలాగా ఆ యిద్దరి కళ్లవెంబడి కన్నీరు...! భీముడే బయటపడలేదు. బాధను వోర్చుకున్నాడు. దుఃఖాన్ని దిగమింగుకున్నాడు. నెమ్మది, నెమ్మదిగా బంతినీ, ముసలివాళ్లనూ ఓదార్చసాగేడు!

చిన్నారి జ్ఞాపకాల్లోంచి అలా వొక్కొక్కరినీ తేరుకొనేట్లు చేసి బతుకుయాతనలో పడేట్లు చేసాడు భీముడు.

నెమ్మది నెమ్మదిగా బంతి చిన్నారి జ్ఞాపకాలను మరచిపోగలుగుతూ మామూలు దినచర్యలోకి అడుగుపెట్టసాగింది.

ఆ సంవత్సరం ఎండలు కాయడంగాదు పండేయి... జూన్ నెల మధ్యలో కూడా కొండలు కాలిపోతున్నాయి. వలసలు వర్షాల కోసం ఎదురుచూస్తున్నాయి. పంటలేమీ లేవు. జనాలు కరువుతో కాలిపోతున్నారు. గిరిజనులకు సాధారణంగా యే సీజన్లో పండిన పంట ఆ సీజన్ ఆఖరుకొచ్చేసరికి అయిపోతుంది. యేమీ మిగలదు. రకరకాల ఆహారధాన్యాలు పండిస్తారు. కానీ ఏడాది పొడుగునా వరి అన్నమే తినలేరు సవరలు! వరి పంట వాడుకున్న అప్పూ, ఫాయిదాలకు పోగా కొద్ది నెలల గ్రాసానికే సరిపోతుంది. వరిపంట అయిపోయే సమయానికి కంది





లు, ఉలవలు వస్తాయి. ఉప్పు వేసి, నీళ్లలో ఉడకబెట్టుకొని వీటిని తిని కాలం గడిపితే కొర్రలు, సామలు, ఊదలు అందుకొస్తాయి. ఇలాగ రకరకాల ఆహారపంటలు మునుకుల్లి (ఆగస్ట్) మాసంనుండి శివరాత్రి (ఫిబ్రవరి) మాసందాకా అందుతాయి. వాట్ని తినే బతుకుతారు జనాలు. ఇక మార్చి, ఏప్రిల్ నెలల్లో జీలుగు చెట్ల కాండాల్ని కొట్టుకొచ్చి యెండబెట్టి, దాన్ని తిరగలితో పిండిచేసి ఆ పిండిని జావకాచుకు తాగుతారు. మే, జూన్ నెలల్లో మామిడి పళ్లే ఆహారం. జూలైకి ఆ మామిడి టెంకల్ని పిండిచేసి, అంబలి కాచుకు తాగుతారు. జూన్, జూలై నెలలు వీరికి కరువు ఉచ్ఛదశలో వుండేరోజులు. ఆగస్టుకిగాని కొర్రలు అందవు. కొత్తపంటలు అందొచ్చేదాకా కరువుతో కాలిపోలేక అప్పులు వాడిన ఫలితంగా పంటంతా పోగొట్టుకునే దౌర్భాగ్యం దాపురించేది వీళ్లకు!

కొత్తపంటలు వచ్చాక కొత్తల పండగ చెయ్యందే పంటలు తినరెవరూ! కొత్తలు కలడం అంటారు దీన్నే. వలస దీసరి ముహూర్తం చూసి పండగలరోజు నిర్ణయిస్తాడు. వలసల్లో పురోహితుడు దీసరే! దీసరి నిర్ణయించిన రోజున ఆ వలసవాళ్లు ఆరోజు కొత్తలపండగ చేసి ఆరోజునుంచీ కొత్తపంటల్ని తినడం ఆరంభిస్తారు. ఎంత కరువుతో కాలిపోతున్నా కొత్తలు కలవందే పంటల్ని తినడమారంభించరు యెవరూగూడా! పంటలు పండటానికి కారణం దేవతలు దయగా చూడటమేనని భావిస్తారు వీళ్లందరూ. దేవతలే యిచ్చేరని తలుస్తారు. పంటలు పండకుండా పోయినా దేవతలకు కోపమొచ్చిందని భావిస్తారు. జాకరదేవతకి ఆవుని బలిచ్చి 'జగంపండుగ' చేస్తారు.

ఈ పండుగల పేరిట జంతుబలులూ, సారాయి తాగడాలూ, విందులూ దుబారా ఖర్చులుగా కన్పిస్తాయిగానీ సామూహికంగా విషాదాన్నీ, వినోదాన్నీ పంచుకునే సంస్కృతిని ఆ పండుగలేగదా వీరికి అందిస్తున్నాయి అన్పిస్తుంది!

సరిగ్గా ఈ కరువురోజుల్లోనే భీముడు రోజూ యేదోపని అంటూ ఎటో వెళ్లిపోతున్నాడు. జూజూ అడివికి వెళ్లి మామిడి టెంకలను యేరి తీసుకవస్తే వాటిని ఎండబెట్టి, తిరగలిలో వేసి తిప్పి పిండిచేసి జావ కాచేది బంతి! అదే యింటిల్లిపాదికీ ఆహారం! బంతికి ఉద్యోగం ఉండివుంటే యింత బాధ ఉండేదికాదు. జమ్మొలసలో కొంతమందికి చిన్నా చితకా ఉద్యోగాలున్నాయి. వాళ్లుమాత్రమే ఈ కరువు కాలాన్ని దాటేస్తున్నారు యే యిబ్బందీ లేకుండా! మిగిలినవాళ్లు కొంతమంది అడవిలో కట్టెలు కొట్టి, కావిడి కట్టి పల్లానికి మోసుకెళ్లి అమ్ముకొని భత్యం గింజలు తెచ్చుకుంటున్నారు. ఆ కావిళ్లతో తోవలోగానీ ఫారెస్ట్ ఉద్యోగులకు యెదురుపడిపోతే కట్టెల మోపు ఖరీదు ఉద్యోగి జేబులోకి వెళ్లిపోతుంది! ఖాళీ కడుపుల్తో ఆరోజు పస్తుపడుకోవాల్సి వస్తుంది వీళ్లు!

కరువుకి తోడుగా నాయనమ్మకు పక్షవాతం వచ్చింది. ఒక కాలూ, ఒక చేయీ పడిపోయింది! బంతికి ఏం చేయడమో పాలుబోయేది కాదు. కంరుడు ముసలిదాన్నే చూస్తూ మౌనంగా ఆమె మంచందగ్గరే వుండిపోయేవాడు రోజంతా! ఈ వయసులో ఆ వృద్ధులను పోషించలేనివాళ్లకు వైద్యం చేయించలేని అశక్తతకు తనమీద తనకే అసహ్యం వేసేది బంతికి! భీముడిమీదా కోపం వచ్చేది! ఇంటిని ఆదుకోవాల్సిన మనిషి యిన్ని భత్యం గింజలు తెచ్చిపెట్టాల్సినవాడు... యిల్లొదిలేసి రాచకార్యాలు వెలగబెడతాడా? అని మనసులో కోపగించుకునేది బంతి. కానీ మరుక్షణమే భీమునిపట్ల చులకనగా ఆలోచిస్తున్నానా అని బాధపడేది. ఎంత ఉదారంగా తనను స్వీకరించేడు! తనకోసం యిల్లరికం వచ్చేడు. ఇంటి బరువు, బాధ్యతలు ఎత్తుకున్నాడు. ఆయన్ని తప్పుబట్టటమా? ఛఛా... అనుకునేది. అను

భవిస్తోన్న దారిద్ర్యం ఆమెను వేటగాడి బాణం దెబ్బతిన్న పక్షిలా గిలగిలా కొట్టుకు నేట్లు చేసేది!

ఈ బాధల్లో వుండగా ఓరోజు జమ్మెల్మల సకు పోలీసులు వచ్చేరు. ఇల్లు, యిల్లూ సోదాచేశారు. ఇనుపబూట్లతో దడదడా యింటింటా గొడవచేశారు. బంతి యింటికీ వచ్చారు.

రోగిష్టి నాయినమ్మ మంచంమీద వుంది. కంఠుడు ఆ మంచంతలవేపు దండేన్ని ఆనించి కూర్చుని వున్నాడు. పోలీసులు ఆ దృశ్యాన్ని చూసి పెద్దగా ఆర్భాటం చేయలేదు. బంతినిమాత్రం యెగాదిగా చూసేరు. వాళ్లలో ఒకాయన బంతిని యెరిగినవాడులా వుంది.

"సంగీతం టీచరమ్మవి గదా?" అనడిగేడు ఆయన బంతిని.

"ఔను..." అంది బంతి నిర్వికల్పంగా.

ఆ తర్వాత వాళ్లు పొరుగింటిమీద పడ్డారు. లక్కాయి... యింట్లో లేడు. పోలీసులు కుండలూ మండలూ తిరగదోసేరు. కోళ్లగూళ్లు లాగిపారేశారు. తడిక తలుపులు తన్నితోసేసి విసుగ్గా బయటికొచ్చేరు.

"ఏంజరిగింది?" అడిగింది బంతి పోలీసుల్ని.

"యేం జరగాల? యేం జరిగినా జరగక పోయినా మాపని మేం చెయ్యాల! కుక్కలు మొరగటానికీ, పోలీసులు రెయిడ్‌కీ కాకపోతే మరి వుండేది దేనికి?" అని అసహనంతో యేదేదో సమాధానమిచ్చేడు వాళ్లల్లో వొకాయన.

బంతిని యెరిగున్న పోలీసుమాత్రం-

"నిన్న రాత్రి గుమ్మ టర్నింగ్‌ముందర బస్సుని కాల్చేశారు రాడికల్సు. వాళ్లు ఈ వలసల్లంటే వుంటారు వెదకండని ఎస్పీగారి ఆర్డరు! అతగాడు గెస్టహౌసుల కూచోని మమ్మల్ని వొలసలమీదకి తోలేడు'' జరిగిన విషయాన్ని చెప్పాడు.

బంతికి ఆశ్చర్యం వేసింది. 'రాడికల్సేమిటి? బస్సు కాల్చడమేఁవిటి?' అని మనసులో అనుకున్నదేమో...? అసంకల్పితంగా అలాగే ప్రశ్నించింది!

"ఈ రోజుల్ల రాడికల్సొక్కలే బస్సులు కాల్చడంలేదు. అందరూ కాలుస్తను. కాంగ్రేసోలూ బస్సులు కాల్చేరు.. తెలుగుదేశమోల్లూ తగలబెట్టేరు. అంతెందుకూ యింట్లో అమ్మ అన్నం బెట్టకపోతే... అలిగిన కుర్రోడు రోడ్డుమీదకొచ్చి బస్సుకి అగ్గిపెట్టేస్తాడు!" అని జవాబిచ్చేడు అసహనపు పోలీసు.

"వరంగల్‌ల తమ నాయకుడ్నెవర్నో మా పోలీసులు ఎన్‌కౌంటర్లో చంపేశారట! దానికి నిరసనగా బస్‌లు కాలుస్తున్నారు రేడికల్స్! ఇన్నాళ్లూ మన జిల్లాకి ప్రమాదంలేదు. బస్ దగ్ధాలూ, మందుపాతర్లూ... ఎన్‌కౌంటర్లూ లేవు! హాయిగున్నాం... అనుకున్నాం! గాని ఇక మరి తప్పవు తిప్పలు'' అని చెప్పి వాళ్లు మరో వలసమీదకు వెళ్లిపోయారు.

బంతికి అప్పటిదాకా బయటి ప్రపంచంలో యేం జరుగుతోందో తెలీదు. నాయినమ్మా, తాతయ్యలను చూసుకొని వాళ్లకు కావల్సినవి అమర్చటం, భీముడు చెప్పే విషయాలు వినటం, యిల్లూ... వెళ్తే అడవీ... యిదే ఆమె ప్రపంచం!

పోలీసుల దాడితో బయటి ప్రపంచం గూర్చి ఆలోచించసాగింది బంతి. పోలీసులు వెళ్లిపోయేక కంఠుడు బయటికొచ్చి బంతి కూర్చున్న గడపలో మనవరాలికి ఎదురుగా కూర్చొని ఆందోళన నిండిన కంఠంతో-

"యిదిగిదేనమ్మా ఆరంభం! ఇదే వేట! ఇక మరి వొలసల్లోని మేకపిల్లలు మేత మెయ్యలేవు. కోళ్లు కూతలెయ్యలేవు! పొయ్యిలమీది కుండలు నేలపాలు గాక మానవు. మనల్ని యింటిల వుండనివ్వరు, అడివిల తిరగనివ్వరు. ఇదిగిలాగే ఆరంభమవుతాది. ఈ తిప్పలు మళ్లా మరి పడలేం" అన్నాడు




భయంతో.

పోలీసులూ... యిక తప్పవు తిప్పలు... అన్నారు.

తాతయ్యా అదే అంటున్నారు!

అసలెందుకీ తిప్పలొస్తున్నాయి?

ఎవరు పెట్టినవివి? ఎలాపోతాయి...?

బంతి ఆలోచనల్లోనే వుంది.

కంతుడి గుండెలనిండా భయం చేరుకుంది. మనిషి గజగజా వొణికిపోతున్నాడు. ఎటువైపో చూస్తూ... దేన్నో పునశ్చరణ చేసుకుంటున్నాడు. తన దేహంలోని ఎక్కడి గాయాన్నో తడుముకుంటున్నవాడిలా... తనలో తనే గొణుక్కుంటున్నాడు. స్పష్టాస్పష్టంగా ఆ మాటలు బంతికి విన్పిస్తున్నాయి. కంతుడు తన ధ్యాసలో తను...

"యెవులెవులో పగబట్టినారు. సావుకార్లు, సొండీలు, కర్నాలు, కొసాకి గవరమెంటూ... అందరేకమయిపోనారు. సంగంమీద కత్తిగట్నారు. వొలసలమీద పగతీర్చుకొన్నారు. కోర్టులూ... యెదురుదెబ్బే దీసేయి...!

సంగం సభకి వొస్తన్న కోరన్ననీ, మంగన్ననీ దారిలకాసి... చంపినోడ్ని నిర్దోసని కోరుటు తీరుపు సెప్పింది. మన బూముల మీద పంటల్ని మన యింటికి తెచ్చుకోవాలన్న మనోల్ని జేలుపాలు చేసింది. గురువులు మీదకి తుపాకులు గురిబెట్టినారు. యుద్ధంకి సిద్ధమయిపోయి దిగిపోనారు ఆళ్లంతా!

వొలసలు యింకా దిగలేదు. సంగాలింకా సిద్ధంకాలేదు. చట్టానికీ, యేలినవోరికీ దరకాస్తులెట్టడం... దండాలు పెట్టడం... పల్లంలోని ఆఫీసులకాడకి ఊరేగింపులు దియ్యడం... యిజ్జప్తులు సెయ్యడం... యిదిగీ తీరవల నడుస్తంది సంగం. అలాపింటి రోజుల్ల... వోపాలి..." కంతుడు గతంలోకి వెళ్లాడు. బంతి తాతయ్యనే చూస్తోంది!

తెలతెల్లారుతుండగా...!

పంట చేనిమీద పందులు పడినట్లుగా వొలసమీద పోలీసులు పడ్డారు!

"పీకండిరా... ఎగుర్తోన్న ఆ ఎర్ర జెండాని" ఆర్డరేశాడు ఎస్సయి.

వలసముందరి వేపచెట్టుకు యెగుర్తోన్న ఎర్రజెండాని ఒక కానిస్టేబుల్ ఆ చెట్టెక్కి పీకివేశాడు. నేలకేసి కసాపిసా తొక్కేశాడు.

"గుడిసె గుడిసే సెర్చ్ చెయ్యండి. దొరికిన కొండనాకొడుకుల్ని కుళ్లబొడిసి పట్రాండి. ఎవుర్నొదలొద్దు. ఆడనాకూతుర్లని గూడా..." జవాన్లకు సంపూర్ణ స్వేచ్ఛనిచ్చేడు ఎస్సయ్.

ఎగిరి గంతేసి జాగిలాల్లా పోలీసులు గుడిసెలమీద పడ్డారు. కనబడినవాడినల్లా చిదగ్గొట్టేరు. ఆడవాళ్లకోసం అదేపనిగా మరికొందరు పోలీసులు వెదకసాగేరు.

తుపాకీ మడమలకి గుడిసెలు విరిగిన ఎముకలయినాయి. చిరిగిన కోకలయినాయి. వలస కాలిన దేహమయ్యింది!

వలసలో ఓ గుడిసెలోంచి...

"అమ్మో!" పెనుకేక!

ఆ తర్వాత కదలిక ఆగిపోయింది. పువ్వుల రాజమ్మ రెక్కలు రాలిన పుష్పమైంది. రాజమ్మను పోలీసుమూక రాక్షసంగా చెరిచారు. రాజమ్మను రక్షించాలని పెనుగులాడింది కొమలమ్మ! కొమలమ్మా నిండుచూలాలు! తుపాకీ మడమలు గర్భాన్ని ఢీకొన్నాయి. రక్తస్రావంమధ్య కొన ఊపిరితో మిగిలింది కొమలమ్మ.

ఖాకీలు కదిలి వెళ్లిపోయేయి. వలస విలపిస్తూ చీకటిలో మునిగింది.

మర్నాడు మరో వలస! బీభత్సం చేసి, దారుణాలుజేసి జనాలను భయభ్రాంతం జేసేందుకు వరుసగా దాడులు జేసారు పోలీసులు. వలసలమీద మేకపిల్లల్ని పట్టుకుపోవటం, కోళ్లను కొట్టుకుపోవటం, దోవలు కాసి దొరికిన వార్ని లాక్కుపోయి లాకప్పుల్లో పడేసి కొట్టడం... ఏజన్సీని గజగజా వొణికించే దాడులు జేసారు పోలీసులు.

వలసలు ఖాళీ జేసి రాత్రీపగలూ చిక్కని అడవిలో దాక్కునే వాళ్లు గిరిజనులు. రోజులకొద్దీ ఈ దాక్కోవటంలోనే గడిపేయటంతో ఆహార సమస్య ఎదురైంది వారికి. ఆకలికి అడవిలో దొరికే దుంపలూ, ఆకులూ నమిలి మింగేవారు.

ఈ పరిస్థితికి విరుగుడు వెయ్యాలి. ఎక్కడో ఒకదగ్గర ఈ దాడులమీద చర్య తీసుకోవాలి. లేకపోతే నడిపిన ఉద్యమం రక్షించబడదు, జనం సజావుగా బతకనూ లేరని గిరిజన సంగమూ, పార్టీ ఆలోచించింది. దీర్ఘంగా చర్చించి పథకం రూపొందించేడు గురువు! అంతే సిద్ధమైంది సంగం.

ఎప్పటిలాగే మరోదాడికి మరింత ఉత్సాహంగా కొండమీదకి నడుస్తున్నారు పోలీసులు.

చెట్టుమీదనుంచి చూసి సిరిం ఈలవేసాడు. ఆ ఈల అందుకున్న దారి మామిడితోవలోనున్న సోము తుడుం గొట్టేడు. తుడుం శబ్దం అందుకున్న వలసలోని తుడుంలన్నీ మ్రోగేయి. కొండల్లో తుడుం శబ్దాలు ప్రళయంగా ప్రతిధ్వనించేయి.

పోలీసు మూక శబ్దాన్ని అయోమయంగా వింటూ ఆగింది. వలసల్లోంచి జనాలు కర్రా, కంపా, కత్తీ పట్టుకు కదిలి వస్తున్నారు. పోలీసుమూక అనుమానంగానే కొండ యెక్కసాగింది.

కొండమీద నుండి ఇస్రు వొక రాయిని విసిరేడు. పోలీసు మూక మధ్యపడింది. కొమురు మరో చిన్న సైజుబండని దొర్లించేడు. దడదడదడా.. దొర్లుకుంటూ పోలీసు మూక గుండెల్లో అదురు పుట్టించింది.

పోలీసులు గుండెలరచేతబట్టుకొని తలో దిక్కుగా చెదిరిపోయి, కొండదిగుతూ అడ్డదిడ్డంగా తుపాకులు పేల్చుకుంటూ తోక ముడిచేరు. ఆ కాల్పుల్లో ఒక గిరిజనుడు చచ్చిపోయేడు.

'రెంజిమ్' రెల్లు పొదల్లోంచి చూస్తున్నాడు. తుపాకులు పేల్చుకుంటూ పరుగెత్తుతోన్న పోలీసుల గుండెల్లోకి గురిజూసి బాకాలు వొదిలేడు. ఇద్దరు పోలీసులు గిలాగిలా కొట్టుకొని, తుపాకులు నేలకి వొదిలేసి తన్నుకు చచ్చేరు. కనీసం ఆ యిద్దరి శవాల్ని తీసుకుపోవడానికి గూడా పోలీసులు రాలేకపోయేరు.

తొలిసారిగా సంగం తిరగబడి పోలీసుల్ని చంపిన రోజది! రెండు ఆయుధాలు దొరికేయి. ధైర్యం కలిగింది సంగానికి.

"యిలాగ ఎదురు దెబ్బ తియ్యకపోతే మన సంగం నిలవదు. మన జనం వలసలంట బతకలేరు. ఎదురుదెబ్బ గొట్టడానికి మనమూ దళాలను గట్టాల" అన్నాడు గురువు.

అప్పుడు దళాలు ఏర్పడ్డాయి. యుద్ధం జరిగింది. గతంలోంచి తేరుకున్నాడు కంతుడు. ఓ క్షణం ఆగేడు. గుండెలనిండా ఊపిరి పీల్చి వొదిలేడు. బంతి తాతయ్యవైపే చూస్తోంది. కంతుడు మళ్లీ ప్రారంభించేడు. బంతి మొహంలోకి చూస్తూ,

"గానిపుడు యుద్ధం జేసేవోల్లేరీ? దళాలేవీ? పార్టీయేదీ? వద్దమ్మా వద్దు ఆ తిప్పలు మరొద్దు. నీకు తెల్దు. నువ్వు యివన్నీ యెరగవు. నువ్వు సల్లగుండాల పదా, ఎక్కడికేనా ఎలిపోదుం. ఇక్కడ మరి వుండొద్దు. ఈ అడవీ కొండా ఈ వలసా వదిలేసి ఎలిపోదుం. నువ్వు సల్లగుండాల" చెప్పాడు భయం నిండిన గుండెల్తో.

డబ్బై ఏళ్లకు పైగా అడవిలో నడయాడి, అడవితల్లి ఒడినే స్వర్గంగా భావించి బతికిన జూజూ తనకోసం ఆ అడవి తల్లినే వొదిలి పారిపోదామంటుంటే బంతికి గుండెల్లోంచి దుఃఖం తన్నుకొచ్చింది. కన్నీరు నిండింది. ఏంజేయడమో పాలుబోక అలా తాతయ్యనే చూస్తూ వుండిపోయింది బంతి.

"ఎవులిదారి ఆళ్లదేనమ్మా యిపుడు! అప్పుడ్లాగకాదు. మన జాతి జనులు బాగుపడతారంతే గురువు యుద్ధం నడిపితే నా




తుపాకి నిచ్చేను. కొడుకూ కోడలూ యుద్ధంలో కెలిపోతే భేష్ అనుకున్నాను. గాని ఓడిపోనాం! ఎందుకోడిపోనామమ్మా? ఎందుకు? మనది ధర్మయుద్ధంకాదా?" ప్రశ్నించేడు కంతుడు.

బంతి యేం జవాబు చెప్పగలదు. తల్లీదండ్రుల రూపాలైనా సరిగ్గా గుర్తులేవు. వారి గురించి జూజూ, నాయనమ్మా, జనాలూ చెప్పిన మాటల్లోంచే వారి రూపాల్ని ఊహించుకోవలసి వచ్చింది బంతికి ఇలాంటి సందర్భాల్లో బంతికి తల్లీదండ్రీ గుర్తుకొచ్చి గుండెలు పిండే బాధ కలుగుతుంది.

ముసలి తాతయ్య, నాయనమ్మలను పోషించలేక పోతున్నాననే బాధో, వలసనీ, అడవినీ విడిచి పారిపోవడమా అన్న ఆవేదనో, కన్నవారి ఆలోచనలవల్ల గలిగిన దుఃఖమో బంతి నిభాయించుకోలేకపోయింది. వలవలా ఏడ్వసాగింది.

బంతి ఏడ్వటం గమనించిన రోగిష్టి ముసిల్ది, నాయనమ్మ మంచమ్మీంచే శోకాలు దీయసాగింది. ఈ యిద్దరి ఏడ్పుల్తో కంతుడు మరింతగా కదిలిపోయేడు. గుడ్లనీరు నింపుకు కుమిలిపోయేడు. రాలిపోతోన్న ఆకులను చూస్తూ కుమిలిపోయే మోడులా వున్నాడు కంతుడు.

సరిగ్గా అప్పుడొచ్చేడు భీముడు. రెండు రోజులుగా ఎక్కడికో వెళ్లిందుగదా తిరిగి తిరిగొచ్చినట్లుంది. మనిషి నీరసంగా వున్నాడు. కళ్లల్లో మాత్రం ఏదో కాంతి కన్పిస్తోంది.

భీముడు యింట్లోకి వచ్చి, వంట పంచలోని మట్టి కడవలో నీళ్లు దోకితో తీసి గటగటా తాగేడు. ఒంటిమీది తువ్వాలుతో మూతి, మొహం తుడుచుకున్నాడు.

బంతి గబగబా కళ్లు తుడుచుకొని నాయనమ్మ మంచం దగ్గరకు వచ్చి కూర్చుంది. కంతుడు నెమ్మదిగా లేచి, అక్కడనుంచి గడపలోకి వెళ్లిపోయేడు.

భీముడు నాయనమ్మ మంచం దగ్గరకొచ్చి ఆమె ఒంటిమీద చేయివేసి జ్వరం ఎలా వుందో పరిశీలించేడు. ఎడమచేయి నాడి పట్టుకుని చూస్తూ,

"ఊష్టం ఎక్కువ గున్నట్టుగుంది. ఉండు మందు తెస్తాను'' అని చెప్పి బయటకు వెళ్లాడు.

ఓ అరగంట తర్వాత తిరిగొచ్చి, నాగస్వరం వేళ్లూ, మరేవో ఆకులూ తెచ్చి బంతి చేతికిచ్చి,

"ఈ వేళ్లని సన్నిగొడ్డతోటి బాగా నలగ్గొట్టి, ఆ ఆకులు కలిపి యాట్ని మెత్తగా రోలుమీద నూరీసి తీసికిరా'' చెప్పాడు భీముడు. బంతి వాట్ని తీసుకొని రోలు దగ్గరకు వెళ్లింది.

భీముడు తన భుజమ్మీది గావంచాను తడిపి తీసుకొచ్చి నీళ్లను పిడిచేసి, తడి గావంచాతో నాయనమ్మ నుదుటినీ, చేతుల్నీ, అరిపాదాలనూ తుడవసాగేడు.

కాస్సేపటికి బంతి నాగస్వరం వేళ్లనూ, ఆ ఆకులనూ నూరి ముద్దను తీసుకొచ్చి యిచ్చింది. భీముడు ఆ ముద్దను అందుకొని నాయనమ్మ నుదుటిమీద బాగా ఒత్తుగా అంటించి గావంచా కట్టేడు తలకు. ఆ తర్వాత బనీను జేబులోంచి ఏదో ఆకు తీసి రసాన్ని పిండి నాయనమ్మ నోట్లో చుక్కచుక్కా వేశాడు. నెమ్మదిగా నాయనమ్మ నిద్రలోకి వెళ్లిపోయింది.

"మరేం భయ్యింలేదు. ఒక సెనానికి జొరం తగ్గిపోద్ది'' ధైర్యం చెప్పాడు భీముడు.

ఏజన్సీలో జ్వరాలకీ, చిన్నచిన్న గాయాలకీ, విరోచనాలకీ, దగ్గు, నొప్పి లాంటి బాధలకీ వనమూలికలతోటే వైద్యం చేస్తారు. ప్రతి వలసలోనూ యజ్జోడుగానీ, యజ్జురాలుగానీ యిలాంటి వైద్యంచేసి ఏవో మంత్రాలు చదువుతారు. జంతు బలులు యిస్తారు. ఇప్పటికీ యిదే అక్కడి వైద్య

విధానం! ఎంతవరకూ శాస్త్రీయమన్నది ప్రశ్నార్థకమే! అయినా అంతకుమించిన శాస్త్రీయ వైద్యం ఆ వలసలకు అందుబాటులో లేదుగదా!

ఆరోజునుంచీ భీముడు యిల్లు విడిచి వెళ్లిపోవటం మానుకున్నాడు. కరువుని గమనించేడో, బాధ్యతని గుర్తెరిగాడో భత్యం గింజలు సంపాదించి యింటికివ్వాలని నిర్ణయించుకున్నాడు.

అడవికి వెళ్లి కట్టెలు కొట్టి పల్లానికి మోసుకెళ్లి అమ్మడమో, మండల కేంద్రంలోని బస్టాండులో మూటలు కూలికి మోయడమో ఏ రోడ్డు పనికో వెళ్లడమో జేసి భత్యం గింజలకు సరిపడా డబ్బు తెచ్చుకునేవాడు. కరువు రోజుల్లో తిండికి లోటులేకుండా ఆదుకున్నాడు భీముడు. భీముడ్ని చల్లగా చూడమని దేవతలను మొక్కుకుంది బంతి.

అయితే, బంతి మనసులోమాత్రం ఆందోళనగానే వుంది. భీముడు కొత్తగా కన్పించసాగేడు. తనతోకంటే తాతయ్యతోనే ఎక్కువసేపు మాట్లాడటాన్ని గమనిస్తోంది బంతి. వాళ్ల సంభాషణలో ఎక్కువగా సంగం, పార్టీ, అన్నలు... అనే పదాలు వినబడేవి. చెవి ఒగ్గి రహస్యంగా వినేది. భీముడు కొన్ని వలసల భోగట్టాలు అడిగేవాడు కంతుడ్ని. ఆ వలసల సామంతుల గూర్చి, వాటి దోవల గూర్చీ అడిగేవాడు. గత పోరాటంలో ఆయా వలసల పాత్ర గురించి అడిగి తెలుసుకునేవాడు. తిరిగి తను ఏవేవో చెప్పేవాడు.

సేద్యంలో అవలంభించాల్సిన పద్ధతులూ, మెలకువలూ, శ్రమా, శ్రద్ధా వీటి గురించి శ్రద్ధగా చర్చించే రైతుల్లా కంతుడూ, భీముడూ మాట్లాడుకునేవారు.

బంతికి ఆందోళన పెరిగిపోయేది. తనకు తెలియకుండా ఏవో కార్యకలాపాలు భీముడు చేస్తున్నాడని భయపడేది. అయినా అడగలేక పోయేది. అంతలోనే తన మనసుకు తానే సర్దిచెప్పుకునేది. యింటి పోషణ గురించి యింత శ్రమపడ్తున్న వ్యక్తికి యితర కార్యకలాపాలు చూసే తీరిక ఎక్కడుంటుందిలే అనుకునేది.

భీముడి సంపాదనకు తోడుగా తనూ కొంత వేణ్ణీళ్లకు చన్నీళ్లులా చేయాలని కోపేరు తాడుతో నులక వుండలు పేనుతుండేది బంతి. అడవినుంచి అడ్డాకులు తీసుకొచ్చి విస్తళ్లు కుట్టేది.

"పాటలు పాడే పంతులమ్మ యిస్తరాకులు గుట్టడం, నులకతాళ్లు పేనడం సెయ్యగలేదేటి?" ఆశ్చర్యాన్ని నటిస్తూ హాస్యమాడేవాడు భీముడు!

మొత్తానికి ఒడిదుడుకులు లేకుండా బంతి కాపురం సాగుతోంది.

బస్ దగ్ధం కారణంగా జరిపిన పోలీసుల గాలింపులు వారం రోజుల సందడితో ఆగిపోయేయి. కంతుడు భయపడినంతగా పోలీసు వేట జరుగలేదు. ఆ తర్వాత బస్సులు గూడా మళ్లీ దగ్ధం కాలేదు. రోజులు మామూలుగానే గడుస్తున్నాయి.

జూలై నెల వచ్చింది. వర్షాలు మొదలుగావటంతో కొండలు చల్లబడుతున్నాయి. భూములు దుక్కి పదును అవుతున్నాయి. ఆకులు రాలిన అడవి పచ్చదనం తొడుక్కుంటోంది. చెట్లూ, చేమలూ తలలు దులిపినట్లు చినుకులు రాల్తున్నాయి.

వరి ఆకుపోతలు మొదలయినాయి.

బంతి భయపడినట్లుగానే జగ్గారావు కాంట్రాక్టర్ గెడ్డపొలం మీదకి మళ్లీ వచ్చేడు.

అందరికంటే ముందర గెడ్డపొలం ఆకుమళ్లల్లో విత్తనాలు పోయడానికి పాలేర్లను తీసుకు నాగళ్లు పూనుకుని వచ్చేడు జగ్గారావు. రెవిన్యూ అధికార్లూ, పీవోగారూ చేయించిన చాటింపుని ధిక్కరించి వచ్చేడు.

బంతికి ఆందోళనగా వుంది. ఇపుడేవిటి చెయ్యడం? ఈసారి మరి వలసవార్ని ఆపటం కష్టం. కొట్లాటకు దిగిపోతారు...




ఆగరు. చట్టమూ, ప్రభుత్వమూ దేన్నీ నమ్మరు. ఏం చేయటం... ఆలోచించసాగింది బంతి.

గెడ్డపొలం గట్టుమీద గొడుగు నీడలో కూర్చున్నాడు జగ్గారావు. పాలేర్లు చాలుబోసి దుక్కులు దున్నుతున్నారు. చేటల్తో విత్తనాలు చాలుచాలుకు జల్లుతున్నాడొకడు.

భీముడు చూసేడు. కంఠుడు చూసేడు. వలస జనాలందరూ చూసేరు. అయితే, ఎవ్వరూ ఆవేశంతో కొట్లాటకి తయారయి పరుగెత్తలేదు, బంతి భయపడ్డట్లుగా!

అదే ఆశ్చర్యంగా వుంది బంతికి.

కబడ్డీ ఆటలా వుంది దృశ్యం. ప్రత్యర్ధి కూతకూసుకుంటూ, చేతులు విసురుతుంటే అదునుకోసం చూసే ఆటగాళ్లల్లా నిల్చుని చూస్తున్నారు వలస జనాలు.

ఆకుపోతలయిపోయినయి. ఏ ఘర్షణా జరుగలేదు.

బంతి యిక ఆ విషయాన్ని మర్చిపోయింది.

ఆగస్టు మొదటివారం గెడ్డపొలంలో వరి నారు పచ్చగా ఎదిగి వచ్చింది.

రాత్రి కురిసిన వానకి... భూమి మెత్తగా తడిసి ముద్ద అయ్యింది. తెల్లవారేసరికి వలసవాళ్లు యింటికో నాగలి యేరుబూసి గెడ్డ పొలం దమ్ముపట్టడానికి కదిలేరు.

భీముడి నాగలి ముందు నడుస్తూ చాలు బోస్తోంది. నాగేటి చాళ్లకు నేలతల్లి విచ్చుకుంటోన్న పుష్పమైంది. కొందరు వరి ఆకు దీసి కట్టలు గట్టేరు. దమ్ముపట్టడం అయ్యేక నున్నగా నొల్లదేలేడు భీముడు. కొందరు... గట్టులకు పారపని చేసారు.

పొద్దు పది గంటలయ్యేసరికి... వలస ఆడవాళ్లు... ళ్లొళ్లొళ్లొ అంటూ ఉలవలుపోసి, ఊడుపు ఆరంభించేరు.

పచ్చని నాట్లు... గెడ్డ పొలంలో పసిబిడ్డల్లా తలలూపుతున్నవి. ఒంగొని ఊడుపు ఊడిచే ఆడవాళ్లు... భూమాతను మొక్కే భక్తుల్లా వున్నారు. సాయంత్రానికి పొలం అంతా ఊడిచేసారు.

చిన్నగా వాన తుంపర ఆరంభమైంది. సంబరంగా గెంతుకుంటూ వచ్చేరు పొలం నుంచి ఊరిలోకి. ఎవరో పదాలు యెత్తుకున్నారు. మగాళ్లు కొందరు యిళ్లల్లోంచి వాయిద్యాలు అందుకున్నారు. ఆటా, పాటా... వాయిద్యాలతో వలస వీధినిండా జనమే! ఇంట్లోవున్న బంతికి యిదంతా తెలీదు. గడపలోకి వచ్చి చూస్తే సంబరంలో జనం! నృత్యాలు జేస్తోన్న ఆడామగా! వాయిద్యాలు మోగుతున్నాయి. బంతి గొంతులో పదాలు కలదిరుగుతున్నాయి. వాయిద్యాలకు శరీరం లయాన్వితమవుతోంది. భీముడు మంది లోంచి వచ్చి గభాల్న బంతి రెక్కపట్టుకు వానలోకి లాక్కెల్లాడు. బంతి నడుం చుట్టూ చేయివేసి మిగిలిన వారితో కలిపి జట్టుగట్టేడు. జట్లు వెనుకకూ, ముందుకూ అడుగులేస్తూ నాట్యం చేశాయి. ఆడీ, పాడి అలిసిపోయిన వేళకు వాన తుంపరతగ్గింది. జనాలు అందరూ ఎవరి యిళ్లకు వాళ్లు కదిలేరు.

పొయ్యిలు రాజేసి, వంటావార్పూ చేస్తున్నారు. ఇంతలో కలకలం మొదలైంది. ఆడవాళ్లు కీచుగొంతుల్తో అరుస్తున్నారు. మగవాళ్లు కొంతమంది అడవిలోకి పారిపోతున్నారు.

బంతి ఆదుర్దాగా వంటపంచలోంచి వీధిలోకి వచ్చింది.

పొరుగింటి లక్కాయ్‌నీ, కొసాయింటి సోవునీ, మరో నలుగుర్నీ పోలీసులు పట్టుకొని లాఠీల్తో బాదేస్తున్నారు.

"ఏమిటీ దౌర్జన్యం? ఎందుకలా కొడ్తున్నా రో"ని అడగబోతూ బంతి వీధిలోకి రాబోతే మరో దండు పోలీసులు బంతిని తోసుకుంటూ యింట్లో చొరబడ్డారు. మూల మూలలా వెదికేరు. భీముడేడీ అనడిగేరు. ముసలోడు కంఠుడ్ని పట్టుకు తీసుకుపోబోతుంటే,

"ఏవిటీ దౌర్జన్యం? ఎందుకిలాకొట్టి పట్టు

కెల్తున్నారు. వీళ్లు చేసిన తప్పేంటి?" అడ్డుగా నిల్చుని ఆవేశంగా ప్రశ్నించింది బంతి.

"జగ్గారావుగారు నారుబోసిన భూమిని... వీళ్లు దురాక్రమణజేసి దమ్ముబట్టి ఊడిచేరు! ఇదేటి అడవిల జెంతు రాజ్యమనుకున్నారా? ఎవుడి పొలంలో బడితే ఆడి పొలంల దిగిపోతే గవర్నమెంటెందుకుంది? తుపాకులిచ్చి మమ్మల్నెందుకుంచింది గవర్నమెంటు? దౌర్జన్యం జేసేస్తుంటే ఊరుకోంగాక ఊరుకోము'' అని బాధ్యతగా శాంతిభద్రతలను కాపాడే తీరతాం అన్నట్లుగా చెప్పాడో పోలీసు.

శాంతిభద్రతల రక్షణపట్ల ఆయనకు గల నిబద్ధతకు జేజేలు పలకాలి. అయితే ఆయన రక్షించే శాంతి, భద్రతలు ఎవరివి అన్నది ప్రశ్నించుకోరాదు.

"దురాక్రమణ జేసింది జగ్గారావే! గెడ్డ పొలం ఆయనిదికాదు. మా వలస ప్రజలది'' చెప్పింది బంతి.

"ఆ విషయం రెవిన్యూ రికార్డులు చెప్పాల. మీరుకాదు చెప్పాల్సింది!"

"రికార్డులు పరిశీలనలోవున్నాయి. అవి పరిశీలన జరిపి, తేల్చేదాక ఎవరూ పొలంలో దిగగూడదని ప్రభుత్వం యింజక్షనిచ్చింది''

"మరి మీరు దమ్ముపట్టి ఉడుపుకెలా దిగిపోయేరు?"

"ఇంజక్షన్ని అతిక్రమించి ముందు దిగింది మేము కాదు. ఆ జగ్గారావు దిగేడు. ఆకు పోసేడు. ఆ విషయం పీవోగారికీ చెప్పాం"

"పోలీస్ డిపార్టుమెంట్ కెందుకు చెప్పలేదు?"

"..."

"ఆ జగ్గారావు అక్రమంగా దిగేడని పీవోకి చెప్పారు. మరి మీరు అక్రమంగా ఉడుపుకి దిగుతామని ఎవరికేనా చెప్పారా?"

"..."

ఏదో ఒక విధంగా, ప్రశ్నకు జవాబు చెప్పలేని స్థితి కల్పించటం, అదే నేరమని దబాయించటం పోలీసులకు తెలిసిన విద్య! ఆ విద్య ముందు బంతి ఓడిపోయి మౌనం వహించింది.

అరెస్టు జేసినవారిని పట్టుకుపోతూ,

"రేపు పొద్దుట కోర్టుకి తీసుకొస్తామీళ్లని. బెయిలు గియిలు పెట్టుకోండి. రేపే వొదిలేస్తారు. కేసు పెద్దదికాదు'' అని చెప్పాడు ఓ పోలీస్!

పొయ్యిలమీద ఎసర్లు పొయ్యిల మీదనే పొంగి పొర్లాయి. సంబరాల వలస ఆ చీకటి నిండినవేళ తుఫాను బాధిత ప్రాంతమైంది. ఈ గందరగోళమంతా తెలీని నాయనమ్మ నిద్రలో వుంది. అదృష్టవంతురాలనుకుంది బంతి. భీముని కోసం ఆందోళన మొదలైంది. పోలీసులు లాక్కెళ్లిన జూజూని తల్చుకుంటే ఏడుపొచ్చింది. ఇంట్లో దీపం వెలిగించి కూచుంటే దీపం వెల్తురులో తన నీడ గోడమీద తనలాగే ఏడుస్తోంది. అంతలో పోలీసాయన చెప్పిన విషయం గుర్తొచ్చింది. రేపు కోర్టులో బెయిల్ పెట్టుకోమన్నాడు గదా! భీముడుంటే బాగున్ను యిలాంటి విషయాలు చూసుకునేవాడు అనుకుంది బంతి.

అంతలో ఓ అబ్బాయి వచ్చేడు. దీపం వెలుగులోకి వచ్చేక బంతి పోల్చుకుంది ఆ అబ్బాయిని. ఆశ్రమ పాఠశాల విద్యార్థి. అంతకుముందోసారి అన్నల్తో కలిసి భీమన్న వొచ్చేడని యీ అబ్బాయే చెప్పాడు.

"మేడమ్ మరేం భయంలేదు. ఇలాంటిదేదో జరుగొచ్చని ఆళ్లు ముందే ఊహించేరట! అందుకనే, అసలయినవాల్లు అజ్ఞాతంలోకి వెళ్లిపోయేరు. నేను కలిసేను వాళ్లని'' చెప్పాడు ఆ అబ్బాయి ఆరిందాలా!

బంతి ఆశ్చర్యపోతోంది.

పోలీసులు వస్తారనీ, అజ్ఞాతంలోకి వెళ్లా




లనీ యింతటి ఆలోచన ఎవరు జేసారు? భీముడేనా? వెనుక ఎవరన్నా వున్నారా? ఉంటే ఎవరు?

"పోలీసులు ఎవరెవర్ని లాక్కెల్లారో, యే మేమి అన్నారో కనుక్కురమ్మనిపంపేరు'' ఆలోచనల్లో వున్న బంతికి తను వచ్చిన కారణం చెప్పాడా అబ్బాయి.

ఎవరెవర్ని కొట్టి పట్టుకుపోయేరో చెప్పింది. అలాగే ఏడుపు గొంతుతో,

"మా జూజూను గూడా పట్టుకుపోయేరు. రేపు కోర్టుకి తెస్తారట. బెయిల్ పెట్టించుకోమన్నారు'' చెప్పింది బంతి.

"అయితే ఆ విషయం చెప్తాను వాళ్లకి. మరి వస్తాను మేడం" అంటూ లేచాడు ఆ అబ్బాయి.

"మొయిలం.. యింతకీ ఎవరికి చెప్తావు. ఎవరు వాళ్లు?" మనసులో ప్రశ్నల్ని అదుముకోలేక అడిగింది బంతి.

ఆ ప్రశ్నకు మొయిలం ఓ నవ్వు నవ్వేసి ఊరుకున్నాడు. అలాంటి ప్రశ్నలు వేయగూడదు మేడం అన్నట్లుగా వుంది మొయిలం నవ్వినతీరు. అయినా కనీసం భీముడి గురించయినా తెల్సుకోవాలనే ఆతృతతో,

"మా ఆయన కలిసేడా?" అనడిగింది బంతి.

"భీమన్న లేకండానా? ఉన్నాడు నాకు కలిసేడు'' చెప్పాడు సంతోషంగా.

ఈ మాత్రం సమాచారమన్నా అందింది. ఆయన క్షేమంగా వున్నాడు చాల్ను... నిదాన పడింది బంతి.

మొయిల్మం వెళ్లిపోయేడు.

నాయినమ్మను లేపి, రెండు ముద్దలు అన్నం తినిపించింది. తను గిన్నెలో చేయి కలిపి, తినలేక లేచిపోయింది బంతి. గిన్నెల్ని కడిగి పంచలో సర్దేసింది. నాయనమ్మ మంచం పక్కగా చాప పరుచుకు పడుకుందామనుకుంటుంటే వలసలో ఆడవాళ్లు ఒక్కొక్కరూ వచ్చేరు. అందరూ అరెస్టయిన తమ వారి గురించి ఆందోళన వెలిబుచ్చేరు. పోలీసులు యింకేమైనా చెప్పారా అని బంతిని అడిగేరు. పోలీసు స్టేషన్లో తమవాళ్లని కొట్టి చంపీరుగదా. అని బంతినుంచి ఓదార్పును కోరుతూ... తమ అనుమానాలూ, భయాలూ వ్యక్తం జేసారువాళ్లు.

అంతవరకూ తన తాతయ్య గురించీ తన భర్త గురించీ ఆందోళన చెందే బంతి తన ఆందోళననూ, భయాన్నీ గుండెల్లోనే గుప్త పరుచుకొని యిరుగుపొరుగు స్త్రీలందరికీ ధైర్యాన్ని కలిగించే ఓదార్పు కబుర్లు చెప్పింది.

రేపు ఉదయం కోర్టుకి వెళ్లి, మనవాళ్లకు బెయిల్ పెట్టించాలనీ, సాయంత్రంకి అంతా విడుదలయిపోతారనీ... మరేం భయం లేదనీ చెప్పింది. కానీ, మొయిలం అనే అబ్బాయి వచ్చాడనిగానీ, అతనిద్వారా విషయాలు కనుక్కుని... తర్వాత చర్యలకోసం అవతల అజ్ఞాతంగా వున్నవాళ్లు ప్రయత్నాలు చేస్తున్నారనిగానీ చెప్పలేదు. బంతికి ఆ విషయం రహస్యంగా వుంచాలని... గుండెలో యెక్కడినుంచో ఆజ్ఞలొచ్చినట్లనిపించింది.

అయితే, పొరుగింటి లక్కాయి భార్య మాత్రం,

"మొయిలిం వొచ్చినట్టుగుంది. ఏటి కబురు తెచ్చేడేటి?" అని లోగొంతులో బంతికి దగ్గరగా వచ్చి అడిగింది.

బంతికేం చెప్పాలో బోధపడలేదు.

ఆమెగూడా మరి ప్రశ్నించలేదు. మరేవేవో కాసేపు మాట్లాడుకొని ఏ రాత్రికో అందరూ ఎవరిళ్లకు వారు వెళ్లిపోయి నిద్రబోయేరు.

మర్నాడు ఉదయం బంతీ, మరికొంత మంది ఆడవాళ్లూ పార్వతీపురం బయల్దేరారు. పది గంటలకల్లా... బస్సు దిగి, మేజిస్ట్రేట్ కోర్టు చేరుకున్నారు.

అంతకు ముందెప్పుడో వచ్చేసి, అరెస్ట యిన తమ బిడ్డల బెయిల్‌కోసం ఎదురు చూసి, చూసీ తలలు వేలాడేసిన తల్లిదండ్రు ల్లా... కోర్టు ఆవరణలో చెట్లు నిల్చున్నాయి.

పుచ్చుకున్న ఫీజుకు సరిపడా న్యాయం యిప్పిస్తానని నల్లకోటు లోంచి నమ్మకంగా చెప్పి, క్లయింట్లకు మేజిస్ట్రేట్ ముందు ఎలా మాట్లాడాలో, యే సాక్ష్యం ఎలా చెప్పాలో వివరిస్తున్నారు... కొందరు న్యాయవాదులు అక్కడక్కడా నిలబడి.

పోలీసులు ఎవరెవరినో వెంటబెట్టుకు వస్తున్నారు. కోర్టు వరండాలో అటూ యిటూ తిరిగే జనాలు ఆవరణలో జనాలు. వారిమ ధ్య వకీళ్ళు, పోలీసులూ ప్లీడరు గుమస్తా లూ... సందడి సందడిగా గొరడసంతలా కన్పించింది బంతికి



బంతి ఎవర్ని కలియడం? ఏ లాయర్ని కలవటం అని ఆలోచిస్తూ అక్కడే అటూ, యిటూ చూస్తోంది.

అప్పుడే కోర్టు వరండా మెట్లు దిగుతూ, మొఖిలం కన్పించేడు. ఆ అబ్బాయితో మరో యువకుడు వున్నాడు. ఇద్దరూ మెట్లు దిగి వచ్చి బంతిని కలిసేరు.

"మీకోసమే చూస్తున్నాం. నా పేరు ప్ర కాశ్. అరెస్టయిన వాళ్ల పేర్లూ, తండ్రుల

పేర్లూ, వయసుల వివరాలూ రాసి యిస్తే లాయర్ గారికిస్తాను. బెయిలు దరకాస్తు రాయిస్తాను'' ప్రకాష్ తనను తాను పరిచయం చేసుకుని, కావలసిన వివరాలు అడిగేడు.

బంతీ, బంతితోపాటూ వచ్చిన ఆడవాళ్లూ అరెస్టయిన వాళ్ల వివరాలు చెప్తుంటే ప్రకాష్ రాసుకుంటున్నాడు.

అప్పుడే ఆరికగూడ సర్పంచ్ సంగమేశు వచ్చేడు. ఆయన తన వెంట మరో యిద్దర్ని తీసుకువచ్చేడు. వాళ్లు ముగ్గురూ ప్రకాష్‌ని పలుకరించేరు. ప్రకాష్ వాళ్లను చూస్తూనే,

"తెచ్చారా.. సూరిటీ బాండ్స్?" అనడిగేడు.

"ఆ యివిగో' అని, ఆ ముగ్గురూ తమ ఆస్తుల వివరాలు సర్పంచ్ చేత ధృవీకరించబడిన, సూరిటీ బాండ్స్ చూపించేరు.

వాటిని తీసుకొని, తను రాసిన వివరాల కాయితం పట్టుకొని ప్రకాష్ లాయర్ దగ్గరకు వెళ్లాడు. అందర్నీ అక్కడే వుండమని చెప్పాడు.

అందరూ ఆ చెట్టు నీడన కూర్చున్నారు. కోర్టు ఆవరణలో చెట్లు ఎంత ఉపయోగకరమో బంతికి అప్పుడు అర్థమైంది. అవీ యివీ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు చెట్లనీడలో.

"అమ్మా బంతెమ్మా! నీకు ఉద్యోగమేదీ రాలేదా?" అని అడిగేడు సర్పంచ్ సంగమేశు.

బంతి బదులు చెప్పటానికి సంశయిస్తోంది. రాలేదని చెప్పడమా, వచ్చీ పోయిందని చెప్పటమా అనే సందిగ్ధంలో వుండిపోయింది.

"ఈ చేత్తోటి ఉజ్జోగమిచ్చి, ఆ చేత్తోటి టెంపర్‌వోరీ అనీ నిధుల్లేవనీ ఆ తర్వాత తీసేస్తారు! ఈ అమ్మ మా ఊరి ఆశ్రమస్కూలు సంగీతం మేస్టుగదా?" సంశయాల్ని చెరిపేసి, సమాధానం చెప్పాడు సంగమేశు వెంటనచ్చిన యిద్దర్లో ఒకాయన.

బంతి ఆయన్ని చూసి పోల్చుకుంది. మొయిలం తండ్రే అతను. పలకరింపుగా నవ్వింది అతన్ని చూసి.

"డిగ్రీ పేసయిపోనావట! ఇంకేదో పెద్ద సదువు యింటి కాడనించే సదువుతున్నావట! బాగా సదివి, రూల్సూగీల్సూ తెలుసుకోమ్మా. పెద్ద ఆఫీసరుగా నువ్వేన మన యేరియాకొస్తే మన బాధలు తీరతాయేమో?" సర్పంచ్ ఆశగా ఆకాంక్షించేడు.

బంతి... ఓ నవ్వు నవ్వేసి, లేచి నిలబడింది. కోర్టులోంచి ప్రకాష్ వచ్చేడు. "కాగితాలవీ అప్పజెప్పేసాం. గంటా, గంటన్నరలోపుల పోలీసులు మనోళ్లని తేవటమే ఆలస్యం, తేగానే ప్రొడ్యూస్ చేసేస్తారు. కోర్టులో బెయిల్ వచ్చేస్తుంది. రండి, ఈ గంటకాలం యిక్కడుండి చేసేదేముంది. బయటికెళ్లి, టీ అయినా తాగి వద్దాం" అని, అందర్నీ బయటకు తీసుకెళ్లాడు.

ప్రకాష్ చెప్పినట్లుగానే, గంట కాలం దాటేక, అరెస్టయిన వాళ్లందర్నీ బెయిల్‌మీద విడిచిపెట్టేరు. కంతుడు... కోర్టులో బంతిని చూసి ఆశ్చర్యపోయేడు. బంతి వస్తుందనుకోలేదు.

ప్రకాష్ అందరితోనూ ఏవేవో మాట్లాడి కాంప్లెక్స్ వరకూ కలిసి వచ్చేరు. ప్రకాషూ, సర్పంచూ, మొయిలం వాళ్లంతా వారి ఊరి వేపు పొయ్యే బస్సు ఎక్కారు. బంతీ, కంతుడూ, వలసవాళ్లూ తమ ఊరి బస్ ఎక్కారు.

బంతి బస్సులో కిటికీ పక్క సీటులో కూర్చుంది. మొయిలం ఆ కిటికీ దగ్గరకొచ్చి,

"మేడమ్ భీమన్న యీపాటికి వలస వచ్చీసుంటాడు'' అని చెప్పాడు.

బంతికి ఆ వార్త ఎంతో ఆనందాన్ని కల్గించింది. ఎంతవేగం బస్ తమ వలస దారి జంక్షన్ చేరుతుందాఅక్కడ్నించి పరుగె




త్తి ఎంత వేగం భీముడ్ని కలవగలనా అని ఆలోచించసాగింది బంతి. ఈ ఆలోచనవల్ల కాలం నెమ్మదిగా కదుల్తోన్నట్లు బస్సు మెల్ల గా నడుస్తున్నట్లూ అన్పిస్తోంది బంతికి.



ఈ కేసుల్తో అరెస్టుల్తో జనాలు మళ్లీ భూమి కోసం తగువుకి దిగరనీ, గెడ్డపాలం ఊసు మరెత్తరనీ భావించేడు కాంట్రాక్టర్ జగ్గారావు. అందుకనే, కాస్త చేయి యెక్కువ గానే విదిలించి పోలీసుల్ని సంతోషపరిచేడు. ఎమ్మెల్యే ద్వారా రెవిన్యూ అధికార్లని నిద్ర పోనిచ్చేడు.

కానీ జగ్గారావు అనుకున్నట్లు జరుగలేదు. క్రిందటిసారి అరెస్టుగాకుండా తప్పించుకొని అజ్ఞాతంలోకి వెళ్లినవాళ్లు ఈసారి గెడ్డపాలం చేనుకి గాబుతీతకు వెళ్లారు. సాయంత్రందా కా గాబుదీసి, చేనుకి నీరుగట్టి పొద్దుబోయే వేళ వలసలోకి వచ్చేరు. అంతా ఒక దగ్గర చేరి, పోలీసుల రాకకోసం యెదురు చూసేరు. భీముడే దీనికి నాయకత్వం వహించేడు.

ఎందుకో ఈసారి పోలీసులు రాలేదు.

జట్లు జట్లుగా పొలంలోకి వెళ్లి పనిచేయా లనీ, పోలీసులుగానీ అరెస్టుజేస్తే ఒక జట్టు అరెస్టవుతుంటే మరో జట్టు పొలంలోకి దిగా లనీ అరెస్టయిన జట్టు బెయిలు మీద విడుద లయి మళ్లీ పొలంలోకి వెళ్లాలని మళ్లీమళ్లీ పొలంలో దిగడాలు, అరెస్టులు కావడాలు, విడుదలయి మళ్లీ పొలంలోకి వెళ్లడమూ కొనసాగించాలని నిర్ణయించేరట.

బంతి ఆశ్చర్యపోయింది... ఈ భోగట్టా తెలుసుకొని! ఎక్కడిదీ వ్యూహరచనా విజ్ఞానం? చివరికి యేం జరుగుతుంది?

ఎందుకో యీ మార్గంపట్ల బంతికి వ్య తిరేకత కలుగుతోంది. ఏదో అపరాధం చేస్తు న్నారు వీళ్లు... అనుకుంటోంది. అలా తన మనసులోని భావాన్ని చెప్పేసిందిగూడా భీముడితో!

"అదేమిటి? అపరాధంగా ఎందుకన్పి స్తుంది? ఏది అపరాధం?" ప్రశ్నించేడు భీము డు.

బంతి తన లోలోపలి ఆలోచనలను కూడ బలుక్కుంది. జరిగిన జరుగుతోన్న సంఘట నలను ముందు పెట్టుకు పరిశీలించింది. అప్పుడు ఆమెకు మనసుల్లో కదిలిన జవా బు... స్పష్టమైంది.

"ఈ మార్గం చట్టబద్ధం కానిది'' చె ప్పింది.

ఆ జవాబుకు భీముడు వెంటనే యేమీ అనలేదు. మౌనంగా ఓ క్షణంసేపు ఆలో చించి, ఆ తర్వాత బంతిని సూటిగా చూస్తూ-

"నువ్వు టీచరమ్మగా పన్జేసేవుగదా! ఇద్ద రు పిల్లలు వ్యతిరేకంగా ఆడితే ఏం జేస్తావ్?" ప్రశ్నించేడు.

"యిద్దర్నీ ఆటలోంచి ఔట్ చేయించేస్తా ను, పంపించేస్తాను'' జవాబు చెప్పింది బంతి... తడుముకోకుండా!

"అందులో ఒక పిల్లడు రూల్స్ తప్పించి ఆడేడనుకో. అది నువ్వు చూడలేదనుకో. అపుడేమో... మొదటి పిల్లడ్ని యెదిరించి గెలవాలని రెండో పిల్లడూ రూల్స్ తప్పించి ఆడితే... అపుడేటి జేస్తావ్?" అభినయంతో సహా దృశ్యాన్ని చూపించి ప్రశ్నించేడు భీముడు.

"... ..." ఆలోచిస్తూ వుండిపోయింది

బంతి.

భీముడు విశ్లేషణ నేర్చుకున్నాడు... అని గ్రహించింది. ఒక్షణం తర్వాత-

"... యిది ఆటకాదు!... బతుకు!" బతుకుపట్ల ప్రేమ ఉట్టిపడే కంఠంతో పలికింది బంతి.

"అందుకే... అందుకే... బతుకనే యింత ఆరాటం! ఆట అయితే వొదిలేస్తాం. ఆటలో అరటిపండు పోతే పోయిందిలే అనుకుంటాం. గాని యిది బతుకు... అలాగొదిలీ లేం" అన్నాడు భీముడు ధృఢంగా. బతుకు సమస్యని తేలిగ్గా తీసుకోలేం అన్నంత స్థిరంగా.

ఆ తర్వాత ఆ గెడ్డపొలాన్ని యెవరూ వొదల్లేదు. వలస జనాలు గాబుదీస్తే జగ్గారావు మరోరోజు ఎరువు జల్లించేవాడు. వీళ్లు నీరుగడితే అతను పురుగుమందు కొట్టించేవాడు. ఎవరూ తగ్గటంలేదు. అలాగని తగువుకీ దిగలేదు. ఎవరి వ్యూహంలో వారు ఉన్నట్టేవుంది. రెండువర్గాలవారూ పొలం సాగుచేశారు.

బంతికి ఈ వ్యవహారమంతా భయంభయంగా వుంది. ఎటునించి యెటొస్తుందో? జగ్గారావు పలుకుబడీ, పెట్టుబడీ గలవాడు. అతడికి అడ్డులేదు. అడ్డొచ్చేవారిని తొలగించుకోగలడు! బంతి అదే భయపడుతోంది. భీముడితోపాటూ తాతయ్యకూడా గెడ్డపొలం విషయంలోమాత్రం వెనకడుగు వెయ్యలేమమ్మా అంటాడు!

కార్తెలు గిరగిరా తిరిగేయి. పంటలు కోతకెదిగొచ్చేయి. పొలాలన్నీ పండిన వరి ఎన్నుగింజలు బంగారపు రంగులో మెరుస్తున్నాయి. పంటలకోతకు ముహూర్తం గట్టి కొత్తలపండుగ చేసే సందడిలో వున్నాయి వలసలన్నీ.

ఒకరోజు పల్లం గ్రామానికి వెళ్లిన లక్కాయి అట్నించి తిరిగొచ్చి...

"గెడ్డపొలం పంటని కోయించి, బళ్లమీద పట్టుకుపోడానికి మనుసుల్ని పురమాయిస్తుండట జగ్గారావు. రౌడీవోళ్లని దించుతాడట... ఎం.పీ.గోర్ని పట్టుకున్నాడట. సొమ్ము యిచ్చేడట! దాంతోటి ఆ ఎంపీగోడేమో కొండనాకొడుకుల్ని కొట్టేసి గెడ్డల పడీయండి. ఆ తరాత వొచ్చేది నేను సూసుకుంతానని దన్నిచ్చేడట" చెప్పుకొచ్చేడు.

భీముడూ, కంఠుడూ, మరో యిద్దరు ఎదురిళ్లవారూ కూర్చున్నారు. అప్పుడే బంతి గూడా వచ్చి నిల్చుంది.

లక్కాయ్ తెచ్చిన వార్త నిజమేనని అబద్ధం కాదని చెప్పేందుకు మళ్లీ ఆ వార్తనే సూక్ష్మీకరించి చెప్పి-

"సొమ్మూ, పలుకుబడీ కలిసినాయంతే... డేంజరు. సూస్కోరో... జేగర్త... అని మా నేస్తంలేడా? పల్లంల... పడేత రామునాయ్డు... ఆ బావ్ సెప్పాడు. ఇంక మీకు అబద్ధమయితే మా నేస్తం వొస్తాడు. అడగండి. ఔనో, కాదో తేలిపోద్ది'' అని గూడా వక్కాణించేడు.

దాంతో భీముడు కూచున్నవాడు ఆవేశంగా లేచి భుజమ్మీది గావంచాను దులిపి-

"అదిగదేమాట నిజమయితే ఆ ఎం.పీగోడికే కవురెడుదాం. సేనిగొయ్యడం సేతయినోడు సేనిగోస్తాడు. పీకలు గోసీవోడికి సేని కోత సేత అవదురా... అని కవురెడుదుం.

ఈపాలికి మీము సేనీ కోత్తాం. అడ్డుకుంతే పీకలూ గోత్తాం. దమ్మున్నోడివయితే... నువ్వే రారా అని కవురెడుదుం" అన్నాడు.

భీముడి ఆవేశం చూసి బంతికి గుండెలు గబగబా కొట్టుకోసాగేయి. ఇరువర్గాలవారూ చేనుకోతలకంటే పీకల కోతలకే సిద్ధమవుతున్నారా అని భయపడింది.

ఏలాగోలా యీసారి రాజీపరచాలి. మార్గమేదో ఆలోచించాలి. అంతవరకూ భీముడ్నీ, వలస జనాల్నీ తగ్గించాలి... అని మనసులో




ఆలోచించిన బంతి-

"అదిగాదు... ఒట్టినే యేవో వార్తలు పట్టుకు తగువుకి తయారవడమెందుకూ? అదీగాక దీనికి మరి రాజీయేటి లేదా?" అని సౌమ్యంగా భీముడ్ని అడిగింది.

"అంతే యేటి నీ ఉద్దేశం...?" ప్రశ్నించే డు భీముడు.

"ఈ తగువులూ, తంటాలూ... కొట్లాట లూ లేకుండా పంటచేను సమస్య పరిష్కార మయ్యే దారి చూడరాదా? కొట్లాటవల్ల యిరు వర్గాలూ నష్టపోవచ్చుగదా?" అంది బంతి సామరస్యపూర్వక పరిష్కారంకోసం ఆలో చించనున్న ధోరణిలో.

భీముడు ఓ నిట్టూర్పు విడిచి - "ఇంకోడి పెళ్లాన్ని ఎత్తుకుపోయి మధ్యవర్తులమీద బా ణాలేసిన రావణాసురుడితోటీ రాములోరు సామరస్యంగ సూసుకుందుమంతే... సీత మ్మోరి పనేటయ్యేది? వొంద తలకాయలు న్నోడయినా ధర్మయిరుద్ధంగా నడిస్తే... తల కాయిలు నరికీమన్నాడు రాములోరు. భగ వొంతుడి మాట యిది'' భీముడు చాలా దృఢంగా అన్న మాటలివి.

ఈ జవాబుతో బంతికి ఎక్కడలేని కో పంవూ వొచ్చింది. కోపంతో ఊగిపోతూ-

"ధర్మాధర్మాల్ని నిర్ణయించేది నువ్వు కా దుగదా? అసలు నువ్వెవరివి... తప్పొప్పు లు తేల్చడానికి? దానికో ప్రభుత్వముంది.

ప్రతిదానికీ గొడ్డో అంటే తేరా దుడ్డు అనడమేనా? నీ యిష్టమేనా? అసలేమను కుంటన్నావ్... ప్రాణాలంటే?

నీకు ప్రాణాలంటే లెక్క లేకపోవచ్చు... గానీ మిగిలినవాళ్లకో? ఈ వలస ప్రజలు.. పది కాలాలపాటు బతకాలనుకుంటున్నారు. అది, అదాలోచించవేం? ఛీ..." గట్టిగా కేకలేసింది.

ఎన్నడూ... బంతి భీముడితో యిలా కేకలేయలేదు. భయమూ, ఆరాధనా, అభిమా నమూ... నిండిన గుండెల్తో భీముని తన మనసులో నింపుకున్న బంతి... యీ వ్యవ హారంలో భీముని ధోరణే సామరస్యపూర్వక పరిష్కారానికి ఆటంకంగా వుందన్న... భావ నతో అలా కేకలేసింది.

బంతి కేకలు అయిపోయేక, ఆమె శాంతించేదాక మౌనం వహించి మళ్ళీ కూర్చుని బంతిని పిల్చి కూర్చోమని చెప్పి అప్పుడు నిదానంగా స్థిరంగా మాట్లాడేడు భీముడు.

"బంతీ! కొట్లాటను నేను కోరుకోడంలేదు. అలగని... వలసా కోరుకోడంలేదు. మాకెవ్వ లికీ యిస్టంలేదు. గాని మరి మార్గం లేనప్పు డు... తగ్గగూడదనేదే మా ఉద్దేశం.

పోనీ, అదలాగుండనీ. ఇపుడు నీ ముందల వొక దోవ పెడతన్నాను. ఆ దోవ లోన మమ్మల్ని నడిపించు... వొచ్చేస్తాం" అన్నాడు.

ఆ దోవ యేదో చెప్పు... అన్నట్లుగా చూసింది బంతి.

"గెడ్డపొలం మన వలసకే చెందుతాది. ఆ యిసయం రికార్డులు తేల్సినా, తేల్సకపోయి నా అందరికీ తెలిసిన సత్యమిది. అయినా రికార్డుల తేల్సిందాక మీమూ తొందరపడం.

అయితే ఈ యేడాదికి ఆ జెగ్గారావు జొరావరి జేస్సి, దిగిపోనాడు. అది తప్పుగా దా? అయినా తప్పు అనిమాత్రం యెవుళూ అను. పోన్నే, ఆ తప్పు అలగుండనీ.

ఈ యేడాది పంటకి... ఆడు యెట్టిన మదుపుకి సరిపడా పంట తీసేసి ఆడికిచ్చేసి ఆ మిగిలిన పంటని రెండు వాటాలేసిద్దుము. ఒక వోటా ఆ జెగ్గారావుది... మరో వాటా జమ్మొలసది! ఇదీ నీను సెప్పే దోవ!

అయితిది... యీ పంటకే! మళ్లీయేడు పంటకి.., ఆ జెగ్గారావు ఆ భూమి ఊసు ఎత్తుగూడదు... అం!

ఈ దోవని నడిపించు. మాట తప్పితే అప్పుడడుగు'' అని చెప్పి బంతినుండి జవా

బుగూడా వినకుండా లేచి వెళ్లిపోయేడు భీముడు.

అందరూ భీముడు చెప్పిన పరిష్కారం సబబుగా వుందన్నారు. నిజమే! ఇది న్యాయంగా, సమంజసంగా వుంది! అయితే... యీవిధంగా పరిష్కారాన్ని చేసేవాళ్లెవరు? ఎవరు చేయగలరు? ఆలోచిస్తోంది బంతి.

రెండు, మూడురోజులు... రాత్రీపగలు ఈ సమస్య పరిష్కారమార్గం ధ్యాసలోనే గడిపింది బంతి. నాలుగోరోజు ఉదయాన్నే బయల్దేరి ముందు ఐ.టి.డి.ఎ. ప్రాజెక్ట్ ఆఫీసర్‌గార్ని కలిసింది. గెడ్డపొలం పంటకోసం యిరువర్గాలు ఘర్షణకు మోహరింపవుతున్న పరిస్థితిని చెప్పింది. సమస్య పరిష్కారానికి భీముడు చేసిన ప్రతిపాదనను పీ.వో.గారికి వివరించింది. భీముడు పెట్టిన షరతు వచ్చేయేడాది భూమి ఊసు జగ్గారావు యెత్తగూడదన్నది చెప్పలేదామె. ఎప్పటి విషయమో యిపుడెందుకు షరతుగా పెట్టడమనీ, ఈలోగా రికార్డుల పరిశీలన పూర్తి అవదా... అని భావించి షరతు విషయం చెప్పలేదు.

పీ.వో.గారు అంతా విన్నారు. విని, కుర్చీలో సర్దుకు కూర్చొని "బాగానేవుంది మీ ప్రతిపాదన. గానీ మేము రూల్స్‌ప్రకారం పోవాలిగదా! ఆ భూమిమీద యింజక్షన్ ఆర్డర్ వేశాము. ఎవ్వరూ సాగుచేయగూడదు. అయినా సాగుచేశారు!

ఇపుడయినా మా ఏక్షన్ రూల్స్‌ప్రకారమే వుండాలిగదా?" అని చెప్పి టేబుల్‌మీది గ్లాసులోని నీళ్లు ఓ గుక్కెడు తాగేరు. ఆ తర్వాత గ్లాసు అక్కడ పెట్టేసి జేబులోంచి రుమాలు తీసి మూతి తుడుచుకొన్న తర్వాత-

"రూల్స్‌ప్రకారం ఆ భూమిలోని పంటను యిరువర్గాలవారినీ ముట్టుకోనీయగూడదు'' అన్నారు బంతివైపు చూస్తూ.

"అందుకు యే వర్గమూ వొప్పుకునేట్లు లేదుగద సార్' బంతి.

"ఒప్పుకోకపోతే ఊరుకుంటామా? ఏక్షన్ తీసుకుంటాం"

"ఇంజక్షన్ వుండగా జగ్గారావు భూమి దున్నితే తీసుకున్న ఏక్షన్ ఏమయ్యిందో తెలీడంలేదా?" కోపం వస్తోంది బంతికి. ఎందుకు వాస్తవాలను చూడటంలేదీయన... అన్న ఆక్రోశం!

"ఈసారి పోలీస్ ఫోర్స్‌ని దించుతాం" అంటూ పీ.వోగారు కుర్చీలోంచి లేచిపోయేరు.

బంతి ఆశ్చర్యపోతూ కుర్చీలోంచి తనూ లేవక తప్పిందిగాదు. సమస్య తీవ్రతను పట్టించుకోకుండా యింత నిర్లిప్తంగా ఈ అధికారి ఎలా ఉండగలుగుతున్నాడని ఆశ్చర్యపోతోంది బంతి. ఈయనగారి అజమాయిషీలో గిరిజన సంక్షేమం ఉందన్న సంగతి గుర్తొచ్చి నిట్టూర్చింది. అధికారులు ఇలా వుండబట్టేగదా ఒకడు ప్రభుత్వాన్ని ధిక్కరిస్తున్నాడు, మరొకడు ప్రభుత్వాన్ని అనుమానిస్తున్నాడు!

పీ.వో.గారు గదిలోంచి బయటికొస్తూ-

"గ్రామ పెద్దల పంచాయితీలాగా... సెటిల్ చేయడానికి ప్రభుత్వ చట్టాలు వొప్పుకోవు. చట్టాల ప్రకారమే మా చర్యలుండాలి'' అని మళ్లీ చెప్పారు.

బంతి మరింకేమీ వినడంలేదు. ఈ ఆశ వొదులుకోవడమే! ఇప్పుడిక ఎవర్ని కలియడం... యిదే ఆలోచన బంతిలో!

ఎంపీగారు గుర్తొచ్చేరు.

ఆ పార్లమెంటు, ఎసెంబ్లీ నియోజకవర్గాలు షెడ్యూల్డ్ తెగలకు కేటాయించబడినవి! ఎమ్మెల్యే, ఎం.పీ. యిద్దరూ గిరిజన తెగకు చెందుతారో చెందరో తెలీదుగానీ గిరిజన బతుక్కి చెందరు. గిరిజనవర్గానికి చెందరు. గిరిజనులెవరికీ అందనంత స్థాయికి చెందినవారు. మాజీ సంస్థానాధీశులు! చెరో రాజకీయపార్టీ నాయకులు! వారి దర్శనమే దుర్లభం!




ఎలాగో ఎంపీగారి దర్శనభాగ్యం కలి గింది బంతికి. విషయమంతా చెప్పింది. ఆయన వెంటనే ఐ.టి.డి.ఎ. పీవోగారికి ఫోన్ చేశాడు. ఆ తర్వాత జిల్లా పోలీస్ సూప రింటెండెంట్కి ఫోన్ చేశాడు. మరెవరో అధికారికి ఫోనుచేశాడు తప్ప భీముడి ప్రతి పాదన విషయం ఆలోచించడు. బంతి గుర్తు చేస్తున్నా ఆ విషయం తప్పించేసి శాంతిభద్ర తల గురించి మాట్లాడతాడు. పోలీస్ఫోర్స్ దించి లా అండ్ ఆర్డర్ని రక్షించాలంటాడు.

బంతికి నీరసం వచ్చేసింది. ఎందుకు వీళ్లంతా తన ఆందోళనను అర్థంచేసుకోవ టంలేదు? వీళ్లకు అర్థమయ్యేరీతిలో తను వివరించలేకపోతున్నానా... అని తర్కించుకో సాగింది బంతి.

చివరికి దేవుడిమీద భారంవేసి ఎంపీగారి దగ్గర సెలవు తీసుకు వచ్చేసింది.

★ ★ ★

ఆ తర్వాత రోజుకో పుకారు...!

"జగ్గారావు గూండాల్ని పంపించి జమ్మొ లసమీద బాంబుల్తోటి దాడి చేయిస్తాడట"

"కాదు... కాదు... పోలీసోల్ని ఉరకదోలి అరెస్టులు చేయించి, లాకప్పుల్లో కొట్టించి చంపిస్తాడట"

"అసలోలొకరిద్దరు... ఆ భీముడూ, లక్కాయినీ... దోవల కాసి చంపించి, శవా ల్ని మాయంజేయిస్తాడట"

రకరకాల పుకార్లు... రోజుకొకటి వలసలో విన్పిస్తున్నాయి. భీముడు... అన్ని పుకార్లూ విని వూరుకుంటున్నాడే తప్పా ప్రతిగా వ్యా ఖ్యానం చేయటంలేదు. మౌనం వహించిన ఆగ్రహంలా వుంటున్నాడు. బంతికి ఏమీ అర్థంకాలేదు భీముడి అంతరంగం. అదేమి చిత్రమో... తాతయ్య గూడా మౌనం వహించేడు...!

జమ్మొలస దీసరి 'కొత్తలపండగ' ము హూర్తం పెట్టేడు. వలసోల్లందరూ కొత్తల పండగ సందడిలో వున్నారు. పందిని బలి చ్చేరు. జాకరదేవతను మొక్కేరు. మొక్కు లు తీర్చుకున్నారు. ఇక పంటల్ని కొత్త కలపటం ఆరంభించేరు. గెడ్డపొలం చేను కోతకు ఫలానా రోజు ఊరందరూ వెళ్లాలని పండగనాడే నిర్ణయించేడు భీముడు.

"పండగరోజున గూడా యిదేనా విషయం మాట్లాడేది? వివాదం తప్ప... వినోదం గురించి నీ మనసులో ఆలోచన రాదా?" అన్న భావంలో చిరుకోపం ప్రదర్శి స్తూ మాట్లాడింది బంతి!

ఆమె మాటలకు భీముడు చిరునవ్వు జవాబుగా వొదిలేసి, తన యేర్పాట్లు తాను చూసుకోసాగేడు.

కొత్తలపండగ వేడుక సాగుతోంది. మర్నా డు ఒక ఎస్సయ్, నలుగురు కానిస్టేబుళ్లూ గెడ్డపొలం దగ్గర కేంప్ వేసారు. పంటను కాపలా కాయడానికి వచ్చిన రక్షకభటులు వాళ్లు! ఎస్సయ్గారి దగ్గర ఒక త్రీనాట్త్రీ తుపాకి వుంది, జవాన్ల దగ్గర అదీలేదు. లాఠీలు మాత్రమే వున్నాయి.

జమ్మొలస జనం ఈ పోలీస్ పికెట్ను చూసి గతుక్కుమన్నారు! ఎందుకొచ్చేరు వీళ్లూ...?

భీముడు తిన్నగా పోలీసుల దగ్గరకే వెళ్లి విషయం కనుక్కొని వచ్చేడు. అతనిచుట్టూ చేరినవారితో-

"గెడ్డపొలం పంటని మనముగానీ, ఆ జగ్గారావుగానీ కోయగూడదట. చేను కోసేవా రిమీద చర్య దీసుకుంటారట! పంటకి ప్రొట క్సన్కి వొచ్చేరట పోలీసులు'' అని చెప్పాడు.

"అయితె మరిపుడెలాగ? మరి మనం చేను కొయ్యమా?" అడిగేడు లక్కాయ్.

"సూద్దుం. మనోల్తోటి ఆలోసిద్దుం. అదీ గాక ఆ జెగ్గారావుగాడేటి జేత్తాడో? ఆడి ఆలోసనేటో సూద్దుం. దాన్నిబట్టి మనమూ ఆలోసించుకొందుం" అన్నాడు భీముడు మనసులోనే ఈ సమస్యను అన్నివైపుల

నుంచీ పరిశీలిస్తూ!

దాంతో జమ్మొలస జనం పొలం కోతగురించి నిర్ణయించిన రోజుని వాయిదా వేసుకున్నారు. ఎవరి స్వంతపొలం పనుల్లో వారు పడిపోయేరు.

రెండ్రోజులు పోతే విషయం తెలుస్తుంది, జగ్గారావు ఎత్తుగడబట్టి తమ ఎత్తుగడ నిర్ణయించొచ్చని నిదానించేడు భీముడు.

గానీ రెండ్రోజులు ఆగలేదు! చరిత్ర ఒక్కోసారి గెంతు గెంతి మలుపు తిరుగుతుంది!

జమ్మొలస జనం చేనుకోత వాయిదా వేసుకొని, ఎవరి పనుల్లోకి వాళ్లు వెళ్లిపోయినరోజే జగ్గారావు చేను కోయించి తెచ్చుకోడానికి బందోబస్తు చేసుకున్నాడు. పట్నంనుంచి కిరాయి గూండాలను తెప్పించుకున్నాడు. తమ ఊరిలోని మోతుబరి రైతుల దగ్గర నుంచి ఎడ్లనూ, బళ్లనూ సమకూర్చుకున్నాడు. ఎక్కువ మొత్తంలో కూలి యిస్తానని దూరప్రాంత గ్రామాలలోని కూలీలను తీసుకొచ్చేడు. మొత్తంమీద యాభయి ఎడ్లబళ్లతోనూ రెండొందలమంది కూలీలు, గూండాలతోను చేను కోతకు కొడవళ్లేగాక కొట్లాటకు కర్రలూ, కత్తులూ, బరిసెలూ ఏర్పాటుచేసి, అందరికీ మోతాదుమీద నాటుసారా పోయించి, గెడ్డపొలం చేనుకోతకి దింపేడు!

దండులాగా రెండొందలమంది జనం ఎడ్లబళ్లు, వరసలు... గెడ్డపొలం చేరి కోతకు దిగేరు. వీళ్లను జూసి, పోలీసులు లాఠీలు తిప్పి, "చేను కోయగూడదు... తప్పు. వెళిపోండి'' అని చెప్పబోయేరు. కిరాయి గూండాలు... దుడ్డుగర్రలు తిప్పేరు. పోలీసుల లాఠీలు యెగిరిపోయేయి. దుడ్డుగర్రలు శరీరాలమీద పడ్తున్నాయి. ఎస్సయిగారు ఇక లాభంలేదని త్రీనాట్ త్రీ తుపాకీ తీసి కాల్పులు ఆరంభించబోయేరు. మూకగా గూండాలు మీదబడి, తుపాకీ లాక్కొని ఎస్సయిని కుళ్లబొడిసేరు కర్రల్తో! దాంతో కకావికలై పోలీసులు... పరుగెత్తి పారిపోబోయేరు.

"పట్టుకోండ్రా పోలీసోళ్ని. పట్టుకొని గట్టుమీద యిప్పచెట్టుకి కట్టేయండ్రా. చేను కోత యిందాక ఆళ్లని వొదలొద్దు. వొదిల్తే... మళ్లా మందితోటి వొత్తారు. పట్టుకోండి'' అని కేకేశాడు గూండాల నాయకుడు.

పంట కాపలాకు వచ్చిన పోలీసులు... పంట చేను గట్టుమీది యిప్పచెట్టుకి బంధించబడ్డారు. గూండాల పర్యవేక్షణలో కూలీలు చేనుకోత ఆరంభించేరు.

పోలీసులు... పంట చేనును పక్షుల నుంచీ, జంతువులనుంచీ రక్షణకోసం పొలాలమధ్య రైతులు నిలిపే 'దిష్టిబొమ్మ'లైనారు. ఆ దిష్టిబొమ్మ ఏ పక్షినీ నిలువరించదు. మళ్లీ రైతే పంట కాపలా కాసుకోవాల!

గబగబా... చకచకా కొడవళ్లు పరుగెత్తాయి. చేను కోత పూర్తయింది. ఎడ్లబళ్లకు చేను ఎక్కించటం ఆరంభించేరు. గూండాలు విజయగర్వంతో ఈలలు వేయసాగారు. కేరింతలు గొడుతూ గెడ్డపొలం గట్టుమీద గంతులు వేయసాగేరు.

ఈ వార్త ఎలా తెలిసిందో పోడుమీదకీ, అడివిలోకీ, పొలాలకీ తెలిసింది. జమ్మొవలస జనం... వార్త విన్నవారు, విన్నవెంటనే పరుగు పరుగున గెడ్డపొలం దగ్గరకు పరుగెత్తుకొచ్చేరు. ఎవరికి వారుగా చేత ఆయుధాలేమీ లేకుండా చేస్తోన్న వ్యవసాయ పనిముట్లతో పరుగెత్తుకొచ్చినవారిని గట్టుమీద ఆయుధాల్తో స్వైరవిహారం చేస్తోన్న గూండాలు దాడిచేసి కొట్టిపడేస్తున్నారు. చేను బండ్లను ఆపాలన్న ఆరాటంతో జమ్మొలస జనం గూండాల దాడిలో చిక్కుకున్నారు. తేరుకొని ఆలోచించి అందరొకటిగా ప్రతిఘటించే వీలు లేకుండా గూండాలు ఎందరినో పంటపొలంలో కొట్టి పడేసారు.

అందరిలాగే భీముడూ పరుగెత్తుకొచ్చేడు. అడవిలో కట్టెలు గొడ్తోన్న గొడ్డలి చేతిలో వుంది. చేను బండిమీదనున్న గూండామీద




గొడ్డలి విసిరేడు భీముడు. గూండా చేయి తెగిపడింది. ఎడ్లను విప్పేసి చేను బండి మొకరాను నేలకు దించేడు భీముడు. ఈలోగా పక్కచాటుగా బరిసెతో పొడవాలని ఒక గూండా ప్రయత్నించేడు. భీముడు వేట జంతువులా రెప్పపాటులో బరిసెను తప్పించుకొని గొడ్డలితో ఆ గూండా బుర్ర మీద కొట్టేడు. బుర్ర పగిలి స్పృహదప్పి పడిపోయేడు గూండా. భీముడు మరో చేని బండి ఆపడానికి వెళ్లాడు. గట్టుమీదనున్న గూండాలు అంతా గుంపుగా మనిషోవైపు ఒక్కుమ్మడిగా భీముడిమీద తలా ఓ ఆయుధాన్ని విసిరేరు. దేహంనిండా గాయాల్తో... పంట పొలంలో... రక్తాలోడుతూ పడిపోయేడు భీముడు.

ఇంట్లో విస్తర్లు కుడుతోంది బంతి. ఆడవాళ్లెవరో కీచుగొంతుల్తో అరుస్తూ... యేడుస్తూ... యేది దొరికితే అది చేతబట్టుకు పరుగెత్తుతున్నారు. బంతికి అర్థంగాలేదు. ఎందుకు పరుగెత్తుతున్నారో తెలీదు. ఏం జరిగింది...?

ఎక్కడి విస్తర్లు అక్కడొదిలేసి వారితో పాటే పరుగెత్తింది బంతి! తిన్నగా గెడ్డ పొలం చేరుకుంది వాళ్ల వెనుకే!

ప్రవాహంలా వస్తోన్న జనాన్ని చూసి, తోక ముడిచి పారిపోయేరు గూండాలూ, కూలీలూ...! చేను బండ్లను అంతకుముందే పల్లం తోవలోకి తోలేసారు.

బంతి పొలం చేరేసరికి అంతా అయిపోయింది.

దుబ్బు మొదలంటా తెగిన వరిచేను కొయ్యకాళ్లు... ఎర్రగా రక్తంతో తడిసేయి. గట్టుమీద నెత్తురు మరకలు... హాహాకారాలు! ఏడ్పులు... మొరలు!

లక్కాయి... పీక తెగిపడివుంది. జుంబిరిగాడు... భూమిని పిడికిల్తో పట్టుకు... పడిపోయున్నాడు ప్రాణాలొదిలేసి. మరో యిద్దరి తలలు పగిలిపోయాయి.

ఎవరు, ఎవర్ని వెదుకుతున్నారో, యెవర్ని మోసుకెళ్తున్నారో, ఎవరికోసం యేడుస్తున్నారో చెప్పలేం! అంతా శోకమయంగా వుంది. బంతికి గుండెలు దడదడా కొట్టుకున్నాయి. కాళ్లల్లో వణుకు! అప్రయత్నంగానే కళ్లలోంచి ధారాప్రవాహంగా కన్నీళ్లు!

ఏది జరగకుండా వుండాలని ఆరాటపడిందో, ఏ నష్టం తప్పించాలని అన్ని ప్రయత్నాలూ చేసిందో ఆ నష్టం జరిగిపోయింది.

'అయ్యో భగవంతుడా! ఇంత ఘోరమా... నువ్వు జరిపించాల్సింది. ఇంతకీ, నా దేవుడు... భీముడు... భీముడేడీ? భీముడు... ఈ కొట్లాటలో లేడుగదా....?' ఆందోళనతో పొలం అంతా తిరిగింది.

పొలంలో ఒకచోట బోర్లా పడిన శవం కన్పించింది. బంతి భయంభయంగా వెళ్లింది. కండలు దిరిగిన ఆ దేహాన్ని ముక్కలుగా నరికినట్లుంది. దేహంనిండా గాట్లే! బంతికి కుడికన్ను అదరసాగింది. ఆ దేహం కాళ్లను చూసింది. చేతి వేళ్లను ముట్టుకొంది. అనుమానంగా తలను చూసింది. ఉంగరాల జుత్తు... నెత్తుటిలో తడిసింది. దేవుడా...! ఏదీ... నీ మొహం... అనుకుంటూ... ఆ శవాన్ని ఒత్తిగిలించింది. అంతే...! కెవ్వున కేకవేస్తూ స్పృహతప్పి పడిపోయింది బంతి!

తను అమితంగా ఆరాధించే తన సర్వస్వంగా భావించే... భీముడు శవం అయిపోవటాన్ని భరించుకోలేకపోయింది. తన భీముడికి మొహం పారల్తో చెక్కేశారు గావాల... మొహం అంతా రక్తపు ముద్దలా వుంది. తనతో ఊసులాడే చిన్న పిల్లికళ్లు లేవు. విశాలమైన కనుబొమల్తో నుదురులేదు. నెత్తురు ముద్దను చూడలేక పడిపోయింది బంతి.

పొద్దు చీకట్లో మునిగిపోయింది.

బంతిని యెవరో మోసుకొచ్చి సపర్యలు

చేసారు. రాత్రి యే ఝాముకో స్పృహలోకొ చ్చింది బంతి. గభాల్న లేచి కూర్చుంది. బంతి ముందర కూర్చొని నాయినమ్మ... మూగ గోమాతలా... కళ్లవెంబడి కన్నీరు కారుస్తోంది.

బంతి లేచి గడపలోంచి వీధిలోకి వచ్చింది. వలస నిశ్శబ్దంగా, చీకటినిండిన స్మశానంలా వుంది. చాలా ఇళ్లు తలుపులు మూసేసి కన్పించేయి. వీధినంతట్నీ ఓసారి చూసి అంతలో ఏదో గుర్తొచ్చి వెనక్కి వచ్చి నాయినమ్మ దగ్గరకొచ్చి,

"జూజూ... ఏడి నాయినమ్మా? కనిపించ దేమి?" అనడిగింది.

నాయినమ్మ చెప్పిన జవాబు విని "ఆహా... ప్రభుత్వమా! నీకు శతకోటిదండా లు. చనిపోయిన మనుషుల శవాల్నీ పోస్టు మార్టంకని పట్టుకుపోయారా! ఇంకా యీ హత్యలకి ప్రతీకారాన్ని తీర్చుకుంటారని మృ తుల బంధువుల్ని అరెస్ట్‌జేసి పట్టుకుపో తారా? ముసలి నా జూజూ గూడా హత్యకు ప్రతీకారంగా హత్యజేసే శక్తివంతుడా? ముస లివాళ్లని అరెస్టు జేస్తారా? ఆహా... ఏమి చట్టబద్ధపాలన!" బంతి ఆక్రోశించింది.

ఇళ్లల్లో కుమిలి ఏడ్చే జనాలు! వలస చీకటిలో మునిగినవేళ వీధుల్లో తుపాకులు ధరించిన పోలీసులు!

'జమ్ము వలస'లో మళ్లీ ఘర్షణ జరగ కుండా...శాంతిభద్రతల పరిరక్షణకై ఏర్పా టు చేసిన గస్తీ అది!

ఆ తుపాకులే ఆ చీకటిలో ఏ క్షణానో తమమీద పేలుతాయేమోనని భయం వే సిందేమో. బంతి గభాల్న తుపాకీ ధరించి తిరిగే పోలీసుల్ని చూసి ఇంట్లోకి వెళ్లిపోయి తలుపు మూసేసింది. ఇంట్లోని దీపాన్ని గూ డా ఆర్పేసింది. నాయనమ్మను చుట్టేసుకొని ఆ చీకటిలో కుమిలి కుమిలి లోలోనే ఏడ్చింది. రాత్రంతా ఒక్కక్షణం కూడా కంటి మీద కునుకు రాలేదామెకు.

★ ★ ★

మర్నాడు తెల్లగా తెల్లవారలేదు. ఎర్రగా రక్తం వొలికినట్లుగా సూర్యోదయమైంది.

'జమ్మువలస' బిక్కచచ్చి, ఏడుపు ఆపిన పసిబిడ్డలా వుంది. గడపలలో కోకగు డ్డల్తో వేలాడేసిన ఊయలలు ఖాళీగా ఊగుతు న్నాయి. పశువులు సాలల్లో రాటలచుట్టూ గిరగిరా తిరుగుతున్నాయి. వాకిళ్లలో గుంజ లకు మేకలు మేతలేక 'మేం' అంటూ గీపెడుతున్నాయి. వీధి కొసను నిలబడి పే సినిగాడి కుక్క ఎవరికోసమో గొంతునరాలు సాగదీసి అరుస్తోంది.

వలస ఇళ్లల్లో మనుషులు పొగమంచులో మునిగినట్లుగా దుఃఖపు వాతావరణంలో మునిగిపోయివున్నారు.

పట్నంనుండి పోస్ట్ మార్టం తతంగం పూర్తి జేసుకుని పోలీసులు అయిదు శవాల నూ తీసుకుని జమ్మువలస వచ్చేరు.

వారి వెనుకనే, కెమేరాలూ, కలాలూ చేతబట్టుకొని పత్రికలవాళ్లూ, కండువాలు సర్దుకుంటూ రాజకీయ నాయకులూ దిగిపో యేరు. 'జమ్మువలస'. కార్లూ, జీపులూ, మోటార్ సైకిళ్లతో దూలి రేగిపోయింది.

పోలీసులు మృతదేహాలు అయిదూ బంధువులకు అప్పగించేరు. నెత్తుటి ముద్ద గా మిగిలిన భీముడి మృతదేహాన్ని బంతికి అప్పగించేరు. మృతుల బంధుమిత్రుల శోకా లు వొక్కసారిగా 'జమ్మువలస' ఇల్లూ, పొల్లూ, పిల్లా, మేకా, చెట్టూ, చేమా అంతా అన్ని గొంతుల్తోనూ ఏడ్చినట్లు అన్పించింది.

పోలీసుల గదమాయింపు. పత్రికలవాడి ప్రశ్నలు, రాజకీయ పెద్దల ఓదార్పులు... వారి ఏడుపు గూడా వారిని ఏడ్వనీయని వాతావరణంలో మృతుల బంధువులంతా బంతి చుట్టూ చేరారు. అయిదుగురినీ కలిపి సామూహికంగా ఒక్కదగ్గరే దహనం చేద్దా మన్నారు బంతితో వాళ్లు. బంతి కాదనీ,




ఔననీ ఏదో వొకటి చెప్పే స్పృహలో లేదు. అలా భీముడి శవాన్ని చూస్తూ మౌనంగా ఏడుస్తోంది.

భీముడి తల్లిదండ్రులొచ్చేరు. చుట్టుపక్క గ్రామాల బంధువులొచ్చేరు. కొత్త బట్టలు చుట్టబెట్టడానికి వుండాలంటే ఎవరో మండల కేంద్రం, బస్తీకి వెళ్లారు. కొత్త కుండకోసం, అగరొత్తులు కోసం, దర్భగడ్డి కోసం తలా ఓ పక్కా వెళ్లారు. శవాల దహనం ఏర్పాట్లన్నీ దీసరి దగ్గరుండి చూస్తు న్నాడు. అప్పుడపుడూ బంతిని ఏదో సంశ యముంటే అడిగీ, తీర్చుకుంటున్నాడు. నా యినమ్మ మంచమ్మీదనుంచి భీముడి శవం పక్కకి వచ్చి ఏడుస్తూ కూర్చుంది. భీముడి తల్లి నెత్తీ నేలా బాదుకుంటోంది. భీముడి తండ్రి ఏడుస్తోన్న బంధువుల్నీ, జమ్మ్మ వల సనీ, శూన్యాన్నీ కళ్లు నిలబెట్టేసి చూస్తూ లోలోపలే ఏదో ఆలోచిస్తూ గడపముందర కూర్చున్నాడు.

సాయంత్రం మూడు గంటలవేళకి శ్మశా నానికి మృతదేహాల్ని తీసుకుపోయేందుకు బయల్దేరారు.

దాసరి ఆచారం ప్రకారం చేయాల్సిన తతంగమంతా పూర్తిచేశాడు. మంచాలమీద మృతదేహాలనుంచి పొడవాటి వెదురు బొంగులకు మంచాలను వేలాడగట్టి మంచా లను మోసుకు బయల్దేరాకే, వారివెంట బంధుమిత్రులూ, ఆడవాళ్లూ కదిలేరు. వలస బయట శవాలమోసే మంచాలను దించి కాటికి కాళ్లు, ఊరికి తల వచ్చేట్లుగా మంచా లను మార్చి వెదురుబొంగులు భుజాలకు ఎత్తుకున్నారు. ఏడుస్తూ శ్మశానవాటికకు వస్తామని వెంటబడే ఆడవాళ్లనూ, బంతినీ కొందరు ఓదార్చి నచ్చజెప్పి వెనక్కి పంపించేశారు.

పోలీసులు శవాల వెంట రాబోమంటే వలస దీసరి తీవ్రంగా స్పందించి అభ్యంతరం పెట్టాడు.

"మా మనుషుల ప్రాణాలెలాగూ రక్షించ లేదు మీరు. కనీసం మా చావుల కర్మకాండ నైనా మా పద్ధతిల జరపనివ్వండి. లేకపోతే ఈ శవాల్ని పట్టుకుని మీరే మీ పోలీసు స్టేషన్లోనో, మీ ఆఫీసుల్లోనో, మీ భవంతు ల్లోనో దహనం చెయ్యండి'' ఆవేశంగా కేకలే శాడు దీసరి.

దాంతో పోలీసులు ఆగిపోయారు. పత్రిక లవాళ్లు మాత్రం వెళ్లారు వారితో.

శవాలను 'కిత్తలో' (శ్మశానవాటిక) దగ్గర దించి, దీసరి అందరి తరపునా పూజలు జేసి, మంత్రాలు చదివేడు. మృతుల తండ్రులో, సోదరులో మృతులకు తలకొరివి పెట్టారు. భీముడి తండ్రి భీముడి చితికి నిప్పుపెట్టి అప్పటిదాకా ఆపుకున్న కన్నీటిని మరి ఆపు కోలేక భోరున ఏడ్చాడు.

శ్మశానానికి వచ్చిన వాళ్లంతా తలా ఓ ఆకు చితుల్లోవేసి, దండాలు పెట్టారు, కాల్తో న్న చితులకు!

అక్కడే పక్కగా నాలుగు నిలువురాటలు పాతి, అడ్డంగా రెండు పట్టీలు వేసి, మీద కొమ్మలు పరిచి చిన్న 'కుందిరి' వేశారు. ఆ కుందిరిలో వ్యవసాయానికి వాడే కంక, వేటకుపయోగించే బాణం, వంట చేసుకు నేందుకు వాడే కుండ వగైరా వస్తుసామాగ్రి చనిపోయిన వారికోసం అక్కడ వుంచి వారి కి మొక్కారు అందరూ.

చనిపోయినవారికి తాము వాడిన వస్తువు లు అవసరం వుంటుందని, ఏ లోకంలో వున్నా వీటికోసం వాళ్లు ఇబ్బంది పడగూడ దన్న ఆలోచనతో ఇవన్నీ ఆ కుందిరిలో వుంచుతారు. గిరిజనుల నమ్మకమది. ఆ తర్వాత ముహూర్తం చూసి, తొమ్మిదోరోజున గానీ, పదకొండవ రోజునగానీ అస్థికలనుతీసి శ్మశానం దగ్గరలోనే ఒక్కో కుటుంబానికీ అస్థికలు పాతే స్థలం ఒక్కో దగ్గర కేటా యించి వుంటుంది. అక్కడ అస్థికలు పాతు

తారు. అలాగే చనిపోయినవారి జ్ఞాపకార్థం ఊరిబయట 'సుప్‌జేంగరన్' (శిలాఫలకం) పాతేచోటు వుంటుంది. అక్కడ రాయిని పాతి, 'గువర్' పండుగ చేస్తారు. ఆ రాయికి పండగరోజు దున్నపోతును బలి ఇస్తారు. గువర్ పండుగ మృతుల స్మృతికై జరుపు కుంటారు. గనుక, గిరిజనులకు గువర్ పండుగ చాలా ముఖ్యమైన పండగ.

దీసరి ఏవో మంత్రాలు చదివి, స్మశానం చుట్టూ నీళ్లు జల్లుకుంటూ తిరిగి గెడ్డకు పయనమయ్యేడు. ఆయన వెంట అందరూ గెడ్డకు వెళ్లి స్నానాలు జేసి, వలస చేరారు. అప్పటికి పొద్దు... పడమటికి చేరు కుంటోంది.

ఇంకా పత్రికలవాళ్లు వదలరు. ప్రశ్నలు ప్రశ్నలు!

ఎవరీహత్యలకు బాధ్యులని భావిస్తున్నా రు అనడుగుతారు. భూసమస్య ఇలా ఘర్ష ణకు దారితీయటంలో తీవ్రవాదుల ప్ర మేయం వుందా... అనడుగుతారు. ఇక ముందేమి చెయ్యాలనుకుంటున్నారు? ప్రతీ కారం తీర్చుకుంటారా? కోర్టు ద్వారా వె ల్తారా? పార్టీ సిద్ధాంతం ప్రకారం ఆయుధాల ద్వారా సమాధానం చెప్తారా?

ప్రశ్నలు... ప్రశ్నలు...!

ఏ ప్రశ్నకూ జవాబులు లేవు వాళ్ల దగ్గర. వాళ్లకు ప్రశ్నలు వినబడుతున్నాయా? వాళ్ల జ్ఞానేంద్రియాలు వర్తమానంలో వున్నాయా అసలు?

వాళ్ల మనసులనిండా మరణించిన తమ జనాల జ్ఞాపకాల ఘోష హోరెత్తుతోంది. తరతరాలనుండి హక్కుగా వస్తోన్న నేల కోసం తమ ప్రాణాలను చాలుబోసిన లక్కాయి, జుంబిరి, కొంమరుసోంము... భీముడూ గుర్తొస్తున్నారు. కళ్లల్లో మెదులుతు న్నారు. కాళ్లు దీసి కాళ్లు వేస్తే కళ్లల్లో కదుల్తోన్నట్టే అన్పిస్తోంది.





పత్రికలవారి ప్రశ్నలకింకేమి సమాధానా లు చెప్పగలరు?

మా ఏడుపు మమ్మల్ని ఏడ్వనీయండి అన్నతీరులో, అంతా పత్రికలవారికి చేతులెత్తి మొక్కారు తమని ప్రశ్నించవద్దని.

సాయంత్రానికి పత్రికలవారూ, నాయకు లూ, పరిసరగ్రామాల ప్రజలూ వెళ్లిపోయారు. పోలీసుల గస్తీలో జమ్మువలస చీకటిలో మిగిలింది. మరో చావు రాత్రి గడిచింది.

మూడోరోజు వలసలో హడావిడి ఎక్కు వైంది. కార్లూ, మోటార్‌సైకిళ్లూ, పోలీస్ వ్యా నులూ తెరిపిలేకుండా వస్తూనే వున్నాయి. వలస ముందున్న మెరకమీద స్టేజీ వేశారు. మైక్‌సెట్ పెట్టారు. మంత్రిగారు దిగేరు. వారికి రక్షణగా పోలీసులు అంతా కలిసి స్మశాన నిశ్శబ్దంలో వున్న వలస వీధుల్లో పర్యటించేరు. మృతుల బంధువులను పరా మర్శించేరు. ఆ తర్వాత ఊరి ముందటి సభాస్థలికి తిరిగొచ్చేరు.

మైదానం గ్రామాలనుండి మంత్రిగారి సభకోసం జనాన్ని సమీకరించేరు. ప్రాంతీయ నాయకులంతా వచ్చేరు. అంద రూ సభలో గిరిజనుల ప్రాణనష్టానికి తీవ్ర విచారాన్ని వ్యక్తం చేశారు. మంత్రిగారు గేదెలిప్పిస్తామనీ, కోలనీ కట్టిస్తామనీ, విద్యా లయాలు పెట్టిస్తామనీ, వగైరా హామీలు (గెడ్డవలస భూమి తప్ప) సెలవిచ్చేరు. ఆ తర్వాత తమ ప్రభుత్వం ప్రకటించిన ఎక్స్‌గ్రే షియా డబ్బు మృతుల బంధువలుకు చెక్కు రూపంలో అందజేయసాగేరు. భీముని మృ తికి ఎక్స్‌గ్రేషియా అందుకోవాల్సిందిగా బంతిని పిలిచేరుగాని బంతి రాలేదు. ఎవరో బలవంతంగా తీసుకొస్తే నాయనమ్మ వచ్చింది. మంత్రిగారు నాయనమ్మకు చె క్కు అందజేస్తూ ఫొటోకోసం ఫోజు ఇచ్చేరు. నాయనమ్మ... సభనూ, జనాన్నీ తన చేతి లోని చెక్కునూ పదేపదే చూసి చెక్కును ముక్కలు, ముక్కలుగా చించి పారవేసి, చరచరా నడుచుకొచ్చేసింది ఇంటికి! బంతి నాయనమ్మను గుండెలకద్దుకొంది.

మంత్రిగారు సభ చాలించి విలేకరుల సమావేశంలో పాల్గొన్నారు. తమ ప్రభుత్వం చేపట్టిన అనేక ప్రజాసంక్షేమ పథకాల గణాంకాలు వివరించేరు. 'జమ్మువలస' భూవివాదంపై నొక్కి నొక్కి ప్రశ్నించే విలేకరికి,

"వలసలో అయిదుగురి గిరిజనుల మరణం చాలా దురదృష్టకరం. దీనికి తీవ్రవాదులే బాధ్యత వహించాలి. వివాదంలో వున్న భూమిపై గిరిజనులను రెచ్చగొట్టి దించేరు. కోర్టుద్వారా పంటమీద హక్కు తెచ్చుకున్న జగ్గారావును నిరోధించటంవల్లనే ఘర్షణ జరిగింది. ఇది దురదృష్టకరం" అని జవాబిచ్చి, పత్రికా గోష్ఠి ముగించేశారు.

'జమ్మువలస'నుంచి కార్లూ, మోటార్ల సందడి మంత్రిగారితోపాటూ తరలిపోయింది.

మరోరోజు, ఓ ప్రతిపక్ష నాయకుడు వచ్చి- కళ్లు ఎర్రగాజేసి, ఎవర్నో దూషించి,

"మీరేం భయపడకండి. మాకే అధికారమొస్తే మీకు న్యాయం చేస్తాను'' అని గాలి వాగ్దానంజేసి, వెళ్లిపోయేడు.

రోజూ ఎవరో వస్తూనే వున్నారు. ఏమేమో చెప్తూనే వున్నారు. జమ్మువలస ఈ తతంగానికి అలవాటు పడిపోయింది.

గానీ, వాళ్లు ఎదురుచూస్తోన్న అరెస్టయిన తమ మనుషులు రాలేదు. కంతుడు రాలేదు. బంతి నాయనమ్మను సముదాయించలేకపోతోంది. భర్త అరెస్టయి పదిహేను రోజులయినా తిరిగి రాకపోవటంతో ఆమెకు మళ్లీ ఆరోగ్యం దెబ్బతింది. మంచం పట్టేసింది. బంతికి భయం వేస్తోంది. నాయనమ్మ చావురోజులు లెక్కబెడ్తోందా అన్పిస్తోంది బంతికి.

ఎట్టకేలకు మూడు వారాల తర్వాత 'జమ్మువలస' యువకుల్నీ, కంతుడ్నీ విడుదల చేశారు. వలసలో పోలీసుగస్తీ కూడా ఎత్తేశారు. సాధారణ పరిస్థితులు నెలకొన్నాయని పీ.వో.గారూ, కలెక్టర్‌గారూ ప్రకటించేరు.

సాధారణ పరిస్థితులంటే ఏవిటో బంతికి అర్థంగాలేదు. మా పరిస్థితుల్లో సాధారణమేముంది. అన్నీ అసాధారణమేగదా - అనుకుంది బంతి.

కంతుడు జైలునుంచి బాగా నీరసించిపోయివచ్చేడు. గెడ్డాలూ, మీసాలూ పెంచేశాడు. కళ్లల్లో ప్రాణమున్నవాడిలా కన్పిస్తున్నాడు.

నాయనమ్మ కంతుణ్ణి తన మంచం దగ్గరకు పిల్చుకుంది. బంతిని చూపించింది. గుడ్లనిండా నీరు గక్కింది. భర్త చేతుల్లో చేయివేసి ఏదో చెప్పబోయి తిప్పలు పడింది. చెప్పలేక గింజుకుని ఊపిరొదిలేసింది.

"నా బతుకంతా సావులే సూసేను. కన్నకొడుకు సావుని సూసేను. కోడలు కనపడకండయిపోతే సూసి బతికేను. మనవరాలి పసుపు కుంకుమ సెరిగిపోతే సూసేను. కొసాకి నా భార్యా సావునీ సూసేను. ఇన్ని సావులూ సూడ్డానికే ఇలగ మిగిలుండిపోనానా? నాకు సావు ఇంతలన రాదా?" అంటూ గోడుగోడున ఏడ్వసాగేడు కంతుడు.

జూజూని ఓదార్చటం బంతి తరం కాలేదు.

★ ★ ★

నాయినమ్మ చనిపోయేక కంతుడు దిగులుపక్షి అయిపోయాడు. పలుకరిస్తే పలికేవాడు కాదు. ఆకలనేవాడు కాదు. నిద్రబోయేవాడు కాదు. పరాకు పరాకుగా అడవికీ, పోడు మీదకీ తిరిగేవాడు.

తాతయ్య కోసం వలసా, పోడూ, అడివీ గాలించేది బంతి. వెదికి, వెదికి పట్టుకొని బ్రతిమాలి తిండి తినిపించేది. ఇంటికి తీసుకువచ్చి పడుకోబెట్టేది.

శూన్యంలో బ్రతుకుతున్నట్టుగా వుండేది బంతికి. జీవితాన్ని పంచుకునే భీముడు లేడు. గతం కలబోసే నాయినమ్మ లేదు. బ్రతుక్కి ధైర్యం చెప్పాల్సిన తాతయ్య స్థిమి

తంగా లేదు.

ఇంతటి నిరాశామయ బతుకునీ ఇంతో అంతో చలనంలోకి తీసుకువచ్చినవాళ్లు ఆ వలస ప్రజలే.

అయిదుగురి మృతుల ఆత్మశాంతికి గువర్ పండుగను నిర్ణయించేరు. పండుగ నిర్వహణ బాధ్యతంతా బంతికే అప్పజెప్పారు. రోజూ ఎవరో వొకరు వచ్చి పండుగ ఏర్పాట్ల గురించి బంతితో చర్చించేవారు. పనులు పురమాయింపులు చేయించేవారు.

ఈ బాధ్యతతో బంతికి మనసులో పదేపదే జరిగిన ఘటనలు తలుచుకుని బాధపడే వ్యవధి లేకుండా అయ్యింది. నిరాసక్తత లోంచి చలనంలోకి వచ్చింది బంతి.

'వలస' ఉమ్మడి డబ్బుతో దున్నపోతును కొన్నారు మృతుల జ్ఞాపకార్థం గనువర్ (రాయి)పాతే చోట బలి ఇవ్వటానికి.

బంధుమిత్రులకు కబుర్లు పంపేరు. గువర్ పండగ ఏర్పాట్లలో అంతా తీరికలేకుండా అయిపోయేరు.

"గువర్ పండుగ మానేసి, స్మారకసభ పెట్టగూడదూ'' అంటూ మొట్టమొదటిసారిగా భూమి తగవులో అరెస్టులయితే కోర్టులో బెయిల్ వేయటానికి సహకరించిన ప్రకాశూ, మరో వ్యక్తీ వచ్చి బంతిని అడిగేరు.

బంతికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. జనాలవైపు చూసింది. వాళ్లంతా అయిష్టంగా మొహాలు పెట్టారు.

ప్రకాశ్‌తో వచ్చిన మరో వ్యక్తి,

"...జరిగిన మారణకాండను ఖండిస్తూ కరపత్రం వేసాం. భూమిని వెంటనే వలసవారికి అప్పజెప్పాలని డిమాండ్ చేస్తూ, కలెక్టర్‌కి మెమొరాండం ఇచ్చేం. జగ్గారావుపైనా, అతను తెచ్చిన గూండాలపైనా మర్డర్ కేస్ పెట్టేం. మంచి లాయర్ని ఎంగేజ్ చేసాం. దోషుల్ని వదలం. భూమినీ సాధిస్తాం" అంటూ తమ పార్టీ 'వలస' భూసమస్యపై నిర్వహించిన కార్యక్రమాలను వివరించేడు.

వలస ప్రజలంతా బంతివైపు చూసి, గుసగుసగా సవరభాషలో పండుగ మానుకోడానికి తమ అభ్యంతరాన్ని బంతికి విన్పించేరు.

ఇక మరి తప్పనందున బంతి,

"ఇప్పుడికే ఏర్పాట్లన్నీ చేశాం. మా ఆచారాల్ని అంత తొందరగా వదిలీలేం. మా ఊరి భూమికోసం మీరు చాలా సాయం జేశారు. గానిప్పుడు, గువర్ పండగను స్మారక సభ చెయ్యలేం. మరేమనుకోకండి'' అని చెప్పింది ప్రకాశ్‌తో.

వాళ్లు "సరే... మీ ఇష్టం. మీకేం సహకారం కావాలన్నా పార్టీ మీకండగా వుంటుందని గుర్తుంచుకోండి'' అని చెప్పి వెళ్లిపోయారు.

'గువర్' పండగరోజు వచ్చింది. గ్రామ, గ్రామాలనుండి బంధువులూ, మిత్రులూ చేరుకుంటున్నారు. మిత్రుల పరామర్శలతోనూ, బంధువుల ఏడ్పులతోనూ, జమ్మువలస మరోసారి కంటతడిపెట్టింది.

భీముడి తల్లీదండ్రీ వచ్చేరు. భీముడి తల్లి బంతిని పట్టుకొని, ఒళ్లంతా తడిమి, కళ్లల్లోకి చూస్తూ వెక్కిళ్లతో ఏడ్చింది. భీముడి నాయిన గడపలోనే చతికిలబడి మునిగాళ్ల మధ్య తలదించి కూర్చున్నాడు. వాళ్లను చూసి మళ్లీ బంతికి కడుపులో బాధంతా కదిలిందిగానీ, తను ఏడిస్తే ఇక వారిని ఆపడం తరం కాదని కన్నీళ్లు దిగమింగుకుంది. అత్తా, మామలకు అవీ ఇవీ భోగట్టాలు చెప్పసాగింది.

వాయిద్యాలు మ్రోగేయి. గనువర్ (స్మృతి చిహ్నమైన రాయి) పట్టుకు బయల్దేరారు. దున్నపోతును గెడ్డలో కడిగి తోలుకొచ్చి పసుపూ కుంకమబొట్లు బెట్టి బలికి సిద్ధం చేశారు. దీసరి కదిలిరాగా గనువర్ పాతేందుకు ఊరిబయటి స్థలం "సుప్ జీంగరన్' దగ్గరకు వెళ్లారు.

దున్నపోతును బలిచ్చి, పూజజేశాడు





దీసరి. మొక్కులు దీర్చేరు కొందరు. దున్న పోతును అక్కడే మాంసంగా జేసేసి, కొంత మాంసం గనువర్ దగ్గర నేవైద్యం పెట్టి తిరిగి వాయిద్యాలు మ్రోగించుకుంటూ అంతా వలస చేరారు.

సరిగ్గా అప్పుడొచ్చేడు కామ్రేడ్ రావాడ కంచియ్య! భుజాన తుపాకీ తగిలించుకువచ్చేడు మనిషంతా ఆవేశంతో ఊగిపోతున్నాడు. ఊరిలోకి వస్తూనే ముందు బంతి ఇంటికి వెళ్లాడు. గడపలో కంరుడు ఎదురైతే,

"ఏం కామ్రేడో... ఆ సూకాపో?" అనడిగేడు.

కంరుడు పరాకుగా చూసేడు. బంతి తాతయ్య దగ్గరకొచ్చి కంచియ్య కంచియ్య అని చెప్పింది. కంచియ్య అనేకంటే "కామ్రేడో" అని చెపితే గుర్తిస్తాడేమో అని 'కామ్రేడో అని చెప్పింది. అయినా, కంరుడిలో పెద్దగా ప్రతిస్పందన లేదు.

కంచియ్య అక్కడినుంచి వీధిలోకొచ్చేడు. వీధి ముందరి అరుగుమీద కూర్చున్నాడు. కంచియ్య చుట్టూ జనం చేరారు. కంచియ్య వారితో ఏవేవో భోగట్టాలు మాట్లాడేడు.

తుపాకీ బరువైతే భుజం మార్చుకోవాల గానీ, తుపాకీని దించకూడదన్నాడు. వలసోల్లు తప్పుడు పంథాలో వెళ్లారన్నాడు. శత్రువుని తక్కువ అంచనా వేశారనీ అందుకే అయిదుగుర్ని నష్టపోయేరనీ ఇలా ఏవేవో చెప్తూనే వున్నాడు. రాత్రి భోజనాలదాకా!

భోజనాలయ్యేక మళ్ళీ అందరినీ కూర్చోబెట్టి,

"ఇంతకింతా బదులు తీర్చుకోవాల ఆc! కామ్రేడో మనకిక పోయిందేటి? గోసిగుడ్డ తప్ప! ఈ కోర్టులూ, చట్టాలూ మనకి న్యాయం సెయ్యవు. భూమిని ఇవ్వవు, బతుకుని ఇవ్వవు. బానిస నౌకరీ బతుకూ, కంబారి బతుకూ మిగులుస్తాయి. పోరాటమే మార్గం. అన్నలు మనకోసం వున్నారు. మనం సిద్ధం కావాలె యుద్ధానికి'' అని చెప్పి, ఆ రాత్రివేళనే, అందరి దగ్గరా వీడ్కోలు తీసుకొని వెళ్లిపోయాడు కంచియ్య.

ఒక గాలివాన వచ్చి వెలిసినట్లయ్యింది.

కంచియ్య కబుర్లు అంతమందీ శ్రద్ధగానే విన్నారు. అయితే అందులో వారు ఆమోదించేవి ఎన్ని అనేది వాళ్ల మొహాలు చూస్తే పోల్చలేం. ఆ మొహాల్లో ఏ భావాన్నీ వాళ్లు వ్యక్తం చేయరు.

గానీ బంతికి మాత్రం కంచియ్య మాటలు కొన్ని సంశయాల్ని లేపాయి. వలసజనాలు తప్పుడు పంథాలో వెళ్లారంటాడు. అయితే ఆ పంథా ఎవుల్ది? భీముడికీ దీనికీ సంబంధం వుందా? కంచియ్య అనేదేcవిటి ఇంతకీ?

ప్రశ్నలూ, సంశయాలూ మిగిలిపోవటం బంతికి కొత్త కాదుగదా! ప్రశ్నల్ని లోలోపలే వేసుకుని జవాబులు వెదకటం బంతికి అలవాటయ్యింది.

బంధుమిత్రులు కదలివెళ్లిపోయారు. పండుగయ్యాక అందరూ వెళిపోయాక జమ్మువలస ఆకులు రాల్చేసిన తోటలా మిగిలింది.



అనేక సంఘటనలు... ఆ అడవి జనుల జీవితంలో జరిగిపోయేయి. కొన్ని సంఘటనలకు సాక్షి బంతి! కొన్ని సంఘటనలకు బంతి ముందటి తరాలు వాళ్లు సాక్షులు.

ఏ మార్పు యెందుకు జరిగిందో, యే మార్పుకోసం ఎందరు త్యాగంజేయాలని వచ్చింద్రో వాళ్లు ఎవరన్నా ఎపుడన్నా విశ్లేషించుకున్నారో లేదోగానీ బంతిమాత్రం యిపుడు గతమంతట్నీ తడుముకుంటోంది. తల్లీదండ్రీ, తాతయ్య, తనను ప్రాణ సమానంగా చూసుకున్న భర్త భీముడూ... తన పాప... తన యిరుగూ, పొరుగూ అందరూ గుర్తొస్తున్నారు. వీరేగాక, తనకు తెలీని మరెందరో మరణించేరు. అయినా మా వలసలు వలసల్లాలేవు. మా ఇళ్లు యిళ్లల్లా లేవు. నిప్పుల ముద్దలు పడిన చీమలపుట్టలెందుకయినాయి?

బంతి... ప్రాణం మీద మమకారం పోనందున యిలా ముత్తాత ఇంటికి చేరిందే గానీ తన గతమంతా తల్చుకుంటే నిలువెల్లా దుఃఖంతో గజగజా వణికిపోతోంది. తనను చేరదీసి పెంచిన వాళ్లంతా దూరమై దారితప్పి, గూడు మారిన పక్షిలా విలపిస్తోంది బంతి.

ముత్తాత కళ్లు తుడుచుకొని, మునిమనవరాలిని ఓదార్చసాగేడు. బంతి చుట్టూ ఆ ఊరివాళ్లంతా చేరిపోయేరు సానుభూతిగా. తలా ఓ విధంగా బంతిని ఓదార్చసాగేరు.

అందరూ ఓదార్చగా కుదుటపడింది బంతి. కళ్లు తుడుచుకుని బంతి తను యీ ఒరిస్సాలోకి ముత్తాత యింటికి ఏలా వచ్చిందో ఎందుకు రావలసి వచ్చిందో చెప్పసాగింది. గొంతుక దుఃఖంతో పూడుకుపోయి మాట రానీయటంలేదు. ఏంతో నిభాయించుకొని ముత్తాతకు చెప్పటమారంభించింది,

వారం రోజులు గడిచింది గువర్ పండగయిపోయి. మా జూజూ పరిస్థితి మరీ దిగజారింది. ఎక్కడెక్కడో అలా పడి వుంటున్నాడు. అన్నమో, జావో, అంబలో తీసుకెళ్లి పెట్టినా తినేవాడుకాదు. శూన్యంగా చూసేవాడు. కొండనీ, అడవినీ చూస్తూ కళ్లనీళ్లు దించేవాడు.

ఏం చేయటం? నా చిన్నప్పటి నించీ నాకు తల్లీతండ్రీ అయ్యి నన్ను పెంచినవాడు. నా ఆలనాపాలనా చూసినవాడు. బతుకంతా ఎన్నో అనుభవాలను జీర్ణం చేసుకున్నవాడు! ఆఖరిదశలో ఈ మతిస్థిమితం తప్పిపోవటం జూజూని చూస్తుంటే నా గుండెలు రంపపు కోతకు గురయ్యేవి. చిన్నపిల్లాడ్ని జేసి బుజ్జగించేదానిని. ముద్దలుజేసి అన్నాన్ని అందిచ్చేదానిని. జాబిల్లిని చూపేదానిని. కొండని చూపి పాటపాడేదాన్ని. జూజూ ఒక అన్నం ముద్ద మింగితే ఒక చుక్క కన్నీరు మింగేదానిని నేను!

వలసలో జనాలు మృతులను మరిచిపోతూ, బతుకు యాతనలో పడినారు. మంత్రిగారిచ్చిన చెక్కులు మార్చుకున్నారు. మంత్రిగారు చేసిన వాగ్దానాలకోసం ఆఫీసులు ఎక్కి దిగుతున్నారు. ఐ.టి.డి.ఎ ఆఫీసునుండి నాకు కబురొచ్చింది, దరకాస్తు చేసుకుంటే మళ్లీ ఉద్యోగం యిస్తామనీ! నాకు మనసొప్పలేదు. అయిదుగురి ప్రాణాల ఖరీదుగా కన్పించింది ఆ కబురు! భీముడి రక్త తర్పణకు నజరానాగా అన్పించింది ఆ ఉద్యోగం! నేను వెళ్లదలుచుకోలేదు. ఆ మాత్రం ముసలి జూజూక్కీ, నాకూ యింత తిండి ఈ అడవీ, కొండా అందించకపోవు అనుకున్నాను! పోడుమీదకీ, పొలం మీదకీ వెళ్లడం ప్రారంభించేను. శరీరాన్ని కాయకష్టంకి అలవాటు చేయసాగేను. అదే నాకు ఊరటనిచ్చేది. అలసీ, సొలసిన శరీరం రాత్రయ్యేసరికి యే ఆలోచనా లేకుండా నిద్రను ఆహ్వానించేది!

వారం రోజుల తర్వాత ఆవేళ పొద్దుగుంకేవేళ గాభరాగా వచ్చేడు గీదరి! గీదరి మా జమ్మొలసవాడే. మండలాఫీసులో బంట్రోతు ఉద్యోగం రావటంతో మండల కేంద్రానికి మకాం మార్చేసాడు. ఎపుడో పండుగకూ, పున్నాలకి వలస వస్తుంటాడు. వలసలో వాళ్ల అమ్మా, నాయినలు అన్నా వున్నారు! గీదరికీ మా తండ్రికీమంచి స్నేహముండేదట! ఇద్దరూ అప్పటి పోరాటంలో కొన్నాళ్లు కలిసే




తిరిగేరట! అయితే మధ్యలోనే గీదరి సరెండ రయిపోయేడట. ఆ తర్వాత, ఎవర్నో పట్టుకొని బంట్రోతు నౌకరీ సంపాదించుకున్నాడు. నా వయసు కూతురు, కూతురు తర్వాత యిద్దరు కొడుకులూ గీదరి సంతానం! కూతురు పట్నంలో ఎవర్నో ప్రేమించి, ఆతను మోసగిస్తే సింతమానుకు ఉరేసుకు చచ్చిపోయింది. కొడుకు ఎస్సెల్సీ పేసయ్యాక ఏదో నౌకరీ దొరికితే వెళ్లిపోయి తండ్రిని మర్చిపోయేడు. చిన్న కొడుకు మీద ఆశల్తో రిటైర్‌మెంట్ దగ్గర పడ్తుంటే నౌకరీ నెట్టుకొస్తున్నాడు గీదరి! కూతురి మీద మమకారాన్ని నన్ను చూస్తూ గుర్తు జేసుకుంటాడు. నన్ను ఆదరంగా పలుకరిస్తాడు.

ఆరోజు గాభరాగా వచ్చి,

"అమ్మా బంతీ! కొంపలు మునిగిపోయేయి'' అన్నాడు. మళ్లీ యే ఉపద్రవం ముంచుకొచ్చిందా అన్న ఆందోళన కలిగింది నాలో! గుండెలు దడదడా కొట్టుకోసాగేయి. భయంగా గీదరిని చూస్తూ,

"ఏందీ? ఏమైందీ?" అనడిగేను.

"జెగ్గారావ్... కాంట్రాక్టర్ని ఆళ్లు సంపీసేరు రాత్రి'' అన్నాడు గీదరి. రహస్యం చెప్తున్నట్లు లోగొంతులో!

"ఆc!" అని ఆశ్చర్యపోయేను. జగ్గారావుని చంపేసారా? ఇలాంటిదేదో జరుగుతుందన్న ఊహే లేదు నాలో! జరగాలి అన్న... కోరికా లేదు. నిజమే కావచ్చు... నా దేవుడు భీముడి చావుకి కారకుడు కావచ్చు. మా వలస జనాల అయిదు నిండుప్రాణాలు తీయించిన వాడే కావచ్చు! కానీ ఎందుకో యీ ఆలోచనే రాలేదు నాలో.

అదో దారుణ వార్తలా విన్పించింది. అయితే ఎవరు? ఎవరు చంపేరు ప్రశ్న.

"ఎవరు చంపారు?" అడిగేను గీదరిని.

"ఆళ్లేనమ్మా... అన్నలు'' అని చెప్పాడు గీదరి.

నేనింకా ఆశ్చర్యపోతున్నాను.

"నాకూ తెలీక పోయున్ను. తెల్లారి ఆఫీసుల అందరూ యివే భోగట్టాలు చెప్పుకుంటన్ను. జెగ్గారావు యింటికి పోలీసు బందోబస్తే పెట్టారట. మజ్జేనం భోజనంకెల్నపుడు సూసేను. నిజంగే సంపీసేరు! జెగ్గారావు పీక తెగిపోయిందట. కడుపుల తుపాకి గుళ్లు దిగిపోయేయట. పొద్దు యింకా పోయీ పోకముందే జనాలు అలికిడలికిడిగ వున్నపుడే సంపీసారట. అంతే అంతా పట్నంలా తలుపులు మూసేరట యిళ్లల్లో' అని చెప్పాడు గీదరి.

భయం మనిషిని ఎలా చేస్తుందో వివరిస్తున్నాడు గీదరి.

"జెగ్గారావయితే అన్నలకి చేతులెత్తి మొక్కేడట. నా సంపాదనంతా వట్టుకుపోయి నన్నొగ్గీయండని బతిమాలేడట. గెడ్డపొలం భూమి వదిలేస్తానన్నాడట. ఇక యే అన్నేయమూ సెయ్యనన్నాడట. ఆడి యింటిల ఆడే అట్నించిటూ, యిట్నిండటూ పరిగెత్తేడట. వొదల్లేదట అన్నలు. వొదిల్తే నువ్వు మళ్లీ అడవిల్ల పులివైపోతావు. పులుల్ని కనికరించ గూడదని కాల్చీసేరట" చెప్పుకొస్తున్నాడు గీదరి... జగ్గారావు చావుని.

ఎవరికయినా చావు విషాదమే! అయితే, జగ్గారావు చావుని జగ్గారావే రాసుకున్నాడా? జగ్గారావు మా వలస భూమి దురాక్రమణ చెయ్యకపోతే, అయిదుగుర్ని చంపించివుండకపోతే యీ చావు వచ్చేదికాదుగదా అన్పించింది! చంపించడాలూ చావడాలూ యిదేనా మనం కోరుకున్నది? ఏదీ అర్థమవటంలేదు. ఏది మంచో, ఏది చెడ్డో విశ్లేషించుకోలేకపోతున్నాను.

ఆనాటి డి.టి.డబ్లూ.. చట్టాన్ని నమ్మమన్నాడు. గౌరవించమన్నాడు. ఆ చట్టమే నిర్వీర్యమై నిందారోపణల్తో ఆయనను బదిలీజేసింది. నన్ను ఉద్యోగంలోంచి తొలగించింది.

చట్టాన్ని అతిక్రమించి జగ్గారావు జనాన్ని హింస పెట్టాడు.

జనం చట్టాన్ని అనుమానించే న్యాయా




న్ని తమ చేతులమీద నిలపాలనుకున్నారు. ఎవర్ని అనుసరించాలి? నా ముందటి మార్గ మేది? ఈ ప్రశ్నల్లో వుండగా గీదరి,

"ఆడు సావడం కాదుగాని మనసావుకొచ్చింది. మనోళ్లంతా వలస ఖాళీజేసి, దూరంగా పారిపోవాల" అన్నాడు.

నాకేమీ బోధపడలేదు. ఆశ్చర్యపోతూ "ఎందుకూ?" అనడిగేను.

"మా మండలాఫీసుల చంద్రంబాబనీ గుమస్తావున్నాడు నీకు తెలుసా? ఆ చంద్రంబాబు అన్నయ్య పోలీస్ కానిస్టేబుల్! భోజనాల కాడ ఆళ్ల అన్నయ్య యిదంతా చెప్పేడని చంద్రంబాబే నాతోటి చెప్పాడు'' అని ఆగేడు గీదరి. చంద్రంబాబు ఏవిటి చెప్పాడు? ప్రశ్నార్థకంగా చూసేను.

గీదరి నా మొహాన్ని చూసి అర్థం చేసుకున్నట్లుంది. వెంటనే మళ్లీ విషయం చెప్పటమారంభించేడు,

"ఆ బాబు భోజనం చేస్తున్నపుడు ఆళ్లన్నయ్య తుపాకి, గిపాకి తీసి రెడీ అవుతుండట! ఏటీ? అనడిగితే ఎస్పీగారి ఆర్డరట" అని మళ్లీ ఆగేడు.

నాకు చిరాకు వేస్తోంది... విషయం మధ్య మధ్య ఆపుతుండటంతో, గానీ గీదరి గుండెల్లో ఆందోళనా, బస్‌దిగి పరుగు నడకన రావటాన అలసిపోయి, మాట్లాడుతుంటే ఊపిరి ఎగబడి ఆగిపోతున్నాడు.

"ఎలాగైనా అన్నల్నిగానీ, ఆళ్లకి సాయంజేసిన మనుసుల్నిగానీ ఈ రాత్రి యే ఝామునకైనా పట్టుకోవాలన్నాడట ఎస్పీ.

ఇదంతా ముందు ప్లేన్‌జేసి జరిపిన మర్డర్! ప్లాను జమ్మిలసలోనే యేసేరు అన్నాడట మన సీఐ" మళ్లీ ఆగేడు గీదరి.

నాకు గుండెలు దడదడా కొట్టుకోసాగేయి. జమ్మిలసలో ప్లాన్ చేయడమేవిటీ? సీఐ యే ఉద్దేశంతో అన్నాడు.

"ఆ గువర్ పండగనాడు కంచియ్య వచ్చేడుగదా! అదిగా కంచియ్య అన్నల దళంల మనిసట. కంచియ్యతోటి అన్నలూ వచ్చేరట. ఆ పండుగరోజే జగ్గారావుకి సావు మూర్తం పెట్టామట. ఇదంతా ఆ వలస కొండనాకొడుకులు చేసిందే అన్నాడట సీఐ" అని మళ్లీ ఆగేడు గీదరి.

నేను నిల్చోలేకపోతున్నాను. భయం వెన్నులోంచి సరసరా మంటోంది.

"అయితే ముందా కొండనా కొడుకుల్ని పట్టుకొచ్చి కోటింగెయ్యండి అన్నాడట ఎస్పీ! అందుకని బయిలెల్తండట అతగాను. అంతా ఈ రాత్రికి వలసమీద పడిపోతారు. వలసలెవులు దొరకొ్కడదు. దొరికితే పులుసుల ఎమిక లేకండ గొడతారు పోలీసోలు! పారిపోండి, పారిపోండి'' అని చెప్పి, . మరి ఆగలేదు గీదరి. అదే వెళ్లడం, యింటింటికీ చెప్పి, అందర్నీ పారిపొమ్మన్నాడు.

నేను భయమూ, ఆశ్చర్యమూ, ఏవిటీ అక్రమం అన్న ఆక్రోశమూ కలగలిసిన వేదనతో మా జూజూ కోసం వెదకడానికి కదలబోతే జూజూయే ఎదురుగా వచ్చేడు. చేతిలో పెద్ద వేపకొమ్మ రెమ్మల్తో, ఆకుల్తో, కాయల్తో విరబూసి వుంది. అది పట్టుకొని పూనకం పూనిన వానిల ఊగుతున్నాడు. జూజూని చూస్తే భయం వేసింది. ఈ వృద్ధుణ్ణిగానీ పోలీసులు తీసుకుపోతేనో అన్న ఆలోచన కలిగి శరీరం వొణికిపోయింది. గీదరి చెప్పిన కబురుకి పారిపోవాలన్పించలేదు. ఎందుకు పారిపోవాలి? ఎక్కడికి పారిపోగలం? స్వంత నేలనొదిలేసి పలాయించటం యిష్టంలేక వుండిపోదామనుకున్నాను. కానీ వుండిపోయి జూజూను అప్పగించలేను.

వెంటనే జూజూ చేతిలోని వేపకొమ్మ లాగేసుకున్నాను. ఊగటం ఆపేసి జూజూ అలిగిన పిల్లాడిలా దభాలున నేలమీద చతికిలబడి కూచున్నాడు. ఏం చేయటం? పరిస్థితి అర్థం చేసుకోలేడు నేను చెప్పినా! పొద్దు చూస్తే మునిగిపోతోంది. సమయం చాలదు.

పారిపోవాలి.

నేనూ జూజూలాగే అలిగినట్లుగా నటిస్తూ జూజూ పక్కనే కూర్చున్నాను. జూజూ వెంటనే అలకమానేసి, నా గడ్డం పట్టుకొని అలకమానమని సైగజేసాడు. టపటపా కన్నీటి బొట్లు రాల్చేను. నా కన్నీళ్లను చూసి, జూజూ కలవరపడిపోయేడు. చేత్తో నా కన్నీళ్లు తుడిచేడు. చేతులు రెండూ జోడించి, ఆకాశంవైపు చూపి మొక్కు మొక్కాడు. ఏడుపు ఆపేసి, జూజూ చేయి పట్టుకున్నాను.

ఇంతలో పులి అలికిడికి చెదిరిన గోవుల మందలా బెదిరింది వలస! పారిపోతున్నారు జనాలు! ఎవరి ప్రాణ రక్షణకు వారు పరుగెడుతున్నారు. చంకల్లో బిడ్డల్ని జోలె గట్టుకు ఆడవాళ్లు, ముసలివాళ్లను ఈడ్చుకుంటూ మగవాళ్లూ పరుగెడుతున్నారు.

జూజూ యిదంతా అర్థంగాక అయోమయంగా వారి వైపు చూస్తున్నాడు. దాదాపుగా వలసంతా నిర్మానుష్యమైపోయింది. మేమే మిగిలేం. ఇంక మరి నిల్చోలేకపోయేను. మనసారా ఇంటిని ఓసారి కలియజూసేను. కన్నీళ్లతో యిల్లు మసకమసకగా కన్పించింది. కన్నీరు తుడుచుకొని, మనసు దిటవు పర్చుకొని మరోసారి మళ్లీ రానేమోనన్న భావనతో ఆ యింటికీ, వలసకీ చేతులెత్తి మొక్కుతూ కదిలేను. జూజూ చేయిపట్టుకు వలస దాటేను.

వలసదాటి మేమింకా అడవిలోకి చేరేమో లేదో వలసమీద టార్చిలైట్ల వెల్తురు పడ్తోంది. మమ్మల్ని వెన్నంటి పరిగెత్తేబూట్ల శబ్దాలు! భయం... పరుగెత్తించింది. పరుగెత్తాం. రాత్రీ, పగలూ పరుగెత్తాం. తాతయ్య కదల్లేకపోయేవాడు. నాలుక తడారిపోతోందని ఆగేవాడు. దొరికిన ఆకు పసరునీ, కాయల్నీ యిచ్చేదాన్ని పార్వతీపురం ఏజెన్సీ దాటితేగానీ పరుగు ఆపకూడదనుకున్నాను. పార్వతీపురం ఏజన్సీ సరిహద్దు దాటిపోయేం. జూజూకి నడక సాధ్యంకాలేదు. నేనే భుజానికి చేరవేసి యీడ్చుకు నడిచేను. ఎలాగోలా జూజూని మీ యిల్లు చేర్చాలి! నాయినమ్మని రెక్కపట్టుకు జూజూ యీ ఊర్లోంచేనటగదా లాక్కెళ్లాడు. ఆశతో లాక్కొస్తున్నాను. నా ఆశలు ఆరిపోయేయి. నా భుజం వరిగిపోయింది. దారికడ్డంగా పడిపోయేడు జూజూ! మౌనంగానే ఆఖరిశ్వాస వదిలేడు. నాకున్న ఒకేఒక్క బంధమూ తెగిపోయింది. ఆ చీకటి రాత్రి దిక్కులేని మేకపిల్లలా ఏడ్చి, ఏడ్చి... ఒంటరిగా మళ్లీ పరుగు తీసేను. మూడు పగళ్లూ, మూడు రాత్రులూ... యేక దీక్షగా భయంతో రక్షణ కోసం పరుగెత్తి పరుగెత్తి... యిదిగో యిక్కడకి... మీ దగ్గరకి చేరాను. జూజూ కోసమే వలస వదిలి వచ్చేను. జూజూ పోయేక యింక మరిదేనికోసం భయపడాలి? ఎవరికోసం పరారయి పోవాలి? ఎక్కడో దాగుండి... యేం ఉద్ధరించాలి? అనవసరం! ఈ పరుగు ఆపేయాలి. వెలిపోవాలి వెనక్కి! నా వలసకు నేను వెలిపోవాలి. ఏమైనారో గదా మా వలస జనాలు? ఏమీ తెలీని. అమాయకులు! ఎక్కడికని పరుగెత్తుతారు? వాళ్లంతా ఏమైనారు? పోలీసులు ఎవరినైనా పట్టుకున్నారా? మా వలస వాళ్లు దొరికిపోయారా? ఇంత ప్రమాదకర పరిస్థితిలోనూ నా మీద అభిమానంతో వలసమీద మమకారంతో పోలీస్ దాడి జరుగుతుందని కబురు తెచ్చిన గీదరి ఏమైనాడు? క్షేమంగా తిరిగి యింటికి చేరుకున్నాడా? గీదరి తల్లీ దండ్రీ అన్నయ్యా క్షేమంగా వున్నారా? నడిచినా, పరుగెత్తినా, నిలిచినా యీ ప్రశ్నలు నన్ను దొలుస్తున్నాయి. నా మనసుని చుట్టు ముడుతున్నాయి. ఏం చేయటం? ఇపుడేం చేయటం?

అసలింత ఘోరం ఎందుకు జరుగుతోంది?

యుద్ధం చేసాడని నా తండ్రిని చంపేరు..
భూమి అడిగేడని నా భర్తని చంపేరు
మేము ఏమి అడిగేమని యీ వేట?





ఎందుకు మమ్మల్నిలా తరిమేరు? ఎందుకు మా నేలమీద మమ్మల్ని బతుకనివ్వటంలేదు? ఎప్పుడు ఆగుతుందీవేట?

ఈ పాతికేళ్లూ రకరకాల సంక్షేమ పథకాలూ, సబ్సిడీ స్కీములూ, పునరావాసం పేరుతో ఆశల వలలు విసిరి మమ్మల్ని వేటాడేరు! ఆ వేటకి మేం ఆఫీసుల చుట్టూ భిక్షగాళ్లయ్యాం. రంగురంగుల నర్సరీ మొక్కలైనాం! వలసల నిండా రెండురకాల మనుషులుగా విడిపోయేం. పునరావాసం అరాకొరా అందిన గుంపు యింకా యింకా వాటికోసం ఎండమావుల వెంట పరుగెత్తే ఒక వర్గం, మరోవైపు పునరావాసం కనీసమే రకైనా అందక, పురాతన సాంప్రదాయ పోడూ, అడవి బతుకూ బతికే వీలులేక, ఆకలితోనూ అసహాయంగానూ గోచీపాతల్తో మిగిలిన మరో వర్గమూ.. యివీ వలసల్లో బతుకుతున్నాయి. ఇదిగో యీ రెండో వర్గాన్నే పథకాల వలలకు చిక్కని యీ వర్గాన్ని యిపుడు వేటాడుతున్నారు?

ఏం చెప్తారు? ఎవరు చెప్తారు సమాధానాలు? బంతి వెక్కిళ్లతో ఏడుస్తూ చెప్పింది... పాతికేళ్ల తన జీవితానుభవాన్ని. వెక్కిళ్లు ప్రశ్నిస్తున్నవి. ఎగిసిపడే హృదయం జవాబుల కోసం ఎదురు చూస్తున్నది. ఎవరు చెప్తారు? ఎందుకు పచ్చని అడవిలో పచ్చగా పూసిన బంతిపూవు కొండగాలికి రెక్కలు తెగి ఎందుకు ఎగిరింది?

★ ★ ★

మునిమనుమరాలి కథంతా విన్న సామంతు అడ్డాయి... కన్నీరు కార్చుతున్నాడు. గుండెల్లో దుఃఖం పొర్లుకొచ్చింది. కూతురూ, కోడలూ, వారి సంతానమూ అంతా మట్టిలో కలిసిపోయారన్న వేదన, సామంతుని కుదిపేసింది. వానకు నిండా తడిసిన మొక్క గాలికి కదిలి నీటిబొట్లు రాల్చినట్లు కన్నీటి బొట్లు రాల్చుతున్నాడు.

ముసలమ్మ బంతిని కౌగలించుకొని ఏడుపెత్తుకుంది. ఈ శోకాలకు యిరుగూ పొరుగూ చేరారు! అందరూ బంతిని సానుభూతిగా చూస్తూ ముసలమ్మను తలా ఓ ప్రశ్న వేస్తున్నారు బంతి గురించి.

ముసలమ్మ చెప్తోంది. ఆంధ్రా మనిషి అనీ! తన పెద్ద కూతురు కొడుకు తాలూకా కూతురనీ! ఆ బంధాన్ని లెక్కగట్టే వయసు ముసలామైతే-

"ఆс! సుక్కిదాని మనవరాలా? సుక్కిలాగే వుంది!" అని బంతిలో బంతి నాయనమ్మ పోలికల్ని వెదుకసాగేరు.

"బాగా సదుంకున్నట్టిగుంది?" అనడిగేరు బంతి చీర కట్టూ, ముఖతీరూ చూసి!

ముసలమ్మ యేమీ చెప్పలేదు. చదుంకుందో? లేదో? ముసలిదానికి తెలీదు! చదుంకున్నా... యేట్లాభం జరిగింది? ఆ ప్రశ్నకు మంచి జవాబు లేక చదువు విషయంలో వాళ్లకేమీ బదులివ్వలేదు.

సామంతు కొంత కుదుటపడ్డాడు. కన్నీళ్లు తుడుచుకున్నాడు. లేచి బంతితో - "బంతెమ్మా! పద పదా యింట్లోకి! తిండీ తిప్పల్లేవు గదా! నీళ్లు పోసుకొని కసింత తిండిదిను. ఒళ్లు తేలికవుతాది. పద, పదా!" అని యింట్లోకి దారితీసేడు.

ఇరుగూ, పొరుగూ మళ్లీ వస్తాం అని చెప్పి వెళ్లిపోయారు. బంతిని కొండపోడుమీదనుంచి సామంతు యింటికి తీసుకొచ్చిన సొంబరి దీర్ఘాలోచనల్లోంచి తేరుకుని సామంతుకి నీనొస్తానని చెప్పి వెళ్లిపోయాడు.

అచ్చంగా తమ జమ్మొలస కోలనీ కాక ముందున్నట్లే వుంది ఈ ఊరు!

ఒకే వాసగా వున్న మట్టిగోడల పూరిళ్లు! గోడలన్నీ నున్నగా చేమాకులు పెట్టి జేగురు రంగులో అంచులు దిద్దివున్నాయి అందంగా. అందరి యిళ్ల పెరడుల్లోనూ రకరకాల ఫలవృక్షాలు జామ, సపోటా, నారింజ చెట్లూ... పచ్చపచ్చగా కన్పిస్తున్నాయి.

పెరటిలోనుంచి నిలబడి చూస్తే నిండుగా కొండలు ఆకాశానికి తమ శిరస్సుల్ని ఆనించి కన్పిస్తున్నాయి... జమ్మోలసలో కన్పించినట్లుగానే! అంతా అచ్చంగా తమ వలసలాగానే వుంది! కాకపోతే వలసకు కొద్దిదూరంలోంచే ఉల్లిబాబులా తార్రోడ్డు వుంది. ఆ రోడ్డుమీదుగా వచ్చేపోయే మోటారు వాహనాల శబ్దాలు వినిపిస్తాయి. ఇక్కడకు అవేవీ విన్పించవు. దగ్గర, దగ్గర్లో యే రోడ్డూ లేదు... ఈ ఊరికి!

బంతి తన వలసకూ, ఈ వూరికీ పోలికలను చూస్తోంది. మనుషులనూ పరికిస్తోంది. తమకీ, వీళ్లకీ కట్టూ, బొట్టూ తేడాయే తప్పా తిండీ,బతుకులోతేడా కన్పించలేదు. కాలకృత్యాలు ముగించింది బంతి.

ముసలమ్మ బంతిని పిల్చి, వంట పంచలో కూచోబెట్టి యిత్తడి గిన్నెలో జొన్నకూడూ, గెంజీ కలిపి పెట్టింది. నంచుకొమ్మని ఓ పచ్చిమిరపకాయ యిచ్చింది.

బంతి ఆలోచిస్తూనే జొన్నకూడు ముద్దలు దీసి నోట్లో పెట్టుకుంటుంటే ఆ ముసలమ్మ ఏభయి ఏళ్లకిందట తన కూతురూ... యిలాగే తినేదిగదా... అని తల్చుకొని కంట తడి పెట్టింది. ముసలమ్మ కంట తడిని చూసి మళ్లీ బంతిలో దుఃఖం పొంగింది. మింగుతోన్న ముద్ద పొలమారింది! ముసలమ్మ గభాల్న బంతి తలమీద అరచేతితో కొట్టి తల నిమిరింది! బంతి మరి తినలేక చేయి కడుక్కొని లేచిపోయింది.

ముసలమ్మ బంతిని నట్టింట్లో నిదురపొమ్మని నులకమంచమొకటి వేసి దానిమీద గడ్డిపరుపుని పరిచింది. బంతి యింకేం ఆలోచించలేదు. కడుపులో కాస్తా ఆహారం పడటంవలనా, శరీరమంతా స్నానంతో కుదుటపడటంవలనా మంచం చూడగానే నిద్ర ముంచుకువచ్చింది. అసంకల్పితంగానే ఆవలింతలు ఆరంభమైనాయి. ముసలమ్మ యేవో కబుర్లు నాయనమ్మ గురించి చెప్తోంటే అలా అలా వింటూ నిద్రలోకి వెళ్లిపోయింది.

నిద్రపోయిన మునిమనవరాలిని ఆప్యాయంగా చూస్తూ ఆ ముసలమ్మ చేతి మడమల్ని మనవరాలి తలమీద పెట్టి తీసి తన తలమీద మడమలతో మెటికలు విరిచి-

"దుష్టగ్రహాలూ, దుష్ట మనిసిల గాలీ... మసిగొట్టుకుపోవ..." అని నోట్లో నొడిమి, అక్కడ్నించి వచ్చేసింది.

ఒక ఎండుమిరపకాయ, ఉప్పుగల్లూ కలిపి తెచ్చి, మునిమనుమరాలి మంచంచుట్టూ చేత్తో తిప్పి దిష్టితీసి పొయ్యిలో పడేసింది!

ఇంటి ముంజూరు గోడ దగ్గరకొచ్చి ఆ గోడలమీద తన వంశపు పూర్వీకుల బొమ్మలకు చేతులెత్తి మొక్కింది - మునిమనుమరాల్ని చల్లగా చూడండని!

బంతి నిద్దురలోనే బుగులు బుగులుగా యేడుస్తూ ఒత్తిగిల్లి పడుకుంది!

★ ★ ★

ఆంధ్రా... ఒరిస్సా సరిహద్దులో వున్న ఒరిస్సా రాష్ట్రపు ఆ గిరిజన గ్రామంలో బంతి కొత్త జీవితాన్ని ఆరంభించింది. తన వలస వైపు ఆలోచనలు కదులుతున్నా యిక్కడి బంధుత్వం బంతిని బంధించింది. ఇక్కడ నుంచి మళ్లీ తన ఊరు వెళ్లిపోవాలన్న ఆలోచనలను రోజు, రోజూ తుడిచేస్తోంది.

రోజూ ముత్తాతతో ఓ గంట ముచ్చట్లు. ఆ తర్వాత ముసలమ్మ పనీపాట్లను తను అందుకొని చేస్తూ ముసలవ్వతో బాసట్లు! పగలంతా యిలా గడిచిపోతోంది. సాయంత్రమయ్యాక వలసవాళ్లు ఒక్కొక్కరూ వస్తుంటారు. ఒకరేమో తమకొచ్చిన పోస్టుకార్డు తీసుకొచ్చి బంతిని చదువమంటారు. మరొకరెవరో తన పట్టాదారు పాసుపుస్తకం చూపి శిస్తు వివరం కనుక్కుంటారు. ఇలా ఊరందరికీ బంతి అక్షరజ్ఞానం తెలిసిన పెద్ద దిక్కు!




బంతికి రోజులు యిలా గడచిపోతే చాల్ను అనిపిస్తోంది. పల్లపు కల్లాకపటం, పట్నపు నాగరికతా వ్యామోహం చేరని ఈ గ్రామంలో యిలా చీకూచింత లేకుండా బతికేయాలని వుంది. ముత్తాత, ముసలవ్వల ఆదరాభిమానాలతో గతాన్ని మెల్లమెల్లగా మర్చిపోగలుగుతోంది!

ఓరోజు అవీ, యివీ ముచ్చట్లాడ్తున్నప్పుడు గభాల్న యేదో గుర్తొచ్చినట్లుగా ముత్తాత-

"ఔనమ్మా బంతీ! నువ్వు బాగా సదుకున్నావు. మాకీ వొలసల స్కూలు లేదు. మాలాంటోలి సంగతొదిలీ. ఇప్పుడి పిల్లపాపలకేనా సదువు నేర్పితే సావుకోర్ల తిరకాసు లెక్కలు కనిపెట్టి బతుకుతారు! ఈళ్లకి సదువు సెప్పి పుణ్నెం కట్టుకుందూ'' అని బంతిని తన ఊరి పిల్లలకు చదువు చెప్పమని కోరేడు.

బంతి ముత్తాతవైపు ఓక్షణం చూసింది. నిజమే... చదువు చాలా అవసరం. జీవితాన్ని విశ్లేషించుకోడానికీ, జీవితాన్ని అనుభవించటానికీ చదువు అవసరమే. చదువు లేకపోతే జంతుజాలాల్లా గదా జీవిస్తాం!

అయితే తాతయ్య చదువెందుకు అవసరమన్నాడు? ఆ మాటే గొంతులో చేపముల్లులా మనసులో గుచ్చింది. 'సావుకార్ల తిరకాసు లెక్కల్ని కనిపెట్టవచ్చు' అన్నమాట... బంతిలో అనేక ఆలోచనల్ని రేపింది. అదే! ఆ షావుకార్ల తిరకాసు లెక్కల్ని కనిపెట్టే తిరుగుబాటు చేసారు తన తల్లిదండ్రులు! మనసులో తాత, తండ్రీ... భీముడూ కదిలేరు మళ్లీ ఒక్కసారిగా! దీర్ఘంగా నిట్టూర్చి ఆలోచిస్తానంది ముత్తాతతో బంతి!

బంతి ఆలోచిస్తానన్నాక మూడోరోజుకే సామంతు తన యింటి యెదురు ఖాళీ జాగాలో బడిసాల లేపించేడు. ఊరిలో పిల్లల్ని బడికి రప్పించేడు. బంతి పిల్లలకు ఓనమాలు నేర్పుతోంది.

ఇదే అదనుగా పెద్దలు గూడా సాయంత్రాలు సంగీతం నేర్పమని బంతిచుట్టూ చేరసాగేరు. ఇపుడు బంతిని అందరూ 'గురువమ్మ' అనే పిలవడం ఆరంభించేరు. ఆఖరికి ఒక్కోసారి ముత్తాత గూడా హాస్యానికి 'గురువమ్మా' అని పిలిచేవాడు. బంతి ఉడుక్కునేది. చిరుకోపం ప్రదర్శించి అలుకబూనేది. మనవరాలి అలుక తీర్చటానికి ముత్తాత చెవుల్ని చేతివేళ్లతో పట్టుకొని గుంజీలు తీసేవాడు! ఓరోజు ముత్తాత గుంజీలు తీస్తుంటే పరుగు పరుగున వచ్చేడు సొంబరి. వచ్చి-

"సామంతూ, సామంతూ! చూసేవా అన్నేయిం? ఆ పారెస్టుగార్డు గాడుకి లంచమివ్వలేదని ట్రాక్టరుతోటి నీలగిరి మొక్కల్ని దెచ్చి కూలోలిచేత మన జిరాయితీ భూమిల నాటించేస్తండు'' అని చెప్పాడు.

సామంతు, సొంబరి తెచ్చిన వార్తకు ఆవేశంగా లేచి-

"ఎవుడొరే, ఎవుడా గార్డు? మా జిరాయితీ భూమిల నువ్వు మొక్క పాతితే నీ పీక తీసి అక్కడే గుమ్మిదీసి పాతేస్తాను'' అంటూ కోపంతో కేకలేస్తూ యింట్లోకెల్లి గండ్రగొడ్డలి అందుకొన్నాడు.

బంతికి అంతా అయోమయంగా ఉంది. ముత్తాత అంత రౌద్రంగా బయల్దేరేసరికి భయం వేసింది! గభాల్న తాతయ్యను అడ్డేసి, గొడ్డలి లాక్కొని పక్కన పడేసి-

"ఎందుకు తాతా అంత ఆవేశం? పదా, నేనూ వొస్తాను. ఆ గార్డుని అడుగుతాను'' అని చెప్పి సామంతుతో గార్డుదగ్గరకు వెళ్లింది.

కొండ దిగువ ఇసుక గుడ్డిలమీద ట్రాక్టరు ఆగివుంది. దాని నిండుగా నీలగిరి మొక్కల అంట్లు వున్నాయి. ట్రాక్టరు దగ్గర పదిమంది దాకా కూలీలున్నారు. వాళ్లముందు గార్డు గెంతుతున్నాడు కేకలేస్తూ!

"ఈ కొండ యెవుల్ది? ఈ కొండనాకొడుకుల్ది గాదు. ఆ అడివి యెవుళ్ది? ఆ సవర నాకొడుకుల్ది గాదు. సర్కారు వోరిది! నీనెవుడ్ని?

సర్కారు మనిషిని? సర్కారువోరి ఆస్తి మీద... సర్కారువోరి మనిషికి అధికారం ఉంటాదా? ఉండదా? చెప్పండొరే చెప్పండి'' అని కేకలేస్తూ కూలీల్ని ప్రశ్నిస్తున్నాడు.

అప్పటికే ఆయనకు తాగిన జీలుక్క ల్లు... తలకి యెక్కుతోంది. ఇదెక్కడి తగ వురా నాయనా అనుకొని కూలీలు-

"యీ మొక్కలు యెక్కడ నాటాలో చెప్పు గార్డుబావూ'' అనడిగేరు! ఆ ప్రశ్నకు గార్డు-

"ఎక్కడేనా నాటండి. పర్లేదు. ఎవడడగ



లేడు. ఈ యేరియా ఓలు మొత్తం సర్కారుది! నాటీయండొరో... నాటీయండి'' అన్నాడు గార్డు. ట్రాక్టరులో మొక్కలు కొన్ని తీసి మోసుకొని ఇసక గుడ్డిలులో, దున్ని, సాగుచేసిన భూమిలో వేసారు. ఒక్కోటీ... తీసి నాటుదామని అనుకుంటున్నారు కూలీలు!

అప్పటికి చేరారు బంతీ, సామంతూ, సోంబరి! వీళ్ల వెనుకనే ఊరి జనాలు గూడా వస్తున్నారు.

"ఇంటిలే నాటడంకి వొచ్చేవుగాదు... నీ సంగతీ, నీ గవర్మెంట్ సంగతీ తేల్సేద్దును'' అన్నాడు సామంతు.

"పోనిపుడు నీ జిరాయితీ అంటన్నావుగదా? అందులో నాటిస్తాను. ఏటి తేలుస్తావో తేల్సమీ?" అని గబగబా కూలీలవైపు నాలు



సామంతు వస్తూనే గార్డుతో-

"నీలగిరి మొక్కల మా జిరాయితి భూమిల నాటమని గవర్మెంటు సెప్పిందా నీకు?" అనడిగేడు కోపంగా.

గార్డుకి కళ్లు ఆనటంలేదు. ఒళ్లంతా జీలుగుకల్లు మత్తుతో తేలిపోతోంది. సామంతు మాటలకి... మరింత హేళనగా-

"గవర్మెంటు సెప్తే జిరాయితి భూమిలేటిరా ఖర్మ.... నీ యింటిల నాటించేస్తాను. తెల్సిందా?" అన్నాడు.

గు అడుగులు వేసి-

"ఓర్రేయ్... లేబరూ! ఆ మొక్కల్ని అది గోరా... ఆ పక్క యిసక గుడ్డిల నాటండ్రా. సుత్తాడట... సామంతు!" అని కేకేశాడు.

"నాటినోడిపనీ, నాటమని సెప్పినోడిపనీ అయిపోతాది'' అని చేతిలో దుడ్డుకర్ర ఎత్తి పరుగెత్తాడు సొంబరి!

సామంతు ఆవేశంతో ఊగిపోతున్నాడు - గానీ అడుగులు వేగంగా వేయలేకపోతున్నాడు. బాగా వయసుమీరిందిగదా! పూర్వపు తిండీ, పూర్వపు అలవాట్లూ గనక ఆ వయసులో యింకా తిరుగాడుతున్నాడు.

సొంబరి పరుగెత్తితే బంతీ పరుగెత్తింది. ముందు గార్డును ఆపి-

"జిరాయితీ భూములమీదే మొక్కలు నాటాలా? బోల్డు కొండభూములున్నాయి! అక్కడ నాటించండి. ఎందుకు అనవసరంగా... వాళ్లని యిబ్బంది పెడతారు?" అనడిగింది.

గార్డు బంతిని యెగాదిగా చూసేడు. తాగిన కల్లు మనిషిని కైపులోకి దించేయి.

"నువ్వెవర్తివి? సూడ్డానికి పల్లపుదాన్లాగున్నావు! నీ సోకూ టీకూ కొండల్లోనైపోయింది, పట్నంలో అయితే... నీ కాళ్లకాడ కనకరాసులు కురుస్తాయి..." అన్నాడు గార్డు.

బంతికి కోపం ముంచుకొస్తోంది. కానీ నిగ్రహించుకుంది నిదానంగానే.

"నేనీ సామంతు మనవరాల్ని. వీళ్లలాగ యేమీ తెలీనిదాన్ని కాను. నువ్వు ఏ యాక్టు ప్రకారం యీ మొక్కల్ని నాటుతున్నావ్? నీకున్న ఆర్డర్ చూపించు! లేకపోతే ముందిక్కడ్నించి నడువ్. లేదా ఐవిల్ రిపోర్ట్ ఎగెనిస్ట్ యువర్ ఎట్రాసిటీస్'' అని యింగ్లీషూ, తెలుగులోనూ... ప్రశ్నించింది.

దాంతో గార్డు కొద్దిగా మత్తు దిగి, తగ్గేడు. తగ్గి, మళ్లీ యేదో జ్ఞప్తికొచ్చి-

"నువ్వేదో యింగిలిపీసుల పీస్‌పాస్ అంటే జడిసిపోడానికి యీడు జడ్డోడుగాదు... గార్డు! డ్యూటీమీద వొచ్చిన గవర్నమెంట్ సర్వెంట్‌ని డ్యూటీ చెయ్యకుండా అబ్‌స్ట్రక్ట్ చేసేరని కేసెడతాను. మిమ్మల్నందర్నీ జెయిల్ల తొయ్యించుతాను. తెల్సిందా??" అని బెదిరించేడు.

ఆ బెదిరింపులను లెక్కజెయ్యకుండా బంతి-

"అన్యాయంగా జిరాయితీ భూముల్లో గార్డేగాదు... గవర్నర్ దిగినా అడ్డుతాం! ఏ కేస్ పెడతావో పెట్టుకో! ముందు మొక్కల్ని తీసుకొని యిక్కడనుంచి వెళ్లు!" అంది ఆవేశంగా.

ముత్తాత ఆనందంగా చూస్తున్నాడు బంతిని.

సొంబరి దుడ్డుగర్రతో యిసుక గుడ్డిల మీద కూలీల్ని తగిలేస్తున్నాడు. ఊరిలోంచి జనాలు చేరిపోయేరు. అందరూ కేకలేస్తూ వచ్చేసరికి గార్డు భయపడి పారిపోయేడు.

పరుగెడుతోన్న గార్డుని చూస్తే అసంకల్పితంగానే బంతికి నవ్వొచ్చింది! నిర్మలంగా, నిర్భయంగా బంతి నవ్వింది.

ఇపుడు బంతికి ప్రపంచమంతా యెక్కడికి వెళ్లినా, ఏ మూలకి వెళ్లినా తమ బతుకుల్లో ఈ సంఘటనలు తప్పవని తెలిసొచ్చింది. జొమ్మలస, బట్టొలస, గెడ్డొలస... యే వలస అయినా ఒకటే! అడవి మృగాల మధ్య, అపాయాలమధ్య జీవితం సాగించే ఆదివాసీ జీవితం ఎక్కడైనా ఒకేతీరుగా వుంటుందని అర్ధమైంది. అడవిలో తనని తాను రక్షించుకోటానికి సహజావసరమైన ఆయుధాలూ ... సవరజీవికి... సంఘర్షణా అనివార్యమవుతోందని... తానూ సంఘర్షణకు సంసిద్ధమయ్యేక తెలిసొచ్చింది బంతికి!

ఇపుడు బంతి సంఘర్షణను అనివార్యం చేస్తోన్న వ్యక్తులనూ, వ్యవస్థనూ ద్వేషిస్తూ ఓనమాలు దిద్దిస్తోంది వలసచేత!







# ఏరిన ముత్యాలు

☆ తోటివారిపట్ల సానుభూతి చూపలేని వ్యక్తి కఠినాత్ముడు.

-వివేకానంద

☆ పంచుకున్న ఆస్తులు నిలువకపోవచ్చును. కానీ పంచుకొన్న ప్రేమ మాత్రం చివరివరకు నిలుస్తుంది.

-చలం

☆ పుస్తకాలవల్ల నిజమైన ప్రయోజనం, మనస్సును ఆలోచన అనే వలవేసి పట్టుకోవడమే.

-క్రిస్టఫర్ మోర్లే

☆ విద్య నీకు జీవితంలో ఒంటరిగా నడవడం నేర్పుతుంది.

-హార్న్

☆ ఏ కాలానికి చెందిన సాహిత్యమైనా, అది ఆకాలంలో వాడుకలో వుండే పద్ధతులకు దర్పణమే!

-నేషన్

☆ సమాజాన్ని సంస్కరించటాన్కి సాహిత్యం ఒక సాధనంగా ఉపయోగపడు తుంది.

-శంకర్‌దయాల్‌శర్మ

☆ సంఘ సంబంధాల్లో సమానత్వాన్ని ఆచరణలో చూపకపోతే శాంతి గురించి మాట్లాడటం అర్థరహితం.

-గోరా

☆ మాట విననివాడు చెవిటివాడు కాదు. మంచి మాటను వినిపించుకోనివాడు మాత్రమే నిజమైన చెవిటివాడు.

-శంకరాచార్యులు

☆ అనుభవించడం జరగగానే అది అనుభూతి అవుతుంది. అలా అది గతానికి సంబంధించినదైపోయి జ్ఞానం క్రిందచలామణి అవుతుంది.

-జిడ్డు కృష్ణమూర్తి

☆ స్వర్గమనే కల్పన మనస్సును సమాధాన పెట్టుకోవడానికి బాగానే వుంటుంది.

-గాలిబ్

☆ ఒకగంట మాత్రమే అయినాసరే జీవితాన్ని వ్యర్థం చేసేవ్యక్తి జీవిత విలువలను అర్థం చేసుకున్నవాడు కాజాలడు.

-డార్విన్

☆ బోధించే విధానం ఎలా వుండాలంటే వినేవారు ఆత్మశోధన చేసుకొనే దిశగా మరల్చేట్లు వుండాలి.

-గెలీలియో

---

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్




**డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన, నవలల పోటీలో సాధారణ ప్రచురణకెన్నికయిన వి.ఆర్. రాసాని నవల 'మట్టి బతుకులు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## 'స్ఫూర్తిదాయకం'

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

'మట్టి బతుకులు' దళితవర్గాల బతుకు తీరును బాగానే చిత్రీకరించినప్పటికీ కొన్ని సంఘటనలు మరీ సినిమాటిక్‌గా, అసహజంగా ఉన్నాయి. బుడ్డన్ననూ, మునెప్పనూ, మంగమ్మనూ, రాజమ్మనూ ఇంతమందిని వరదయ్యలాంటి ఒక గ్రామ పెద్ద కేవలం లైంగిక సంబంధపరంగా హత్యలు చేస్తే సరే, ఆ గ్రామ ప్రజలు మట్టిమనుషులూ చైతన్య రహితులూ గనుక నిలదీయలేకపోయారనే అనుకుందాం. కానీ ఈ బ్యూరోక్రటిక్ వ్యవస్థలో తమ జేబులు నింపుకోవడానికైనా ప్రభుత్వ యంత్రాంగం ఆ గ్రామ పొలిమేరలకైనా వెళ్లకపోవడం అసహజంగా ఉంది. మాతంగి బావిలో పడిపోతే శివదాసే రక్షించడం, నరసంచారం లేనిచోట మాతంగి ఒంటరిగా మునెప్పచే బలాత్కారానికి గురిగావడానికి వేచి వున్నట్లు ఉండటం, ఆమెను రక్షించడానికి ఎక్కడినుండో శివదాసు ఊడిపడడం పూర్తి సినిమా ఫక్కీలో ఉంది. ఇంత జరిగినా కనీసం తన తల్లిదండ్రులకైనా చెప్పుకుని మునెప్పను ప్రశ్నించకుండా ఉండే సహనం పురుషాహంకారానికి ఊతం ఇచ్చేలా ఉంది.

బాలకిష్టన్ని కథ ప్రారంభంలో చుక్కమ్మ తమ్ముడని చెప్పి ఆ తర్వాత మాతంగికి తమ్ముణ్ణి చేశారు. ఒక ఈనిన పంది తన కూనల రక్షణకు పడిన ఆరాటాన్ని ఎంతో




బాగా చిత్రించిన రచయిత ముక్కు పచ్చలా రని బాలకిష్టున్ని వరదయ్య చంపితే మాన వులైన రత్తయ్య, ఆదెమ్మల కన్న పేగు ప్రతిస్పందన చెందకపోవడం చాలా అసమ గ్రంగా ఉంది. పాత్రల నోరు మూ యించారెందుకు?

మాతంగిని బసివిగా మార్చిన తర్వాత గ్రామానికి తిరిగి వచ్చిన శివదాసు అసలు మాతంగిని కలిసే ప్రయత్నమే చేయకపో వడం, తన పనేదో తాను మామూలుగా చేసుకుపోవడం, మాతంగి సైతం తన మన సెరిగిన ప్రేమికునికి తాను వంచింపబడ్డ విధం తెలియజెప్పకుండా ఉండటంతో వారు చేసుకున్న బాసలనూ, వారి ప్రేమానురాగాల నూ అవహేళన చేసినట్టు అయింది. తీవ్ర అణిచివేతలో పెల్లుబికిన ఉప్పెనలాంటి ప్ర జారాసి ఆవేశానికి వరదయ్యను చిక్కకుండా జేసి శివదాసు, మాతంగులే అతన్ని చంపి పారిపోవడమనే చర్య పలాయనవాదాన్ని, వ్యక్తిగత హీరోయిజాన్ని గొప్పజేస్తూ సామూ హిక చైతన్యానికి, సమిష్టి ఉద్యమాలకూ సరియైన ప్రాముఖ్యత లేకుండా చేయడం జరిగింది. అణిచివేత, అరాచకాల గర్భంనుండే తిరుగుబాటు బాపుటా ఎగురు తుందని అంతిమంగా చెప్పిన సారాంశమే కొంత స్ఫూర్తిదాయకంగా ఉంది.

-వి. పెంటయ్య
కరీంనగర్
505002

## 'చక్కని నవల'

**(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)**

ప్రశాంతతకు నెలవులని చెప్పబడే గ్రామీణ ప్రాంతాల్లోని బడుగుజీవుల బతుకులను, తెర ముందు కాక తెరవెనుక జరిగే నగ్న సత్యాల ను వెలికితీసి బయటి ప్రపంచానికి 'మట్టిబ తుకులు' నవల ద్వారా తెలియజెప్పటంలో కృతకృత్యులయ్యారు రచయిత. స్త్రీలు కే వలం వరకట్నాల సమస్యతో మాత్రమే కాదు, వరదయ్యలాంటి కామపిశాచుల దా హానికి మాతంగిలుగా, బసివిలుగా మారిపో తూ, గ్రామీణుల అజ్ఞానానికి, అమానుషత్వా నికి బలైపోతూ జీవచ్ఛవాలుగా ఉన్నారని తెలిసేలా చిత్రించారు.

జన చైతన్యానికి, వరదయ్య అరాచకాలు వెలుగు చూడటానికి, ఊరివారిలో ద్వేషం స్థానంలో ఐకమత్యం చోటు చేసుకోవటానికి కారణమైన శివదాసు జీవితంలో మాత్రం అనుకున్న కోరిక నెరవేరకపోవటం బాధా కరం. తన విలాసానికి, కామానికి తన కన్నకూతురే వస్తువైతే ఎటువంటి తండ్రైనా సిగ్గుతో, పశ్చాత్తాపంతో కుంచించుకు పోవ లసిన పరిస్థితి. అటువంటి పరిస్థితిని ఎదుర్కొనీ మరలా మాతంగిని చెరపట్టాల నుకునే సంఘటన వరదయ్య నీచత్వానికి, క్రూరత్వానికి పరాకాష్ఠ. ఆ పరాకాష్ఠను శివదా సు వరదయ్య తలను నరికి చంద్రచెట్టులోకి ఎగురవేయటంతో ముగించటం చక్కనిది.

పెద్ద మనుషులు తమ స్వార్థం కోసం దొంగసారాను తయారుచేయిస్తే, దానివలన ప్రాణాలు కోల్పోయిన అభాగ్యులను తల్చు కుంటే గుండె తరుక్కుపోతుంది. దారిద్ర్యం వలన చదువుల తల్లికి దూరమవుతున్న బాలకిష్టుడి లాంటి మేధావులను ఎంత మందిని మనం చేజేతులారా పోగొట్టుకుంటు న్నామో!

ఇటువంటి విషయాలతో ఆలోచింపచేసే దిగా ఉన్న చక్కని నవల 'మట్టిబతుకులు'.

-బోయలకుంట్ల శ్రీదేవి
తిరుపతి
517501

## 'దళిత పోరాట ప్రతీక'

**(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

ఈ దేశ అభివృద్ధికీ, దోపిడీ వ్యవస్థకూ పెద్ద గుర్తయిన నేటి పీడిత కులాల వాస్తవ జీవన

దుస్థితిని 'మట్టిబతుకులు' నవల ద్వారా అందించిన చతురకు అభినందనలు. తాము సర్వహక్కుల్నీ కోల్పోయి, సర్వ మర్యాదలకు, సర్కారీ గుర్తింపులకూ నోచుకోక అంటరానితనంతో దూరంగా బతుకుతూ అజ్ఞానాంధకారంలో మగ్గిపోతున్న జమిలిగడ్డగూడెం లాంటి పల్లెలుండడం స్వతంత్ర భారతదేశ చరిత్రకే అవమానం. అణగారిన కులాల్లో పుట్టిన కారణంగా ఆకలి, అవిద్య, సాంస్కృతిక వెనుకబాటుతనం మొదలయిన వాటికి గురికావాల్సి రావడమేకాదు, వరదయ్య, సాంబయ్య, మునిరాజులవంటి దుర్మార్గుల చేతుల్లో కులాల పేరుతో, ఆచారాల పేరుతో ఇంకా ఎన్నో విధాలుగా వేరు చేయబడ్డారు కూడా. 'పెద్దగుడెసెల్లో మనుషులు నివసిస్తే చిన్న గుడెసెల్లో వారు మేపుకొనే పందులు నివసిస్తుంటాయి' అంటూ పందుల్తో సహజీవనం సాగించే దౌర్భాగ్యస్థితిని కళ్లకు కట్టినట్లు చూపించారు రచయిత. కామాంధుల కర్కశత్వానిక బలయిపోయిన రాజమ్మ, మంగమ్మ, నాగమ్మలూ, ఏదో ఒకలా సుఖంగా బతుకుదామని ఆశపడే బుడ్డన్న, మునెప్పలూ మట్టిలోనే కలిసిపోయారు. ఎలక్షన్ సందర్భంగా పంచిన సారా తాగి ఉప్పుతోళ్ల రాముడు, గంగడు మరికొందరు నెత్తురు కక్కుకొని చచ్చిపోతే చక్కగా చదువుకోవాలని ఆరాటపడే బాలకృష్ణుడు తప్పతాగిన వరదయ్య, మునిరాజుల పైశాచికానందానికి ఆహుతైపోయాడు. వీళ్లంతా కనీస సుఖాలకీ, సౌకర్యాలకీ, ప్రేమలకీ, చదువులకీ ఆజన్మాంతం నోచుకోలేని నిర్భాగ్యజీవులు.

'జమిలిగడ్డగూడెం' జనం తిరుగుబాటు తమకి అన్యాయం చేస్తున్నవారిని అంతం చేయాలని నేటి పీడిత కులాల్లో నిద్రాణంగా దాగివున్న ప్రతిఘటనా పోరాటానికి గుర్తు. "మట్టి పిసికే ఈ సేతుల్తో మన బతుకుల్ని ఇట్ట కూల్చేసిన ఆ నాకొడుకులకు ఇదే తావన పాడె కట్టేద్దాం" అంటూ కసితో వాళ్లంతట వాళ్లే పోరాడ్డానికి ముందుకురుకుతారు. ఈ మట్టిబతుకుల్లో సామాజిక స్పృహ, సాంఘిక అవగాహన లేకపోయినా శతాబ్దాలుగా దోపిడీల ఉక్కు చట్రంలో ఎందుకు నలిగిపోవాల్సి వచ్చిందీ అన్న అంశం అర్థం కాకపోయినా, ఆచారాల పేరుతో, సాంప్రదాయాల పేరుతో ఏఏ ఉచ్చులు పన్ని, వలలు విసిరి గంతలు కట్టి తమర్నే విధంగా బలిపశువుల్ని చేసిందీ చివరకు గ్రహించారు. అందుకే 'ఈ తెగలు, ఈ కులాలు ఈ మడుసులు బెట్టుకున్నవేరా? ఈ గాలి, నేల, ఆకాశం అన్నీ అందరికీ సమానమేరా. పుడతానే ఎవురూ లబ్బెతో పుట్లేదురా! మద్దెలో మన్లాంటోళ్లను కులాల పేరుతో మతాల పేరుతో ఆశారాల పేరుతో ఇంకా ఎన్నెన్నో రీతులుగా యేరుసేసి దోచుకొని కొందరు మాత్రమే సావుకార్లయిపోతా వుండారు. మన్లాంటి పేదోళ్లంతా కులాల అడ్డుగోడలు పగులగొట్టుకొని ఒకటిగా ముందుకు రావాల్రా' అంటూ కిష్టుడి చేత రచయిత చెప్పిస్తారు. ఆర్థిక అసమానత్వం దోపిడీల అంతం కోసం, సాంఘిక న్యాయం కోసం అనాదిగా దళితులు సాగిస్తున్న పోరాటానికి ప్రతీకగా రాసిన రాసాదిగార్కి శుభాభినందనలు.

-మాచర్ల సూర్యనారాయణ
ఎం.సింగుపురం
532462

## 'కొత్తదనంలేదు'

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

డబ్బుతోపాటు అధికారం కూడా చేజిక్కించుకున్న వరదయ్యలాంటి పెద్ద మనుషులు, చిన్నచేపల్ని పెద్ద చేప మింగివేయటం చందాన, తన క్రింద పనివాళ్లని అన్ని విధాలుగానూ దోపిడీ చేయటం స్పష్టంగా చిత్రీకరించారీ నవలలో రచయిత. కానీ ఈ దోపిడీ అన్న అంశం మీద యిదివరలో కోకొల్లలుగా వచ్చాయి నవలలు. ఈ కథనంలో వైవిధ్యం అంతగా లేదనే చెప్పాలి.




వరదయ్య ఆడవాళ్ల వెంటపడటం, వాళ్ల మీద కన్నువేసి వాళ్ల బతుకుల్ని నాశనం చేయటం, అతనికి వత్తాసు పలికే పాపయ్య, సాంబయ్య, మునిరాజుల పాత్రలు, వాళ్ల మూకుమ్మడి పాపపు చర్యలు ఓ సినిమా చూస్తున్నట్టుగానే అనిపించింది.

త్రిపురసుందరి మునెప్ప వెంటబడినట్టుగా చిత్రింపబడినా ఆ తర్వాత మాతంగిని బసివిని చేయకుండా తన తండ్రి అక్రమాలకు ఆనకట్ట వేయటానికి ఆమె చేసిన సాహసం చివరలో సానుభూతిని సంపాదించుకుంది.

కొన్ని కుటుంబాలలో తొలి ఆడపిల్లను బసివిగా మార్చి బిచ్చమెత్తుకోమనటం, పెద్ద బోయసాని ఆచారం, వినటానికే విడ్డూరంగా వున్నాయి. రంగసానిలాంటివాళ్లు స్త్రీ జాతికి ఎలా అన్యాయం చేస్తున్నారో చదువుతుంటే బాధ కలిగింది.

తినటానికి కడుపునిండా తిండీ, కట్టుకోవటానికి నిండైన బట్టా లేకపోయినా మట్టి తెగవాళ్లు, వుప్పు తెగవాళ్లూ కులాలు, కులాలంటూ కొట్టుకోవటం, వాళ్ల బలహీనతని ఆసరాగా తీసుకుని వరదయ్య లాంటివాళ్లు వాళ్లని రెచ్చగొట్టి తమ ప్రయోజనాలని నెరవేర్చుకోవడం కుల వ్యవస్థ వెనుకబడిన వర్గాల్లో కూడా ఎలా దెబ్బతీస్తోందో తెలియజెప్పుతున్నట్టుగా వుంది.

ఈ అరాచకాల, అన్యాయాల మధ్య మంగి, త్రిపురసుందరి, మాతంగి మధ్య బాల్యస్నేహమాధుర్యం మండుటెండలో పన్నీటి జల్లులా వుంది.

అయితే నవలకి ఎన్నుకున్న విషయంలో మాత్రం కొత్తదనం ఏమీలేదనే చెప్పాలి.

**-ఎం.ఎస్.ప్రసాద్**
బెంగుళూర్
17

## 'నమ్మశక్యంగా లేదు!'

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**ఈ** రాకెట్టు యుగంలోనూ పెత్తందార్లు మారుమూల పల్లెల్లో, మూఢనమ్మకాల్లో మగ్గుతున్న అమాయకుల్నే విధంగా అణచివేస్తున్నారో వివరంగా తెలుపుతుందీ నవల. మట్టి బతుకులు బతికే పందులోళ్ల జీవిత విధానాలైన పందుల పెంపకం, ఇటుక బట్టీల తయారీ, జంతుబలులపై రచయితకు చక్కటి అవగాహన ఉంది. పాత్రోచితమైన భాషలో ఓ విస్మృత సంస్కృతిని పాఠకులకు పరిచయం చేయడంలో రచయిత కృతకృత్యులయ్యారు. త్రిపురసుందరి, మునెప్పల రహస్య ప్రణయగాథ, 'ఇంత బరితెగించిందా దొంగముండ. అయినా ఆ నా కొడుక్కి ఎంత ధైర్యం' అని వరదయ్య వదరటాలు సహజంగానే చిత్రీకరింపబడ్డాయి. సాయంత్రం పూట గోంగూరకని వెళ్లిన రాజమ్మ శీలాన్ని నాయకుడు, ఆ తర్వాత వరదయ్య, మునిరాజు కార్యకర్తలు దోచుకొని తమ దాహాన్ని తీర్చుకున్నారు. లేతగోగాకు మెత్తగా నలిగి పోయింది. అనే వాక్యాలు ఆ దోపిడీ దొంగలపై అసహ్యం కలిగిస్తాయి.

మాతంగిని బసివినిగా చేయించిన విధానాన్ని కనులకు గట్టినట్లుగా వర్ణించిన రచయిత ఈ విషయం ఆమెను ప్రాణప్రదంగా ప్రేమించే శివదాసుకు తెలియదనటం నమ్మశక్యంగాలేదు. చేయడానికి పని, తినడానికి తిండిలేక కరువు రక్కసి విలయతాండవం చేసే రోజుల్లోనే ధనవంతుల దౌష్ట్యానికి చలించని పల్లీయులు, కథాంతంలో కల్తీ సారా మరణాలను చూసి తిరగబడినారని రాసి, మనసును కదలించగలిగే రీతిలో ముగించడానికి వీలున్న కథను రచయిత పేలవంగా ఎందుకు ముగించారో అర్థం కావటంలేదు.

**-షాలీ రహంతుల్లా**
అనంతపురం
515004

# చతుర కథలు

## బాలవాక్యం...!

"ఇల్లెగిరి పోయేలా సౌండ్‌పెట్టుకుంటే తప్ప పాటలు వినబడవు కాబోలు'' కాస్త గట్టిగానే అరిచింది వాసంతి.

అప్పుడామె పెరట్లో బట్టలు ఉతుకుతోంది.

"ఆ... బండకేసి చచ్చేలా బాదితే తప్ప కుళ్లొదల్దు మరి'' అంది భవాని వాసంతికి వినబడేలా.

వాళ్లిద్దరూ పక్కపక్క ఇళ్లలో పెరటి గోడ కటూ ఇటూ ఉండి అస్త్రాల్ని సంధించుకోవడంలో నిమగ్నులై ఉన్నారపుడు. క్రిందటి రోజువరకూ ప్రాణ స్నేహితురాళ్లలా ప్రవర్తించిన వాళ్లే ఇద్దరూ.

వీధి చివర్న ఉన్న కూరల మార్కెట్‌లో అర్ధరూపాయి పెట్టి అల్లం ముక్క కొనాలన్నా, రెండు కిలోమీటర్ల దూరంలో సిటీలో ఉన్న బట్టల దుకాణాలకు వెళ్లాలన్నా కలిసే తప్ప విడిగా వెళ్లేవారుకారిద్దరూ.

ఇద్దరూ సమవయస్కులు కావడం, ఇద్దరి భర్తల సంపాదనలూ ఇంచుమించు సమానంగా ఉండడం, అందచందాల్లో కూడా దగ్గర పోలికలుండడంతోపాటు, వాసంతి కొడుకు చంటీ, భవాని కొడుకు బుజ్జీ ఒకే స్కూల్లో యూకేజీ చదువుతోండడం వారిద్దర్నీ ఆరోజు కారోజు దగ్గరయేలా చేసింది.

ముందురోజు సాయంత్రం ఏడుస్తూ ఇంటికొచ్చిన చంటిగాణ్ణి చూడగానే వాసంతి మాతృహృదయం తల్లడిల్లిపోవడంతో కథ మలుపు తిరిగింది.

అదే సమయానికి 'అమ్మా అమ్మా' అని వెక్కుతూ ఇంట్లోకి వచ్చిన బుజ్జిగాడి బుగ్గల మీద ఎండిపోయిన కన్నీటి చారల్ని చూసిన భవాని గుండె కరిగి నీరైపోయింది.

మరో గంటకు ఇళ్లకొచ్చిన మొగుళ్లను గుమ్మాలవద్దే కాపుకాసి ఇంట్లోకి తీసుకుపోయి ధడాల్మని తలుపులు బిగించి ఇద్దరూ ఒకే మాటన్నారు తమ భర్తలతో, వీళ్ల పొరుగున మనముండలేం రేపీసరికి మరో ఇంట్లోకి మారిపోవాల్సిందే!"

భార్య చెప్పింది విని, వాసంతి భర్త ఆశ్చర్యంతో కళ్లెగరేస్తే పెళ్లాం చెప్పింది ఓ పట్టాన నమ్మలేదు భవాని భర్త.

చంటిగాడి సాయంతో వాసంతీ, బుజ్జిగాడి ఏడుపుతో భవానీ, తమ భర్తల బుర్రల్ని తమవైపుకు తిప్పుకోగలిగారు కాస్సేపటికి.

తత్ఫలితంగా భోజనాలయ్యాక, ప్రతిరోజూ కాస్సేపు రెండు పోర్షన్‌లకూ ఉమ్మడిగా ఉన్న అరుగుమీద కూర్చునే మగవాళ్లిద్దరూ ఆరోజు, బిగించబడిన తలుపుల వెనుకే కాలక్షేపం చేశారు.

రోజూ, పేపర్లో వార్తల్ని కలిసి ముచ్చటించుకున్న తర్వాతే, దైనందిన కార్యక్రమాలు ప్రారంభించే మగవాళ్లిద్దరూ మర్నాడుదయం పలకరించుకునే ప్రయత్నం కూడా చేయలేదు.

ఆరోజుదయం తొలిసారిగా భవానితోడు లేకుండానే కూరల మార్కెట్‌కు వెళ్లి వచ్చింది వాసంతి.

తనూ తక్కువ తినలేదన్నట్టుగా, వాసంతిని సంప్రదించకుండానే పొద్దుటే ఇంటికొచ్చిన స్టీలు గిన్నెల వాడి దగ్గర స్టీలు డబ్బా ఒకటి కొంది భవాని, పాత బట్టలుమార్చి.





పిల్లలూ, మొగుళ్లూ ఇల్లొదిలి బయటకు వెళ్లాక పెరట్లో గోడకటూ ఇటూ చేరి వాగ్బాణాలు సంధించుకుంటూ తమ మనసుల్లోని ఉక్రోషాన్ని కనీస స్థాయికి దించుకుందుకు శతవిధాలా ప్రయత్నిస్తున్నారిద్దరూ.

మధ్యలో అలిసిపోయినపుడల్లా, వంటింట్లోకి వెళ్లి బోర్న్‌విటానో, హార్లిక్సో తాగొచ్చి మళ్లీ ఒకరిమీదొకరు నోరు పారేసుకుంటున్నారు.

భారత్, పాక్ సరిహద్దు తగాదాలా ఎంత సేపటికీ వారి మనసుల్లోని ఉక్రోషం చల్లారదు.

అరిచి అరిచి నోళ్లు నొప్పి పుట్టాక, తలోకాస్తా ఎంగిలిపడి మగత నిద్రలు పోయారిద్దరూ.

ఆ కలత నిద్రలో ఒకరి జుట్టు మరొకరు పీక్కున్నట్టూ, చీపుళ్ల తిరగేసి గదా యుద్ధం చేసినట్టూ మధురాతి మధురమైన కలలొచ్చాయిద్దరికీ.

పీడకల కలిగించిన పరవశానికి ఉలిక్కిపడి లేచి, వంటింట్లోని సామాన్లన్నిటినీ అట్టపెట్టెలోనూ. గోనెసంచులోనూ సర్దడం ప్రా




డంలేదు.

మరి కాస్సేపటికి అమెరికా, రష్యాల ప్రతినిధుల్లా ఇరుగింటి విశాలాక్షీ, పొరుగింటి కామాక్షీ చెరో ఇంట్లోనూ ప్రవేశించి తమ దగ్గరున్న అస్త్రాల్నీ, టెక్నాలజీనీ వాళ్లిద్దరికీ అందచేశారు. డబ్బులు తగలబెట్టుకుని మార్నింగ్ షోలకు వెళ్లడంకంటే ఇదే బాగుందంటే, ఇదే బాగుందని తమలోతాము అనుకుని, తలో కాస్త ఆజ్యమూ పోసి యజ్ఞగుండం ఆరిపోకుండా తమవంతు సహకారాన్నందించి ఎవరి దారినవారు చక్కాపోయారు.

రంభించింది వాసంతి.

పక్క పోర్షన్‌లోని చప్పుడుకు నిద్రాభంగమైన భవాని, మంచంమీది నుంచి ఉరికి, చీరబొడ్లో దోపి, ముందుగదిలోని కుర్చీలూ, బల్లలూ ఓ వారగా చేరవేయడంలో నిమగ్నమైంది.

ఆడవాళ్లిద్దరూ తమ పనుల్లో బిజీ అయిపోయి, మొగుళ్లు తెచ్చే కొత్తింటి కబురు

కోసం వళ్లంతా కళ్లు చేసుకుని ఎదురు చూస్తోండగా, ఒకేసారి 'ఆంటీ' అని అరచు కుంటూ బుజ్జిగాడు వాసంతి పోర్షన్‌లోకీ, చంటిగాడు భవాని పోర్షన్‌లోకీ ప్రవేశించారు.

ఆ ఇంట్లోని వాసంతీ, ఈ ఇంట్లోని భవానీ తెల్లబోయి చూస్తోండగా "ఆంటీ మరేమో.. ఇవ్వాళ మా మిస్ మా ఇద్దర్నీ ఎంత బాగా మెచ్చుకున్నారో తెలుసా?" అంటూ ఏనుగె క్కినంత సంబరపడిపోయారు పసివాళ్లిద్ద రూ.

తన చేయిపట్టుకుని "రా... ఆంటీ" అంటూ ఇంట్లోంచి బయటకు లాగుతోన్న బుజ్జిగాడి మనసులో ఏం ఉందో అర్థంగాక బయటికొచ్చిన వాసంతి, అదే సమయానికి భవాని చేయిపట్టుకుని తమ పోర్షన్‌వైపు లాగుతోన్న చంటిగాణ్ణి చూసి ఎలా స్పందించాలో తోచక, ఇబ్బందిగా నవ్వింది.

"భలే... భలే.. ఆంటీ నవ్వింది. నువ్వు కూడా నవ్వమ్మా!" అంటూ భవాని దగ్గరకు పరుగెత్తాడు బుజ్జిగాడు వాసంతి చేతిని వది లేసి. విషయమేమిటో అర్థం కాకపోయినా తనూ నవ్వింది భవాని.

అదే సమయానికి, రోజంతా సెలవు పెట్టి వీధులన్నీ తిరిగి తిరిగి అలసిపోయి, ఇళ్లు దొరకని విషయం భార్యలకెలా చెప్పాలా? అని మనసులో రిహార్సల్స్ వేసుకుంటూ ఇంట్లోకి ప్రవేశించిన మగవాళ్లిద్దరూ కిలకిలా నవ్వుతోన్న భార్యల్నీ, వారి చుట్టూ తిరుగు తూ దాగుడు మూత లాడ్తోన్న పిల్లల్నీ చూసి ఒక్కక్షణం బిత్తరపోయి, తేలికపడిన మన సుతో హాయిగా నవ్వేశారు.

నవ్వులు సద్దుమణిగాక "నిన్న ఎందు కురా మీ ఇద్దరూ దెబ్బలాడుకున్నారూ?" అనడిగారు మగవాళ్లిద్దరూ ఒకేసారి.

"మేమా? మేమెప్పుడు దెబ్బలాడుకు న్నాం?" అమాయకంగా మొహాలుపెట్టి అన్నారు పిల్లలిద్దరూ ముక్తకంఠంతో.

-సీతాసత్య

## కోరిక

రోజూ రాత్రి భోజనం చేశాక మేడపైకి వెళ్లి ఓ గంటసేపు తన ఇష్టదైవాన్ని ప్రార్థించేవాడు బ్రహ్మానందం. విసుగనేదే లేకుండా నెలల తరబడి తన ప్రార్థన నిత్యకృత్యంలో ఒకభా గంగా మలచుకున్నాడు.

హఠాత్తుగా కరుణించిన భగవంతుడు తీరిగ్గా అతనిముందు ప్రత్యక్షమయ్యాడు ఓ రోజు రాత్రి.

పరమానందభరితుడయ్యాడు బ్రహ్మా నందం.

"భగవాన్! ఈ భక్తుణ్ణి కరుణించడానికి వచ్చావా స్వామీ'' వేనోళ్ల కీర్తించసాగాడు బ్రహ్మానందం.

"మరేం చేయమంటావయ్యా! నీకు రా త్రుళ్ళే దొరికాయా నన్ను ప్రార్థించటానికి? నన్ను డిస్టర్బ్ చేస్తున్నావయ్యా'' కించిత్తు కోపంతో అన్నాడు భగవాన్.

"నన్నేం చేయమంటావు స్వామీ! పగల ల్లా యాంత్రిక జీవనమేనాయె! సిటీబస్సులు పట్టుకుని ఉరుకులు పరుగులతో ఆఫీసుచేరి గొడ్డుచాకిరీ చేసి ఇంటికొచ్చేసరికి నా పొట్టు పగవాడికి గూడా వద్దు అనిపిస్తుంది. మరి నిన్ను కొలవడానికి నాకు తీరికెక్కడుంది చెప్పు" దీనంగా అన్నాడు బ్రహ్మానందం.

"ఊఁ సరే! నీ కోరికేంటో చెప్పు. త్వరగా వెళ్ళాలి. నాకూ పెళ్లాం పిల్లలున్నారు'' భగ వాన్ కంఠంలో తొందర.

"స్వామీ- నాకు చాలా అప్పులున్నాయి. అప్పులవాళ్లు మరీ ఇబ్బంది పెడ్తున్నారు. వారు నన్ను ఇచ్చిన అప్పు అడగకూడదు. కొత్త కొత్త అప్పులు పుట్టేలా గూడా ఆశీర్వ దించు స్వామీ''

"ఇదేం వింత కోరికయ్యా? దీనికిబదులు







నీకు కావలసిన ఆస్తిపాస్తులు సమకూడాలని కోరుకోవచ్చుగా'' సందేహంగా అన్నాడు భగవాన్.

"అమ్మమ్మా, అంత శిక్ష విధించకండి స్వామీ! అప్పుల కోసం నా ఇంటిముందు, ఆఫీసుముందు 'క్యూ' పెరుగుతుంది. అప్పారావుల వత్తిడి నేను తట్టుకోలేను'' ఖచ్చితంగా చెప్పాడు బ్రహ్మానందం.

భగవాన్ ఖంగుతిన్నాడు.

-పంతంగి రవీంద్రశ్రీనివాస్

---

## విరస సరసావళి

మిష్టర్ పండుకి అతని క్లోజ్‌ఫ్రెండు, సీతాలింగం చెప్పిన సలహాలలో ఒకటి...

"కొత్తగా పెళ్ళయినవాళ్లు కొన్ని చిట్కాలు పాటించాలి. రోజుకి కనీసం ఒక జోకైనా వేసి, కొత్త పెళ్ళాన్ని నవ్వించి, ఆహ్లాదపరచాలి''

ఈ సలహా బాగా నచ్చి, ఆరోజు ఎలాటి జోక్‌ని వేయాలో ప్లాన్ చేసుకుని రిహార్సల్స్ చేసుకుంటూ ఇంటికి వచ్చాడు, పండు!

కాఫీ ఇస్తున్న భార్యతో "హాయ్ నంవా!" అన్నాడు పలకరింపుగా.

భార్య అసలు పేరు నందివర్ధనం! "నందీ!" అనీ, "వర్ధనం" అనీ ఎలా పిల్చినా, నప్పలేదు అందుకని షార్ట్‌కట్‌లో "నంవా'' చేశాడు.

ఈ సమస్య గురించే, ఆలోచించి ఆ ఉదయమే ఓ పరిష్కారాన్ని కనుగొన్న ఆ తరుణీలలామ అన్నది, "ఏమండీ! ఇవాళ్టి నుండి నన్ను "వర్ధనీ'' అని పిలవండి, బావుంటుంది కదూ!"

"వావ్''

ఈమధ్యనే అవధులు లేని ఆనందాన్ని ప్రకటించడానికై ఈ ఇంగ్లీష్ కేకను ప్రాక్టీస్ చేసి అలవాటు చేసుకున్నాడు పండు.

"వావ్! వాటే బ్యూటీఫుల్, న్యూ నేమ్, మైడియర్ వర్ధనీ'' అనేసి ఈ నూతన నామకరణ పర్వంలో తను విదిలించవలసిన



జోక్‌ని మర్చిపోయాడు, పండు.

కాఫీ తాగిన తర్వాత అదృష్టవశాత్తూ గుర్తుకు వచ్చిందదది. "హాయ్ వర్ధనీ! నీ జడ అందంగా ఊగుతున్నది మన పప్పీ తోకకు మల్లే!" అన్నాడు. పప్పీ వాళ్ల బుజ్జికుక్కపిల్ల ముద్దుపేరు. వర్ధనికి భర్తవేసిన జోకులో హాస్యం గోచరించలేదు, సరికదా, కుక్కతోకతో తన నిడుపాటికురుల వాలుజడను పోల్చడంతో కోపం వచ్చింది.

"ఆ, అదే! అదే! వర్ధనీ! నా టై ముడివేసి పెట్టు"

'నిజానికి పండు ఉద్యోగానికి నెక్‌టై అవసరంలేదుగానీ, వర్ధనియే, తన భర్తకి "కాస్త స్టైల్‌గా ఉండాలని" టై నేర్పింది. పండుకి కిందా మీదా పడ్డా, నెక్‌టై కట్టుకోవడం చేతకాదు, అందుచేత భార్యను "దాసోహమ్" అనక తప్పటంలేదు.

నిజంగానే వర్ధని "టై నాట్"ని ఇట్టే




వేసేసింది.

అయినా అప్పటికి ఆ అసందర్భోపమానం గుర్చి, తన అలకను బలవంతంగా ఆపుకుంది.

మర్నాడు ఆఫీసుకు వేళఅవుతూన్నదని అలవాటుగా భార్యని హడావుడిగా పిలిచాడు. "వర్ధనం! వర్ధనం" అంటూ.

"అబ్బ! వర్ధనం కాదు, వర్ధని!" కినుక వహించిన "నంవా" ఉరఫ్ "వర్ధని" పొరపాటుని సరిదిద్దింది.

నెక్‌టైకి ముడివేస్తూ తన మెళ్లో మూడు ముళ్ళూ వేసిన ఆ పతిదేవునితో అన్నది వర్ధని.

"ఏమండీ! మీ మెళ్ళో నెక్‌టై ఎంత అందంగా ఉన్నదో, అచ్చు మన బుజ్జికుక్క మెళ్లో పట్కా గొలుసులాగా"

-పి. కుసుమకుమారి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482  Regd. No. H/HD/402